# ప్రకాశకుల మనవి

ప్రపంచంలో ఏ ఒక్కజాతి, తనచుట్టూ గిరిగీసుకొని, ఇతర జాతులతో సంబంధ బాంధవ్యాలు పెట్టుకోకుండా, ఇతరజాతిచరిత్రను తెలిసికోకుండా, ఎన్నడూ పురోభివృద్ధి చెందలేదు. ప్రతిజాతీ, ప్రతి జాతిచరిత్రనూ సహృదయంతో అధ్యయనంచేసి దానిలో మంచిచెడ్డలను గ్రహించ గలిగిననాడే, ఆ జాతిచరిత్రకు సంపూర్ణరూపము కలుగుతుంది.

విశిష్టచరిత్ర కలిగినజాతులలో ఐరిష్‌జాతి ఒకటి. తనపై కత్తి గట్టిన పరమకిరాతకుల హింసాకాండకు గురియై, అవసరమైతే ప్రాణత్యాగాలకు కూడా వెనకాడకుండా, మృత్యువుతో హోరాహోరీగా పోట్లాడి, అచంచలమైన దైవవిశ్వాసంతో ఎట్లా నిలబడగలిగిందో నిజంగా ఆశ్చర్యకరమైన సంగతే.

ఐర్లండు జీవితంలోగల ప్రత్యేకతయే దాని అభ్యుదయానికి ప్రధానకారణం. ఈ విషయాన్నే, ఫాదర్ లాకింగ్‌టన్ ఈ గ్రంథములో విపులీకరించారు. ఈ గ్రంథాన్ని చదువుతూంటే, ఎన్నడో జరిగిన ఘట్టాలన్నీ మన కళ్ళముందు సాక్షాత్కరించి, మనలను తన్మయులుగా చేసివేస్తుంది.

అసలు భాషాంతరీకరణమే కష్టసాధ్యమైన పని. అందులోనూ సమర్థుడైన ఇటువంటి రచయిత గ్రంథాన్ని అనువదించడం మరింత కష్టసాధ్యమైన విషయం. అందరికీ అర్థంకావడంకోసం ఇందులో సరళమయిన భాష వాడబడింది.

ఈ గ్రంథంలోగల గుణబాహుళ్యాన్నిబట్టి, దీనిని అనువాదం చేయించడం జరిగింది. ప్రతి తెలుగువ్యక్తి దీనిని తప్పకుండా చదివి, దీనిలోని మహత్తరవిషయాలను గ్రహించి, ఆదర్శజీవితాన్ని గడుపుతారనే విశ్వాసంతో మీ కందిస్తున్నాము. ప్రత్యేకంగా దీనిని ప్రతి కతోలిక్కు చదవాలి. ఈ మా ఆశయం యేమాత్రమైనా నెరవేరినా మేము కృతకృత్యులం.

తెలుగులో దీనిని వ్రాసిన శ్రీ ధనకుధరంగారికి మా కృతజ్ఞతాభివందనాలు.

# ఉపోద్ఘాతము



యాదాలాపంగా ఒక మనిషిని హత్యచేయడం చాలా కష్టమైన పని. అదే మనస్థితిలో యాంత్రికంగా ఆ చేతులతోనే ఆ హత్యచేసినవాణ్ణి తోటలోనే పాతిపెట్టడమనేది ఇంకా కష్ట సాధ్యమైనపని. ఆ హత్య చేయబడ్డవాడు ఒక వారంరోజుల తర్వాత సమాధి నుండి లేచి యింట్లోకి సరాసరి నడచిరావడమే తటస్థిస్తే, పరధ్యానములో ఉన్న ఆ హంతకుడు అల్లర చిల్లరగా అస్పష్ట రూపంలో ఉన్న కొన్ని ఊహాల్ని తప్పనిసరిగా అదుపులోకి తీసికొని, జరిగిన పరిస్థితిని జాగ్రత్తగా పరిశీలిస్తాడు. సత్యమైనప్పటికీ బాధ్యతతో కూడుకొన్నదైనప్పటికీ, మత విషయకమైన చర్యమాత్రం, వ్యక్తిగతమైన చర్య మాదిరిగా, అద్దంలో మొగం కనపడ్డంత స్పష్టంగా గోచరించడానికి వీల్లేదు. ఐరిష్ ప్రజలతో తమకున్న సంబంధ బాంధవ్యాల చరిత్ర అక్షరాల ఇదేనన్న విషయం గౌరవనీయులైన చాలమంది ఇంగ్లీషువారికి తెలియదు. తన పూర్వ ప్రస్తుత గాథలోని అవినీతిని నిష్కాపట్యాన్ని ఇంగ్లీషువ్యక్తి గుర్తించలేకపోయాడు. ఇదంతా అతడు స్వప్నములో చేసినట్టుగా అనుకొంటున్నాడు. ఎందుకంటే అతడు ఇటువంటి దారుణాన్ని చేసినప్పుడు, దేన్నిగూర్చి ఆలోచిస్తూండడమో, లేకపోతే ఇంకేదో విషయాన్ని గూర్చి ఆలోచించడానికి ప్రయత్నించడమో జరిగింది. హంతకుడు స్వయంగా తాను పాతిపెట్టిన జీవినిగూర్చి పూర్తిగా మరచిపోవడానికి ప్రయత్నించడం సహజంగానే తోచవచ్చు. కాని, సమాధిలోవున్న ఆ శవం లేచి కళ్ళయెదుట నడివీధిలోగుండా నడచి వచ్చినప్పటికీ, దాన్నిగూర్చి మళ్ళీ తెలిసికోలేని అసమర్థుడుగా ఉండటం అనేది నిజంగా చాలా విశిష్టంగానే ఉంటుంది. ఐర్లండు హత్య చేయబడ్డదన్న విషయాన్ని ఇగ్లండుతో ముడిపెట్ట నవసరంలేదని మతిచెడ్డవా డెవడైనా అనవచ్చు. కాని, దాన్ని హత్యచేయడములో ఇంగ్లండు విఫలమైంది, అన్నవిషయం మాత్రం ఆతనికి తప్పకుండ తట్టుతుంది. కాని, ఉన్మాదులు తరచుగా యదార్థవాదులుగా ఉండడంగూడ కద్దు. ఈవిషయాన్ని నిజంగాచెప్పాలంటే, నేటియూరపు ఖండమంతా,

అందులోను ప్రత్యేకంగా ఇప్పటి ఇంగ్లండు దేశము ఉన్నది ఉన్నట్లుగా, జరిగింది జరిగినట్లుగా మొగాన కుండ బ్రద్దలుకొట్టినట్లుగా చెప్పడాన్ని యేమాత్రం ఒప్పుకోదు. అసలు జరిగిన సంగతియేమిటో ? తన సంగతి యేమైందోననికూడ మానవుడు తెలిసికోలేని అయోమయ పరిస్థితు లేర్పడేటంతగా, మాటిమాటికి క్షమాపణలు; తేనెపూసిన కత్తుల్లాంటి మాటలు కోకొల్లలుగా యెక్కడచూచిన వినపడుతున్నై. ఒక పనిని స్వయంగా తానే చేసినవ్యక్తి, తానుచేసింది చేసినట్లు చెప్పటానికి, ముచ్చెమటలు పోసి, చచ్చిచెడిచేయంగల విన్నపాలుగా తయారవు తున్నాడు.

ధారాళంగా, శక్తిమంతంగా ఫాదర్ లాకింగ్టన్ వ్రాసిన ఈ ఐర్లండు పునర్విజృంభణము విషయకమైన చరిత్రాంశం అద్భుతంగాకని పిస్తున్నది అంటే సరిగా మానవాతీతమైన విషయంలో కాకుండ ఎంత హేతువాదకున్నైనా, సరియైన సమాధానం వెతుక్కుండేటట్లుచేసే, నిర్వి వాదాలైన నగ్నసత్యాలతో కూడుకొన్నవిషయం, క్రైస్తవవిశ్వాసం, పునరుద్ధరింపబడి, యూరపులో మళ్ళీ మమేకం చేయడంకోసం కాక పోతే నామటుకు నేను ఐర్లండుకు జరిగిన సంగతి సందర్భాలనుగురించి ఇటువంటి అశాశ్వతమైన అభిప్రాయాన్ని వెలువరచ కలిగేవాణ్ణే కాను. కథోలిక్ పద్ధతులు దినదిన ప్రవర్ధమానాలు కాకపోతే, ఐర్లండు ఎట్లా బ్రతికి బట్ట కట్టుకొని ఇంతకాలం ఎట్లా ఉండగలుగు తున్నదో, నాకు దురూహ్యంగా ఉంది. చాలామంది ఇంగ్లీషువాళ్లు, అందులోను, బాగా చదువుసంధ్యలబ్బిన ఇంగ్లీషువాళ్ళే ఈవిషయంలో పూర్తిగా అజ్ఞాతులు. కాబట్టే ఈ అంశాన్నేమాత్రం తెలిసికోలేకుండ ఉన్నారు. ఐర్లండునామరూపాలు లేకుండా ఎట్లా త్రొక్కివేయబడిందో, ఐరిష్‌జాతి ఒకప్పుడు పూర్తిగా చచ్చిపోయిన వాటిల్లో ఒకటిగా ఎట్లా జమకట్టబడిందో తెలుసుకుంటానికి వాళ్ళెప్పుడూ ప్రయత్నించలేదు. విజ్ఞానం వికసించి మానవత్వముతో కూడుకొన్న హేతువాద యుగమైనట్టి 18 వ శతాబ్దం మధ్యకాలంలో ఉన్నమానవుడు, ప్రస్తుతం కాథోలిక్ కర్షక లోకంయొక్క అభ్యుదయానికి, కార్థేజీయుల వాణిజ్య పునర్విజృంభణానికన్నా, ఆశ్చర్య నిమగ్నుడయ్యేవాడు. జేమ్సు చక్ర వర్తి తిరిగివచ్చినట్లుగా అతనికి కనపడేది. అది నమ్మకానికి దూరంగా

ఉండేది. అట్లాంటిక్ లోని ఈ ద్వీపం తన పాత సమ్స్కారాల్నే మాత్రం చెక్కు చెదరదీయకుండా పట్టుకొస్తూ, వ్యావసాయిక సంపదలో దిన దినం పురోగమిస్తున్నదన్న విషయం, వాడు వింటే, అమెరికాతో సంధి కలాపాలు సాగిస్తూ, వాణిజ్యంచేస్తూ, సముద్ర గర్భంలోంచి అట్లాంటిక్ నిజంగా పునరుద్భవించాడన్న విషయాన్నికూడా వింటానని అతడు వెంటనే ఊహించుకొంటాడు. పరిణామ ప్రభావం అంతరించి పోవడానికి రెండు, మూడు తరాలు తీసుకొంటుంది. ఆనాడు మృత్యువును చూచిన వ్యక్తులుకారు, నేను మరణించిన వాళ్ళనుండి పునర్జన్మిస్తున్న వాళ్ళను చూస్తున్న వ్యక్తులు. కాని చరిత్ర అంటే మానవులతో కూడు కొన్నది అన్న విషయాన్ని గుర్తించిన వాని కెవనికైనా, ఊహించుకోగల సహానబుద్ధితో, ఒక కథను ఆద్యంతాలుగా నిర్దుష్టంగా అర్థం చేసుకోగలవానికెవనికైనా, ఈ చిన్నటీకలో దృష్టాంతంగా నేను ప్రారంభించిన "తోటలో శవం" అన్న కథలాగా యే విధమైన డొంక చిక్కులు లేకుండ అసలీ చరిత్ర చాలా నిరాడంబరంగా, అద్భుతంగా అర్థమాతుంది. ఈ విషయాన్నే స్పష్టంగా చెప్పాలంటే; ఇంకా కొద్ది సంవత్సరాలల్లో ఐరిష్ కతోలిక్కులు పురుగునాకి పోతారు అని దృఢ విశ్వాసంతో, అరవై సంవత్సరాల క్రితం ఇంగ్లీషు వార్తాపత్రికలు ఉద్ఘోషించినై. మరిప్పుడు ఒక్క అమెరికా సంయుక్తరాష్ట్రాల్లోనే ఆరు మిలియన్లపై చిలుకు కతోలికులు కనపడుతున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే, ఇంగ్లండు చేయడానికి ప్రయత్నించిన ఆ ఒక్క ద్రోహం అదృష్టవశాత్తు విఫలమైపోయింది.

ప్రజలు ఇష్టపడ్డా, పడకపోయినా, భయపడ్డా, అభిమానించినా, ఫ్రాన్సు అనే దేశం ఉండడం ఎంత సత్యమో, అంతగా నగ్న సత్యస్వరూపమైన ఒక సుప్రసిద్ధమైన ప్రత్యేక మత నాగరికతను సర్వవ్యాప్తంచేయడానికి ఒక్క ఇంగ్లండు దేశమే కాకుండా, యూరపుఖండం ఖండమంతా నడుము కట్టుకొని నిలబడాలి. ఫాదరు లాకింగ్టన్ వైదాంతిక శాశ్వతత్వంలో కనపరచిన సహజమైన ఉత్సాహంలో భాగస్వాములు కాలేనివాళ్ళుకూడా, ఆయన నిరూపించిన సాంఘిక ఘన విజయంలోగల యథార్థపరిస్థితులనైనా గుర్తించగలవాళ్లౌతారు. త్రికరణ శుద్ధిగా ప్రాచీన క్రైస్తవ మతావలంబకులై బహిర్గతమైన

హింసావిధానాన్ని సహిస్తూ, మానసికంగా లౌకిక విషయ విరాగానికి దోహదమిస్తున్న, పశ్చిమయూరవు ఖండీయులంతా, మన కళ్ళయెదుటనే ఉన్నట్లుండి చుక్క తెగిపడ్డట్లుగా ఎక్కడనుండో అమాంతంగా ప్రత్యక్షమై విశాల ప్రపంచంలో సంచరిస్తూన్న విషయం, కేవలం విమర్శనావిధానంతో పరీక్షించినా, సత్యంగానే నిలబడుతుంది. మనం ఈనగ్నసత్యాన్ని ఇష్టంవచ్చినట్లుగా మలచవచ్చు. ఐనా సత్యం సత్యమే.

ఈ చరిత్రాత్మకాలైన సంఘటనల్లో కొన్ని స్థూలంగా సహజ విధానాత్మకాలైనా, బాగా పరీక్షించి అర్థం నిగ్గు తేలుస్తే మానవాతీతమైన భావనాత్మకాలుగా ఉంటున్నై. ఈ విధమైన సంఘటనలలో విచిత్రమైనయూదుల అంతర్జాతీయ పరిస్థితి ఒకటి. జోన్ ఆఫ్ ఆర్కు చరిత్రాత్మకమైన రాయబారం మరొకటి. ఇంగ్లీషువారు జోన్ ఆఫ్ ఆర్కుకు ఒకప్పుడు బద్ధ శత్రువులు. కాని, వారు నేడుమాత్రం విరోధులుకారు. వారందరూ ఆమెను ఈరోజు నెత్తిమీదపెట్టుకొని కీర్తిస్తున్నారు. అంతేకాదు; వీళ్లైతే వారు ఫ్రెంచివారికన్న మొన్నో రెట్లు అత్యుత్సాహముతో ఆమెను ప్రశంసిస్తూన్నవారే. ఈ తరహాగానే మరో అర్థంలేని దురభిప్రాయం ప్రాకిపోయే రోజు వచ్చినా, నేను యేమాత్రం నిరుత్సాహపడను. దేశభక్తుడైన ఇంగ్లీషువాడికముందెప్పటికీ యే విషయాన్నిగూర్చి విద్వేషాత్మకుడు కాడు. ఐర్లండులో యేవ్యక్తి అణగద్రొక్కబడలేదని కాని, రువెన్‌నగరంలో ఏ వ్యక్తీ నిలువునా కాల్చివేయబడలేదని కానీ, సత్యవిదూరమైన విశ్వాసంతో ఇంగ్లీషువాడు ప్రతిఘటించకుండా ఉండే ఒకసుదినాన్ని నేనుమనసార కాంక్షిస్తున్నాను. చిరకాలంగా ఐర్లండు హింస జరిగింది కాబట్టి, దాన్ని అతడు తుచ్ఛంగా భావించనూలేడు, కాక అది చాలమంది జీవితాలపై దెబ్బతీసింది కాబట్టి, ఎవరికీ తెలియని విషయంగా మూసిపెట్టుకోలేడు. 15వ శతాబ్దంలోని భయంకర సంఘటనలకు ఏంచేసాడో, అదే రేపూ చేస్తాడు. ఎప్పుడూ ధర్మమూర్తి అని నిరూపించుకొన్నదానికన్నా దయార్ద్రహృదయుడని నిరూపించుకోవడానికి ప్రయత్నిస్తాడు. చరిత్ర చాలా భయంకరమైనదైనా నా స్వదేశీయులు అటువంటి కరుణార్ద్రహృదయులుగా ఉండగల శక్తిసామర్థ్యాలు కలవాళ్ళన్న విషయం నాకు బాగా తెలుసు. ప్రబోధంలేకుండా ఈ విషయాన్నిగూర్చి ఎక్కడైనా వ్రాయడానికి నేను లజ్జిస్తాను.

G. K. Chesterton.

# గ్రంథకర్త తొలిపలుకు

ఐర్లండు శతాబ్దాలుగా అనేకజాతులలో నిర్వహిస్తూ వస్తూన్న మహత్తరమైన ఆధ్యాత్మిక వైభవంలో చాలాభాగం అదృశ్యంగానో, లేక చాల మందికి సరిగా అర్థంకాకుండానో ఉండిపోయింది. ఆమె విశ్వాసంలోగల సామర్థ్యాన్ని గుర్తించలేని వాళ్ళకు ఆమె బొత్తుగా తెలియనిదేశమే. ఆమె చరిత్రను పూర్తిగా అపార్థం చేసుకొన్నారు.

అంత విపులంగా లేకపోయినా, ఐర్లండుయొక్క మహత్తరాభ్యుదయంలోని లోతుల్ని చూపించటానికి ఈ గ్రంథంలో ప్రయత్నం సాగింది. చాలాకాలం ఐర్లండునివాసిగా ఉండి ప్రత్యక్షంగా చూచిన విషయాన్ని, దేశాంతరాల్లోఉన్న ఆమె పుత్రులతో కలిగిన సన్నిహిత సాంగత్యంలోని జీవితానుభవాల్ని నేను ఈ గ్రంథంలో వ్రాశాను.

నేను కేవలం ఐరిష్‌జీవితంలోని మంచినిమాత్రమే చెప్పానని, దానిలోనిలోపాల్ని అసలే చెప్పకుండా మానేసానని అనేవాళ్ళకు నా సమాధానం ఇది. ఐరిష్‌వాళ్ళలో లోపాలున్నవంటే వాళ్ళు మనుష్యులే కాబట్టి, పైగా వాళ్ళల్లోవున్న లోపాల్ని కొండంతలుచేసి, న్యాయానికి సత్యానికి కూడా అందకుండా లెక్కలేనంతమంది రచయితలు బోలెడు గ్రంథాలల్లో ఇదివరకే వ్రాశారు. వాడియైన ముక్కుకలిగి, ప్రకృతిలోని అద్భుతమైన ప్రభావ పరంపరలను నిశితంగా చూడగలిగిన దృష్టితో, నాశనసూచకమైన చంచల వాతావరణానికై వెతుకుతూ, అక్కడ తిష్టవేసి చీల్చి చెండాడే గ్రద్దలకు సోదరులమని చెప్పకొనే రచయితల చేతుల్లోనే ఐర్లండు ముఖ్యంగా చాలాబాధ లనుభవించింది.

ఐర్లండు యదార్థ పరిస్థితినిగూర్చిన ఈ వినయపూర్వకమైన రచన, ఐరిష్ చరిత్రకు, ఐరిష్‌ప్రవర్తనకు సంబంధించి, ప్రచారంలోకి వచ్చిన తప్పు డభిప్రాయాలను, అనాదిగా ఐర్లండుకు, సోదరియైన ఇంగ్లండుకు పరస్పరంగా యేర్పడిన దురభిప్రాయాలను తొలగించివేయడానికి సహాకరిస్తుందని ఆశ.

ఈ రెండు దేశాల ప్రజల సానుభూతితో ఒకరి నొకరు అర్థం చేసుకోవడం నిజంగా సామ్రాజ్య శ్రేయస్సుకు, ఆనందానికి అత్యంత ప్రధానమైన విషయం.

కంటికన్నా హృదయం దూరంగా, లోతుగా, చూడగలదన్న ఆర్యోక్తి ఎంతైనా సత్యం. ఐర్లండుకు సంబంధించిన సత్యాన్ని ఒక్క సారి ఇంగ్లండు ప్రజల హృదయాలు ఆలింగనం చేసుకొంటే, ఐర్లండు ఏనాటికైనా సోదరి సోదరితో మాదిరిగా తగిన స్థానాన్ని అలంకరిస్తుం దన్న విషయం, వాళ్ళ ధర్మ బుద్ధికి దృఢంగా గోచరిస్తుంది.



# ఐర్లాండు దేశము.

అట్లాంటిక్ మహాసముద్రము




ఐరిష సముద్రము

మొదటి అధ్యాయం.

# ఐర్లండు జీవితరహస్యము



ఐర్లండు! జేసుకోసం, దేశంకోసం నిర్భయంగా పోరాడిన ఎట్టి మహత్తర చరిత్రకు అది నిదర్శనం! ఆమెను ప్రేమించడమన్నా, దేవుని ప్రేమించడమన్నా, మృత్యువును ఆహ్వానించడం వంటిదిగా నున్న, గాఢాంధకార బంధురమైన ఆ రోజుల్లో, అప్రతిఘటనా శ్రమ పరంపరలతో ఉన్న ఆదినాల్లో, ఉదాత్తమూ, మహోన్నతమూనైన విశ్వాసంలోగల శక్తి సంపదలవల్ల, నిశ్చలంగా ఎట్లా బాధ లన్నిటినీ సహించారో అది మనకు స్పష్టం చేస్తుంది.

భగవంతునిచే ప్రేమింపబడి, భగవంతుని ప్రేమించుచు, ఐర్లండు అచంచలమైన విశ్వాసముతో గాఢమైన ప్రేమతో సర్వకాల సర్వావస్థలయందు ఎట్లా సంచరించిందో ఆమెజీవితము మనకుస్పష్టము చేస్తుంది.

ప్రాచీన ప్రపంచములో, పశ్చిమ ఐరోపాఖండముయొక్క తుట్ట తుద పొలిమేరగా దానిస్థానం ఉన్నది. విస్తీర్ణంలో చాలా చిన్నదైనా ఆమె శక్తి సామర్థ్యాలు సర్వ ప్రపంచ వ్యాప్తాలైనై. ప్రపంచము లోని దేశములన్నిటిని తన నాగరికతా ప్రభావమువలన అభివృద్ధి పరచినది ఐర్లండు. దేశమునుండి వెళ్లగొట్టబడి పరదేశములలో కాందిశీకులుగనున్న తనబిడ్డల యోగక్షేమములను ఎప్పుడును ఆతురతతో అరయుచునే యుండును. పచ్చిక బయళ్ళతో, ఏనీల ధూసర పర్వత శ్రేణుల్తో ప్రశాంతంగా, ఎత్తుగపెరిగిన పచ్చికలో తిరుగుతూ నెమరు వేస్తున్న పశుబృందాలుగల హరితశాద్వలాస్తీర్ణాలైనా లోయల్తో, బాగా వికసించిన పుష్ప సముదాయాల నల్లని ముండ్ల పొదలతో చదరాలు చదరాలుగా విభజింపబడ్డ పచ్చిక గుట్టల్తో, చల్లనినీడల్లో పర్ణ కుటీరాలు కల్గిన దేవదారు వృక్ష సంతతితో, ప్రకృతి శోభతో అందం ఎగబోసే భూఖండం ఐర్లండు. ఆమె భుజస్కంధాలపై పక్షుల కిలకిలారావాల్తో ప్రతి శబ్దిస్తూన్న వివిధ వృక్ష సమూహాలు, ఈగ వాల్తే మాసిపోయే తెల్లని గోడల్తో గోధుమ వర్ణంతో కూడిన కప్పులు

కలిగిన వర్ణకుటీరాలు గోచరిస్తాయి. భూమినంతా వెండితీగల్తో అల్లిన వలతో కప్పివేసారా అన్నట్లుగా, స్వచ్ఛమైన జలంతో వంకరలు తిరిగి, మంద మంద గమనాల్తో పరుగుల్తో, ప్రవహించే చిన్న చిన్న కాలువలు, తమ భూభాగంలోని పచ్చని చేలను తెల్లని నురువులనే పెదవుల్తో ముద్దు పెట్టుకొంటూ సముద్ర గర్భంలో విలీనమౌతై. అమెను తెలిసికోవడమంటే ఆమెను ప్రేమించడమన్నమాట. ఎందు కంటే ఐర్లండు విషయాన్ని సరిగా అర్థం చేసుకొన్న యే వ్యక్తీ తన హృదయాన్ని ఆమె కర్పించకుండా ఉండలేడు. ఆకాశాన్ని చుంబించే మహోన్నతమైన శిఖరాలు కలిగిన గాల్టీ పర్వత శ్రేణుల్లో, అత్యున్నతమైన గాల్టిమూర్ శిఖరంపై, వసంతకాలంనాటి ఒక ప్రశాంత ప్రాతఃకాలం నేను అధిష్టించాను. మనోహరమైన ఒక రమణీయ దృశ్యాన్ని చూచాను. ఐర్లండు పశ్చిమ సముద్రపు సరిహద్దుగాఉన్న క్లేరు పర్వత శ్రేణులవరకు, మైళ్ల పర్యంతం వ్యాపించి బంగారపు కాంతుల్ని చిమ్మే 'లిమెరిక్కు' లోయ నా యెదుట ఉంది. ఆ పర్వతాలకు క్రిందగా అట్లాంటిక్ సముద్రపు తరంగాల్లో సూర్యుడు తళతళా ప్రకాశిస్తున్నాడు. వాటి వెనకాల ఉత్తరంగా, వాటి ఛాయల్లో 'లఫ్‌డర్గ్' నిద్రిస్తున్నది. మైదానాన్ని కలుపుతూ, వెండిలా మెరసిపోయే తళతళల్తో 'షానాన్'నది వాటి పాద పీఠందగ్గరగా ఉరుకులూ, పరుగులూ తీస్తున్నది.

దక్షిణాన, విశ్రాంతి ఎరుగని సముద్రపుటలల నురుగుతో ఆవరింపబడిన పాదపీఠం కలిగిన, మహోన్నతాలైన 'కెరీ' పర్వతాలున్నై; తూర్పున ఉదయ భాస్కరుని దివ్య తేజో కిరణాల్లో ప్రకాశిస్తూ, పల్లెలు, పట్టణాల్తో అంకితమై, ఆకాశం, సముద్రం, మైదానం మమేకంగా కలిసిపోయే, దిఙ్మండలంవరకూ పరివ్యాప్తమైన 'మన్‌స్టర్' మైదానం ఉంది. 'కార్క్' నుండి 'కారన్‌సోర్' వరకు సముద్రావధిగా ఐర్లండు దక్షిణపు సరిహద్దు ఉంది.

ఉత్తరాన, ఎత్తైన 'కాసర్' పర్వతాలు మధ్యఐర్లండుకు కాపలాగా ఉన్నవో అన్నట్లుగా, గత చక్రవర్తుల విహార ప్రదేశం, గత యోధుల స్థానంగా యుండి ఉత్తర దిశవరకు పరివ్యాప్తమై, నీల మేఘాల ఛాయల్లో అదృశ్యమైన పెద్ద మైదానాన్ని చూస్తున్నై. 'ఎరిన్' మధ్య మైదానంపై స్లీవ్ బ్లూమ్‌లు ఒక కన్నువేసి యున్నై.

అదియొక అనుపమమైన దృశ్యం. ఎటు చూచినా సౌందర్యాన్ని కుప్పపోసే ఆ దృశ్యానికి కవులు పరవశులైనారు. రచయితలు దాని సౌందర్యాభివర్ణనలో మునిగి తేలారు. ఐర్లండుయొక్క బహిరంగమైన ఈ మహత్తర సౌందర్యానికి ముగ్ధులం కాకుండా, మనం మన జాగ్రత్తతో ఉందాము. ఎందుకంటే ఎంత మనోజ్ఞంగా చూడంగానే ఈ సౌందర్యం కనిపిస్తున్నా, ఈ ప్రకృతి సౌందర్యానికి మాత్రమే తన్మయత చెందడమంటే, తన స్నేహితుడు ధరించిన వస్త్రాల నేతపనితనానికి విముగ్ధుడై, అతని ఆత్మను గుర్తించినట్లుగా తలచినదానికి మాదిరిగా ఉంటుంది. తనపై తన సంతానం చూపించే అవ్యాజమైన, అచంచలమైన ప్రేమలో గల రహస్యశక్తిని తెలుసుకోడానికి అనేకులు అక్కడకు అత్యుత్సాహముతో వస్తుంటారు. అక్కడ పర్వతాలధిరోహించిసరస్సులను తిలకించి, లోయలను కన్నారగాంచి, తన్మయులౌతారు. ముఖ్యపట్టణములోని అనన్యసాదృశమైన సౌందర్యాన్ని సంభ్రమాశ్చర్యాలతో పరిశీలిస్తారు. గట్లనొరసుకొని ప్రవహించే 'ఫొమెల్' నదీ తటాలపై పరివ్యాప్తమైన 'కెరీ' కోసం పరుగెత్తుతారు. అత్యున్నతాలైన 'టార్క్' పర్వత పాద పీఠం దగ్గర ప్రచారుచేస్తారు. వారి కంఠాలు 'కల్లార్నె' ప్రశాంత నిశ్శబ్ద వాతావరణాన్ని భగ్నంచేస్తయ్. వారు 'బల్లాన్ భీమా' నధిరోహించి, 'కెర్రీ' పర్వత శ్రేణుల్ని తిలకిస్తూండడం చూడవచ్చు. 'కారిబ్' మొదలుకొని, 'స్లేనీ' దాకా బ్లాక్ వాటర్ నుండి 'బాన్' వరకు ఆమె నదీనదాలను సందర్శిస్తారు. వారు ఐర్లండును చూస్తున్నారు. ఐర్లండును గూర్చి మాట్లాడుతున్నారు. ఐర్లండు సమీక్ష చేస్తున్నారు. కాని వారు ఐర్లండును గుర్తించలేదు. అర్థంచేసుకోనూలేదు.

ఐర్లండు హృదయం గట్టిగా కొట్టుకొంటున్నది. ఐర్లండు నాడి మహా వేగంతో ఆడుతున్నది. కానివాళ్లకిది వినపడదు. దేవునిచే అలంకరింపబడిన ఐర్లండు భౌతికసౌందర్యానికి వాళ్ళుముగ్ధులౌతూ, ఆమె సౌందర్యాన్ని గుర్తించలేకుండా వున్నారు. కానీ ఆమె శక్తినంపదలకు మూలమైంది ఆ ఆత్మసౌందర్యమే. ఆమె సంతానంయొక్క హృదయాల్ని విడదీయరాని రీతిగా ఆమెతో బంధించివేసింది ఆ ఆత్మ సౌందర్యమే.

పాఠక సహృదయా! ఊహాప్రపంచములో మానసికంగా నాతో పాటు వచ్చి, నేను నిలువబడి మాట్లాడుతున్న పర్వత శిఖరాన్నధిరోహించు. ఇప్పుడు మనమిద్దరం ఐర్లండు యొక్క మహత్తరమైన మహాదాశ్చర్యయుతమైన హృదయ సౌందర్యాన్ని అన్వేషిద్దాం.

ఒకసారి ఆ పశ్చిమదిశకు దృష్టి మరల్చు. ఆ "క్లేర్" కాటుక కొండల కెట్టెదుటగా మిలమిలా తెల్లగా మెరసిపోతున్న దేంటి"? నీకు తెలియదుగదూ! "మరి సంభ్రమంతో కూడుకొన్న అవో"? ఊహూ! "పరిచయముచేస్తా ఉండండిమరి." క్రీస్తు స్లీవను ఉన్నతస్థానమున నిలుపడానికి, భక్తియుతులైన ఐరిష్‌వ్యక్తులచే, నిర్మింపబడిన 'లిమెరిక్' చర్చియొక్క శిఖరాగ్రం తెల్లగా కళ్ళు మిరుమిట్లు గొల్పేటట్లు తళతళతో ప్రకాశిస్తున్నది. మనకు ఆ స్లీవకు మధ్యనున్న మైదానాన్ని ఒకసారి జాగ్రత్తగా పరిశీలించు శుష్కమైన ప్రకృతి సౌందర్యానికి ముగ్ధుడవు కావాకు మరి. ప్రతి పర్వతాగ్రముపైన, ప్రతి గ్రామము మధ్యలో, ప్రతి పట్నం మధ్యలో నీకు ఉన్నతంగా కొట్టవచ్చినట్లు కనపడుతున్న దేమిటి ? అచంచలమైన దృఢవిశ్వాసముతో అత్యున్నతంగా ప్రతిష్టించబడిన ఆ కాల్వరి స్లీవే !

ఇక్కడ నీ చరణ సమీపాన 'అహెర్లో' కోనలో ప్రపంచ విఖ్యాతినొందిన, శౌర్య సాహసయుతమైన 'టిప్పరరీ' పట్టణపు దేవాలయ శిఖరం కనపడుతున్నది గదూ! దానికి ఆవల మైదానం మధ్యన 'సెనాఘ్' దేవాలయం వుంది 'కాషెల్' గిరిని చూడు! అది రాజులకు నివాసము. అర్చ్య పాట్రిక్ కాషెల్‌కువెళ్ళి అక్కడిరాజుకు జ్ఞానస్నానమిచ్చి ఆ స్థలమును పవిత్రపరచిరి. ఒక్కసారి దక్షిణానికి నీ చూపు ప్రసరించు! 'బ్లాక్ వాటర్' ప్రవాహతటాలపై నుండి ఉద్భవించే ఆ పొగ, నిరంతర జపస్థానమై ఉన్నతమైన మౌంటుమెల్లరే జాలకాల్లో నుండి వస్తున్నది. దాని కవతల సముద్రతీరాన క్రైస్తవ దేవాలయ పరివేష్టితాలైన దక్షిణ మన్‌స్టర్ పట్టణాలున్నై.

ఈ అద్భుత సౌందర్య శోభితమైన ఈ దృశ్యాని కన్నివైపుల భగవదాలయాలు కన్పడతై. ఈ ఆలయములే దేవుడు మానవులమధ్య వసించు నివాసములు. ఆయన వాళ్ళతో నివసిస్తాడు. వాళ్లే ఆయనకు ప్రజలు. వాళ్ళ వెన్నంటిఉండు ఆయనే వాళ్ళదేవుడు". ఆ మైదానము లోని ప్రతి చదరపు మైలుకు దేవాలయం వుంది.

ఈ భూమి సమస్తం ఇటువంటిదే. ఉత్తర దిఙ్మండలంలో వున్న 'స్లీవీ బ్లూమ్స్'కు ప్రయాణం సాగించు. కన్నెమెరాను అధిగమించు. డోనెగాల్ పర్వతశ్రేణు ల్నధిరోహించు. 'ఆర్మాఘ్' కోనల్లో నడక సాగించు. ఎక్కడచూచినా ఐర్లండు ప్రభువును సూచించే స్లీవతో కూడుకొన్న దేవాలయ గోపురాలే కుప్పలుతెప్పలుగా దర్శనమిస్తై. దేశమంతా ఆయన గుణసంకీర్తనల్తో పరిపూర్ణమౌతుంటే, ఆయనను ఎన్నడు నిరాకరించని, కలలోకూడా మరచిపోని జనసమూహం దేశం ప్రతిధ్వనించే కీర్తనల గానంచేస్తుంటే, ఆయన తన పవిత్రపీఠంపై ఉండే, జాగ్రత్తగా సంరక్షిస్తూ దేశాన్నంతా పరిపాలిస్తాడు.

ఇది ఈ నాటి పరిస్థితేనా యేమి? లాఫ్‌డర్గ్ మధ్యలోనుండి తలెత్తుకొని నిలబడ్డ ఆ పెద్ద స్తంభాన్నొకసారి చూడు. 14 వందల ఏండ్లక్రితం దూరదూరాన్నుంచి 'కొలంబా' 'కైమిన్'ల పాదపీఠాల దగ్గరకువచ్చిన తీర్థయాత్రికుల భక్తిగీతాలతో మారుమ్రోగి, ఈనాడు ఉలుకు పలుకూ లేకుండా నిశ్శబ్దసమాధిలో వున్న 'ఇన్స్‌కాల్ట్రా' ద్వీపంలోని గోపురమది.

పశ్చిమంగా వంకరతిరుగుతూ పోయిన షానన్ నదీతీరాన్నను సరించి ఒకసారి నీ దృష్టిని ప్రసరిస్తే అక్కడ మరో పెద్దగోపురము కనపడుతుంది. చెల్లాచెదరుగానున్న ద్వీపంలో షానన్‌కు అనతిదూరములో ఉంది. దానిచుట్టు 'సెయింటుసెనాన్' జీర్ణదేవాలయాలున్నవి.

దక్షిణానికి మరలు. 'ఆర్టుమోర్' పర్వతంపై ఎత్తుగా కనపడుతున్న ఆమూడో కట్టడం, సెయింటు పాట్రిక్ సమకాలికుడైన సెయింటు డెక్లాన్‌కు స్మారకచిహ్నము. శతాబ్దములక్రితం జీవించిన భగవత్ సేవకులైన ముగ్గురుమూర్తుల చిహ్నాలుగా ఆ మూడు ఐర్లండు గోపురాలు నిలచియున్నవి. అవి సెయింటు పాట్రిక్, సెయింటు మున్‌చిన్, సెయింటు డెక్లాన్, పూజబలి ఘంటారావాల్ని విన్నవి. ఈనాడవి సడలిపోని విశ్వాసానికి సాక్షీభూతాలుగా నిలబడియున్నవి.

ఆమె తనతో అవిచ్ఛిన్నమైనసంబంధాలు తనబిడ్డలు కలిగియుండడానికిగల రహస్యమిదే. ఐర్లండు ప్రాణముల దారబోయవలసి వచ్చినను, విశ్వాసంను విడనాడలేదనుటకు తిరుసభ చరిత్రయే చాటుచున్నది. ఐర్లండు ఎందుకు ప్రఖ్యాతిగాంచినదో ఇప్పుడు బలవత్తరమైన హేతువు కనబడుచున్నది. "మళ్లీ ఇన్నాళ్ళకొకజాతి అన్నపదాన్ని వింటున్నాం"

ఈ మాటను ఒక ఐరిష్ లేఖినే లిఖించిందంటే నాకు బలే ఆశ్చర్యంగా వుంది. ఏం! యుగయుగాల నధిగమించి, అచంచలమైన విశ్వాసముతో, భక్తితో దేవునిఅడుగుజాడల్లో నడుస్తూవచ్చిన ఐర్లండు, నాడు మొదలు నేటివరకు జాతిగానే జీవించలేదూ! అదెన్నడూ జాతే!

ఉదారత్వానికి, కతోలిక్ చరిత్రకు ఐర్లండుకు ఐర్లండే సాటి! అర్చ్య. పాట్రిక్ జీవితకాలములో దేవదత్తమైన విశ్వాసము, ఐర్లండంతయు ఎట్లు వ్యాప్తిజెంది ప్రజ్వరించుచుండెనో, అట్లే నేడును వన్నె తరగకుండా, చెక్కు చెదరకుండా ఉన్నది. దుర్మార్గులు కొందరు దానిని నిర్మూలముచేద్దామని ప్రయత్నం చేశారు. కాని మతంకోసం తమ ప్రాణాలను బలినిచ్చినవారి పవిత్రరక్తంచేత దానికి అందం కల్పించారు. తన్ను అచంచలమైన భక్తివిశ్వాసాలతో అనవరతముధ్యానించే ప్రజా సమూహంమధ్య, ఐర్లండు దేశములో ప్రత్యంగుళములో క్రీస్తుప్రభువు సింహాసనాధిష్ఠుడై యున్నాడు.

ఇది ఆమెలో నశించని శక్తిసంపదలోని రహస్యం. దారిద్ర్యాన్ని పవిత్రపరచుచు, ఆపత్సమయాలలో ధైర్యసాహసాలనిచ్చుచు, దుఃఖ సమయాలలో ఆమెను ఓదార్చుచు దేవమందసములో నున్న జేసునాథునితో ఐక్యమొనర్చునది తీక్షణమైన ఆమెదైవప్రేమయే. అదియే ఐర్లండు ప్రాణాధారము.

భగవంతుడామె నాశీర్వదించుగాక!



## రెండవ అధ్యాయము.

# పట్టణ జీవితము

ఐర్లండు ప్రపంచములో ఉన్నతస్థాయిని జెంది ప్రసిద్ధిగాంచుటకు కారణము కతోలిక్కు వేదప్రభావమే. ఉదాత్తతలో ఐర్లండుకు ఐర్లండేసాటి! కాబట్టి ఐర్లండు జీవితాన్ని అర్థం చేసుకోదలచినవాడు ఈ విషయాన్ని బాగాగుర్తించాలి. ఎందుకంటే ఈ ఉదాత్తతాగుణమే ఆజాతి ప్రధానలక్షణం. వందల సంవత్సరములుగా వేదహింస జరిగిన కాలములో జాతిజీవితం నాశంకాకుండా బలకోనునటుల జేసి కాపాడిన శక్తిని జ్ఞానవంతమైన విశ్వాసనేత్రమే గ్రహింపగలదు. ధనధాన్యములతో దేశము తులతూగునపుడు జాతిజీవితము క్షీణించకుండ పోషించగల ఆ ఏకైకశక్తిని దూరదృష్టిగల విశ్వాసనేత్రమే గ్రహింపగలదు.

ఎల్లప్పుడు ఐర్లండు పది ఆజ్ఞలచే పరిపాలింపఁబడుచున్నది. మానవత్వానికీ, జాతీయతకూ ఆదర్శాలైనవివే. ఇవి, ఆపత్సముద్రాల నుండి ఉద్ధరించి అభ్యుదయోత్తుంగతరంగాహతుల్లో, చలించకుండా నిలపడానికి లంగరుగా కాపాడుతై.

ఐర్లండులో కాలుపెట్టిన నూతనాగంతకుడు ఆ దేశమంతటా పరివ్యాప్తమైన ఆనందాశ్చర్యాలను పొందుతాడు. సైంటు పాట్రిక్ దత్తమైన ఆ విశ్వాసం అక్కడున్న ప్రతి వ్యక్తిని కదలించి పరిజ్ఞాతునిగా చేసివేస్తుంది.

19 వ శతాబ్దపు ఉత్తరార్థంలో, శరదృతుకాలంలో 'ఎరిన్'కు పశ్చిమంగా నేను ప్రయాణం చేస్తున్న ఓడ పైభాగంలో, ఒకనాటి ప్రాతః సంధ్యలో నిలబడి చూస్తున్నాను. సముద్ర తీరాని కవతలగా, ఛాయా విలీనమై ఎక్కడనో మాకు భక్తివిశ్వాసాలను ప్రభోదించిన ఆ భూ భాగం ఉన్నది. 85 సంవత్సరాలకుగాను మళ్ళీ తన ప్రేమాస్పదమైన మాతృ దేశానికి తిరిగి వస్తున్న ఒక నిర్వాసితుడు నా ప్రక్కనే నిలబడి యున్నాడు. ఐర్లండు పవిత్ర పర్వత శ్రేణుల మీదగా వస్తున్న గాలికి, అతని తెల్లని జుట్టు, భుజాలమీద నాట్యం చేస్తున్నది. చూస్తుండగానే అదృశ్యమైపోతున్న ఆ ఛాయా విలీన భాగాన్ని ఆదుర్దాగా నోరు తెరచుకొని చూస్తున్నాడు. ఉన్నట్లుండి

అతని కంఠంనుండి "అదిగో! ఆమె! సర్వేశ్వరా! నమస్కారములు!" అన్న పలుకులు వినపడినై. కాని వెలుతురులో కనపడీ కనపడకుండా మా కెదురుగా 'సెయింట్ పాట్రిక్' పాదాంకితమైన, తూర్పుకొండల సముదాయంతో కూడుకొన్న ప్రదేశం ఉన్నది.

క్షణాలు దాటిపోతున్నై. మా ఓడ ముందుకు పరుగెత్తుతున్న కొద్దీ, మా వెనుక సముద్ర గర్భంనుండి క్రమ క్రిమేపి సూర్యుడు పైపైకి వస్తున్నకొద్దీ, చీకటి క్రమేపితగ్గుచు గోధుమవర్ణంగా, మారి పోయి బంగారు ఛాయల్లో తయారౌతున్నది. ఆయన కిరణాల కాంతికి తమచ్ఛాయలు అంతరించి పోతున్నై. నిద్రిస్తున్న భూ భాగమంతా బం గారుమలామా చేయబడినట్లైంది.

పర్వత పాద పీఠం దగ్గర జన్మించి, పట్టణ మధ్య పరుగులు పెడుతూ, దృశ్యాదృశ్యంగా సముద్ర విలీనమైన, సన్నని చీలికలోకి, తన కిరువైపులా వెక్కిరిస్తున్నట్లుగా యున్న భూ భాగాగ్రిము మధ్యగా, సముద్రిపు పాయ చేరింది. అది డబ్లిన్ అఘాతము. అది డబ్లిన్ పట్టణం.

నా వెంట ప్రయాణం చేస్తున్న ప్రవాసివైపు ఒకసారి చూచా. ఓడ కట కటాలు పట్టుకొన్న అతని ముంజేయి తెల్లగా ఉంది. సెయింట్ లారెన్సు కాలంనుండీ! నేటివరకూ నిశ్చలంగా రేవు ముఖ ద్వారము నందు జీవిత ప్రవాహములోని ఉత్తుంగ తరంగములను, ఆటుపోటులను గమనిస్తూ కాపలా వానివలె నిలబడియున్న 'హౌట్' పర్వతంయొక్క నీలి నీడల్లో నేను సాగిపోతున్నా. పాంగనాగ్ లోయల్లోని ప్రకృతి సౌందర్యాన్ని సంరక్షిస్తూ ఎరిన్ పశ్చిమ సరిహద్దుయందున్న బ్రహ్మాండ మైన ఉద్యానవనందాకా 'టగ్నిక్వీల్లా' గుండా పంక్తులు పంక్తులుగా 'డబ్లిన్' 'విక్లో' పర్వత పంక్తులు మాకు దక్షిణంగా, పడమరగా వ్యాపించి ఉన్నై. ఉదయకాలమందలి అరుణ కిరణాల్లో తమః పట లము విచ్ఛిన్నమై గోధుమవర్ణపు పచ్చని బూడిదరంగుగల అసంఖ్యా కములైన నీడలు వ్యాపించినై. ఆ పర్వత శ్రేణులను అధిగమించి కుడివైపుగా నున్న "క్లాంటార్ఫ్"ను దాటి, "తోల్కా" అధిగమించి, గృహముల మధ్యగుండా నడక సాగించి మా ఓడ పట్టణపు నడిబొడ్డున లంగరు వేసింది. తన మాతృభూమిని చేరినంతనే తన చిరకాల ప్రవాస మును ఒక్కసారిగా విస్మరించిన నా వృద్ధ మిత్రుడు "తక్షణమే రా!

తప్పకుండా చూడవలసిన ఒక అమూల్యమైన విషయాన్ని నీకు చూపిస్తా." అని సంతోషంగా నాతో అన్నాడు.

సముద్రఘట్టమునుండి డబ్లిన్ నగర రాజమార్గమగు 'ఒకన్నెల్' వీధిగుండా నన్నతడు త్వర త్వరగా లాక్కొని వెళ్తున్నాడు. ఆ వీధి కలంకారప్రాయంగా ఆ వీధి మధ్యలో స్వాతంత్ర్య ప్రదాతకొఅకుగా నిర్మించిన మహా సౌందర్యాన్నికూడా చూడకుండా మహా వేగంతో నడుస్తున్నాడు. శరవేగంతో నడుస్తూ ఆ స్తంభంయొక్క వంకరలు తిరిగిన మెట్లమీదగుండా నడక సాగిస్తూ బ్రహ్మాండమైన వేదిక దగ్గరకు చేరాడు. "అటుచూడు! అది అందంగా లేదూ!" అంటూ అతడు తన చూపుల్లో మహదానందాన్ని ప్రదర్శిస్తూ అమితోత్సాహంతో పలికాడు. ఐర్లండు దేశానికి మకుటాయమానంగా ఉన్న డబ్లిన్ నగరం; శాద్వలాంకురాల్తో విరాజిల్లుతూ పశ్చిమాన్నుండి మెలికలు తిరుగుతూ సేతువులగుండా మహావేగంతో సముద్రగాఢాలింగనానికై పరుగెత్తుకుంటూ వస్తూన్న మహత్తరమైన "లిఫ్ఫీ" నదీ తీరాన పరివేష్టించియుంది. నా మిత్రుడు నాకా ప్రదేశంలోని ప్రతి విషయాన్ని దర్శించే భాగ్యం గలుగ చేస్తాడన్న నమ్మకం కుదిరింది. "కిల్లెనీ" పర్వతాలనుండి "తల్లాఘట్" పర్వతంవరకూ "ఫోనిక్స్‌పార్క్" చుట్టుపక్కలా అతని దృక్పథాన్నుండి తప్పించుకొని పోయే దృశ్యం యేదీ లేదు.

ఆ పట్టణం "దేవాలయముల" మయం. మాపాద సమీపంలో ఉన్నచర్చి బహిఃప్రదేశం మొదలుకొని "డాల్కీ" వరకూ, దక్షిణాన పన్నెండుమైళ్ళ పర్యంతం హౌత్‌కు సరిగ్గా తూర్పువైపున ఏ బజార్లో చూసినా గుడి గోపురాగ్రాలే కనుల పండువుగా కనిపిస్తున్నై. బాగా జన సమ్మర్దంగల పశ్చిమ దిశను నాల్గు న్యాయస్థానాలకు అవతల ప్రక్కగా అన్నిసందులూ, గొందులూ. ఇచ్చట ఎటుబోయినను ఐరిషీయులు - ఐరిషీయులు మొత్తమున అందరు బీదవారే- దేవునికి నివాసస్థానములు ఏర్పాటు జేసియున్నారు. ప్రతిగృహమున దేవునికి ప్రధానస్థానము ఒసంగియుండుటను గాంచుదుము. "ఆన్!" వీధిలో ఉన్న "సెయింట్ మిచెన్" గుడిచుట్టూ జన సమ్మర్దంతో కూడుకున్న వీధులున్నై. దాని ప్రక్కనే దరిద్రుల అభ్యున్నతికై నిరంతరం పాటుపడే 'జార్జి' పర్వత దేవాలయం ఉన్నది. నిరంతర దైవభక్తిపరాయ

ణులతో కూడుకున్న "సెయింట్ ఫ్రాన్సిస్" గుడి, దాని ప్రక్కనే ఆదర్శజీవితం గడిపే అర్చ్యి. డోమినిక్ సభ సభ్యులమఠం కనుచూపు దూరంలో ఉన్నది. నా మిత్రుడు చేతితో చూపించె దిక్కువైపుచూస్తే "లిఫ్ఫి" కు సమీపంలో "అజ్టాన్" ఘట్టమూ, ఆదాము అవ్వల కట్టడాలు కనపడుతున్నై.

ఇక్కడ మున్నాటికీ దైవభక్తి తగ్గిపోలేదు. ప్రతి దేవాలయద్వారం బార్లగా తెఱచియుంది. ఒక మహా ప్రవాహంలాగా దేవాలయంలోకి ప్రవేశిస్తున్న భక్తులచే ప్రతి కవాటమూ, నిరంతరంగా తెరవబడ్తూంది. దేవాలయంలోకి పోయే ప్రతి పురుషుడు, వినయ విధేయతలూ, గౌర వాదరాలు ఉట్టిపడేటట్లు కన్పిస్తున్నాడు. ప్రతి స్త్రీ అవనత వదనయై తన హృదంతరంలో ఉన్న దైవానికి జోహారు లర్పిస్తున్నది. ఉదయం పదకొండు గంట లయ్యేటప్పటికి మేము దేవాలయ బహిర్ద్వారం దగ్గరకు సమీపించాం. మనం ఈ పూజ బలికి తప్పకుండా హాజరు కావాలని నా మిత్రుడు నిశ్చయం చేశాడు. అది సామాన్య వారం లోని ప్రాతఃకాలము. మేము కవాటాన్ని తెఱచుకొని, నిరభ్యంతరంగా లోపలికి ప్రవేశించే అవకాశం ఉంది. తలుపు నెట్టడానికి యే మాత్రం వీలులేకుండా ఒక మహా ప్రవాహంవలె జనం మూగిపోవటం చూస్తే నాకు మహదాశ్చర్యం కలిగింది. ఆ బ్రహ్మాండమైన కట్టడంలో పెద్దపీఠము మీాద పూజబలి సాగుతోంది. ఈ బహిర్ద్వారము మొదలుకొని భవనం చిట్ట చివరవరకూ అవనత శిరస్కులై దైవ ప్రార్థనలు జరుపుతున్న జన సమూహం నా కొక మహా సముద్రంవలె గోచరించింది. వీధుల్లో జీవనోపాధికై ఆందోళనచెందే జనులసందడి విప రీతంగా వినబడుతోంది. ప్రపంచంలోని అశాంతి, నిరంతర కృషి చేతప్రశాంతమైన దైవ ధ్యానమువల్ల పరాజయము పొందినది. ప్రేమోజ్వలములైన వారి హృదయములనుండి పొంగిపొరలి వచ్చు చున్న తీక్షణ జపముల శబ్దము తప్ప, మరేమియు అచట వినపడదు. వారిది ఎంత ప్రేమతో కూడిన దైవధ్యానం! వారికి దేవునిపై ఎంత మక్కువ! దేవుని ప్రియ పుత్రుడైన, సర్వజన ప్రేమాస్పదు డైన, జేసునాథుడు వారి గురువుల చేతులలో దేవుని పీఠంపై ఉన్నాడు. వారందరూ ఆ జేసునాథుని ముందు మోకరించి స్తోత్రాలు చెపుతూవుండడం చూస్తే వారి హృదయాల్లోనుంచి కట్టలు

తెంచుకొని దైవప్రేమ పైకి పొంగివచ్చిందా అన్నట్లుగా వుంది. జనంతో క్రిక్కిరిసియున్న ఆ దేవాలయంలో కొంత దూరంవరకూ తలుపు వెంబడే బెస్తవారిస్త్రీలు, పూవులమ్ముకొనే పిల్లలూ, వీధుల్లో తిరిగి అమ్ముకునే వాళ్లు వున్నారు. జేసునాధుని రాకనుసూచించే గంటశబ్దము వినబడ గానే ఆ జనంలో నేను ఎట్లాగో వీలుకలుగజేసుకొని మోకరించాను. అక్కడ ఉన్నవారందరూ ఒక్క జేసునాధునితప్ప, సర్వం మరచి పోయి తన్మయత్వంలో మునిగియున్నారు. గోధుమరంగు శాలువా నెత్తిమీదుగా భుజాలవరకు కప్పుకొని అతివినయంగా నా ప్రక్కగా ముసలామె ఒకతె మోకరించి కూర్చున్నది. ఆమె ముఖంచుట్టూ కప్పుకొన్న శాలువాలోనుంచి మెత్తగా చెక్కుచెదరకుండా వున్న ఆమె నెరసిన నెత్తిపై పెట్టుకొన్నటోపి కనుపడుతుంది. ఆమె మొగంలో ఒక అతిలోక సౌందర్యమైన కళ ఉట్టిపడుతున్నది. ఆమె కనుబొమ్మల మీద అచంచలమైన ప్రశాంతత తాండవిస్తున్నది దైవపీఠముపై ఉన్న జేసునాధునిపై లగ్నమైఉన్న ఆమె కళ్ళలో పవిత్రమైన ఒక మహాజ్యోతి ప్రకాశిస్తున్నది. ఆమెకు ఆ పూజబలి అంటే గాఢమైన అనురాగం. అత్యంతానందం. తన చుట్టు ప్రక్కల ఏమి జరుగుతున్నదీ గమనించలేనంతగా, ఆమె ఏకాగ్రచిత్తంతో తన పెదవులు కదిలిస్తూ, దేవునికి స్తోత్రం చెబుతున్నది. ఆమె మాదిరిగా త్రికరణ శుద్ధితో గాఢానురాగంతో ప్రేమపూర్వకంగా తన్మయత్వం చెందుతూ దైవ ప్రార్థనలు చేయగలవారే ఆమె ప్రక్కన కూర్చుంటాని కర్హులు.

వాడి వత్తలైన గులాబీలను జేబులలో పెట్టుకుంటూ ఉన్నప్పు డుగాని, లేక తమ బుట్టలూ, తట్టలూ, తీసికొనిపోవడానికి నిల్చున్న ప్పుడుగాని, పూజబలిఅయిన తర్వాత బైటికి వచ్చిన ఈ "ప్రేమ హృద యాలతో ఒక్కసారి మాట్లాడు!" "పూజ బలికి హాజరు కావడానికి సమయము చిక్కటం చాలా కష్టం!" అని ధైర్యంచేసి వాళ్లతో అని చూడు. వాళ్ళు నీకెట్లా తల తిరిగేటట్లు సమాధానం చెప్తారో నీకే తెలు స్తుంది. వాళ్ళంతగా జేసునాధునియందు గాఢానురాగం గలిగిఉన్నారు. "ఇంతసులభంగా దేవుని దర్శించుకోగల అవకాశం ఉన్నప్పుడు, నేను ఒకఅర్ధగంట కాలమైనా దేవునికోసం వెచ్చించలేని మూర్ఖురాల నను కొన్నావా! నీవు పాపాన పోతావు!" అంటూ ఒకామె నాపై చిర్రు బుర్రాడుతూ చిన్నపిల్లవాడిపై జారిపడ్డట్టుగా నా వైపు చూస్తూ వెళ్ళి

పోయింది. "మూర్ఖులు! అసలు వాళ్ళ బుర్రల్లో ఏముున్నదంటా!" అంటూ, ఆమె నన్నుగూర్చి మెట్ల దగ్గర తను కలుసుకున్న పరిచయునితో పలికిన మాటలు నా చెవుల్లో ఇప్పటికీ గింగురు మంటున్నై. ఈ దేవాలయంలో సమావేశమైన ఈ జనసమూహం ఈ ఒక్కదానితోనే ఊరుకోకుండా పట్టణంలో ఉన్న అన్ని దేవాలయాలకు హాజరవుతారన్న విషయం నేను అనుభవంవల్ల తెలిసికోగల్గాను. ఉదాహరణకు, ఈ దేవాలయం బైటికి వచ్చి ఎడమచేతివైపు తిరుగు. కొండయెక్కు. నీ కండ్ల యెదుట పెద్ద పెద్ద స్తంభాలతో అర్చ్బి॥ ఫ్రాన్‌సిస్ శౌరి" వారి దేవాలయం కనపడుతుంది. ఇక్కడ రోజూ ఉదయం ఆరు గంటలకు ప్రారంభమైన పూజబలులు పదకొండున్నరవరకు నిరంతరాయంగా జరుగుతై. డబ్లిన్ నగరానికి విచ్చేసిన సర్వసమర్థుడైన రోమన్ మత గురువును పూజబలి సమయములో సత్ప్రసాదం ఇవ్వవలసిందిగా అక్కడిజనం కోరారు. ఆయన సత్ప్రసాదాన్నిచ్చాడు. ఒక్క పావు గంట దాటినతరువాత ఆ దేవాలయంలోకి తండోపతండాలుగా జనం రావడం చూచేటప్పటికి అతడు గాభరాపడి, వత్తాసుచేసే కుర్రవాణ్ణి తనకు సహాయార్థముగా మరోగురువును పిల్చుకొని రావడానికి పంపాడు.

"అబ్బో! యింతమందిజనమే! నాజీవితంలో ఇటువంటిదెప్పుడు చూడలేదు!" అని ఆయన అన్నాడు. ఆ ఒక్క దేవాలయములోనే సంవత్సరానికి నాలుగులక్షల గోధుమఅప్పములు కావలసిఉంటై. జేసునాథుడు వారితో మమేకమై వారి కష్టసుఖాలల్లో తానొక భాగస్వామిగా ఉన్నప్పుడు, వారు కష్టములలో సంతోషముగా ఉంటున్నారన్న విషయం అంతగా ఆశ్చర్యకరమైనదిగాదు. ఒకసారి మళ్ళీ ఈ వీధుల వెంటతిరిగి అమ్మేవాళ్ళవిషయానికివద్దాం. నెత్తిమీద బరువైన తట్టలతో వొంగిపోయి నడువలేక నడువలేక నడుస్తూన్నవాళ్ళనుచూస్తే ఆ మహా పట్టణములో అంత చెప్పుకోతగ్గవాళ్ళుగా కన్పించరు. కానీ వాళ్ళ మృదుమధుర సంభాషణలూ, వారిలోకనపడే వినయం, వారినడవడికా దేవునికీ, దేవదూతలకూ మిక్కిలి ప్రీతికరములు. మన ఊహాకు కూడా అందని పవిత్రాశయాలతో నిరాడంబరంగా సంచరించే జన సమూహం అది. కొన్ని సంవత్సరాల తర్వాత నేనొక మత బోధకుణ్ణిగా మళ్ళీ అక్కడికి పోయే అవకాశం దొరికింది. గర్భ దరిద్రంలో క్రుంగి కూలారుతున్నప్పటికీ అచంచలమైన దైవ భక్తితో పూరి గుడి

సెల్లో కష్టాల మధ్య కాపురం చేస్తూన్న వాళ్ళను చూచేటప్పటికి నాకు మహాదాశ్చర్యం కల్గింది. జేసునాథుని దయ వారిలో ధగద్ధగాయ మానంగా ప్రకాశిస్తూంది. వారు ప్రతిరోజూ, ప్రొద్దునా, సాయంత్రం సత్ప్రసాదం లోగొనడానికి తండోపతండాలుగా దేవాలయాలకు రావడం కళ్ళారా చూచాను. పూరి గుడిసెల్లో కటికి నేలయే పక్కగా నివసిస్తూన్న వాళ్ళని గమనించాను. లోకం దృష్టిలో వాళ్ళు బైటికి దరిద్రులుగా కనపడ్డా, జేసునాథునియొక్క పవిత్రమాత మరియమ్మయొక్క దృష్టిలో భాగ్యవంతులే. దేవ మాతపై వాళ్ళకున్న భక్తి అపారము. విశాల దృక్పథంతో ఉన్నతాదర్శాలతో జీవితం గడిపే ఆ జనం నివసిస్తున్న ప్రతి పూరిగుడిసెలో దేవమాత తన స్థావరాన్ని ఏర్పరచుకొంది. ఆమె ముందు మిణుకు మిణుక్కుమంటూ ఒక దీపం వెలుగుతూ ఉంటుంది. బహుశా అదే ఆ ఇంటి కంతటికీ దీపం. మిణుకు మిణుక్కుమంటున్న దీపం వెలుగున అక్కడనే ఒక మూలగా పక్షవాతంతో చాల బాధపడుతూ ఉన్న పుణ్య జీవిని, అతడిపై తన చల్లని చూపులు ప్రసరిస్తూ ఉన్న లూర్దు మాత స్వరూపాన్నీ, నీ వా పూరిగుడిసెలోకి పోయి చూస్తే, నీ గుండె బద్దలైపోతుంది! ఆకటి బాధతో అమ్మా! బువ్వ! అమ్మా! బువ్వంటూ తన కాళ్ళకు చుట్టుకొని ఏడుస్తూఉన్న తన సంతానాన్ని పోషించలేక దొరికినకొద్ది బొగ్గుల్తో నీళ్ళు కాస్తూ మొగములో దైన్యం చిందిపడుతూ దేవమాత చల్లని చూపుల్లో తన దుర్భర దరిద్రావస్థను వెళ్ళబోసుకుంటూ కాలక్షేపం చేసే ఆ వితంతువును చూస్తే నీ గుండె కరిగిపోతుంది. కాని, చిట్టచివరకు ఆ ముదుసలి ఎట్లాగో కృతకృత్యురాలైంది. అంతేగా! తమకు కలిగిన కష్ట నష్టాలన్ని దేవునిపైనే వదలిపెడ్తే దేవుడు తప్పక ఏదో దారి చూపిస్తాడు అన్న దృఢ విశ్వాసంతో వాళ్ళు ప్రవర్తిస్తుంటారు. వాళ్ళ దుర్భర దారిద్ర్యమే నిజానికి వాళ్ళ ఆత్మల్ని పరిశుద్ధం చేస్తుంది! దేవుణ్ణి దర్శించడానికి వాళ్ళకు వెలుగు నిస్తుంది.

డబ్లిన్ నగరంలో, ఫాదిరి ఆధ్వర్యంక్రింద ఉండే ఒక పేటలో మతాంతర్లుగా మార్చివేసే ఒక వైద్యసహాయ సంఘానికి వచ్చిన స్త్రీని నేనొక రోజు చూడడం తటస్థించింది. అక్కడికి వచ్చేవాళ్ళందరూ, వైద్య సహాయం పొందేముందు అక్కడి మతస్థులుచెప్పే దైవకీర్తనలను, దైవోపన్యాసాలను తప్పకుండా వినాలి. తర్వాతగాని మందు మాకు

తీసికోవడం జరగదు. చేతిలో చిల్లిపైసాకూడా లేక గంపెడు సంతాన ముతో ఉన్న వాళ్ళకూ, ప్రమాదకరమైన జబ్బుస్థితిలో ఉన్న బంధువు లున్న వాళ్ళకూ ఇది తప్ప గత్యంతరం లేదు. "దేవుని పేరుతో' నీవిటు వంటి చోటా ఇట్లా చేస్తున్నావా? పైగా నీవు కతోలిక్కు-ననికూడా అంటావుకదూ?" అని నే నామెను అడిగాను.

"అవును స్వామి! నా చేతిలో రాగి డబ్బుకూడా లేదు. నేను మందిప్పించలేకపోతే, నిర్భాగ్యురాలైన 'మోలీ' చచ్చిపోతుందని డాక్టరు చెప్పాడు! నన్నేం చేయమంటారూ!" అందామె.

"అందుకని నీవక్క-డికి వెళ్ళి ఆ గుంపులోకూర్చొని వాళ్ళు చెప్పేమాటలు వింటూ వున్నావన్నమాట" అనినేను తిరిగి ప్రశ్నించా.

"స్వామీ! నాపై కోపగించుకోకండి. తక్కి-న సమయమంతా నేను జపమాలను చెప్పడంలేదూ!" అని దీనంగా ఒక వేడినిట్టూర్పు విడుస్తూ సమాధానం చెప్పింది.

జేసునాథుడు వాళ్ళను రక్షించుగాక! వాళ్ళను నిందించడం కూడా తప్పే.

వీధుల్లోగుండా గురువులు పోతూంటే, "జేసుస్వామి మిమ్ము కాపాడుగాక!" అనే మాటలు అన్నివైపుల్నుండీ వినపడ్తై. బజార్లే వాళ్ళ కాటస్థలాలు కాబట్టి, అక్క-డ గుంపులు గుంపులుగా మూగి ఆడుకుంటూండే పిల్లకారులో ప్రతి బాలుడు, ప్రతి బాలిక, గురువు పోతూండటంగాని, వస్తూండటంగాని చూస్తే వినయంగా వంగి గురువు లకు తమ దైవ భక్తిని వెల్లడిస్తారు. అది వారి బాధ్యత అని అను కుంటారు.

వీధుల్లోనే తమ జీవితాన్ని గడిపే పిల్లలు, గురువులాదారిని పోవడం తటస్థిస్తే, "రా! మాగీ! రా! అదుగో గురువులు; వారి ఆశీర్వాదం పొందుదాం దా!," అంటూ ఒకళ్ళొకళ్ళని పిల్చుకుంటూ తండోపతండాలుగా గురువుల కడ్డమువచ్చి వారి ఎదుట మోకరించి, "స్వామీ! మిమ్ము దేవుడాశీర్వదించుగాక!" అని ముక్తకంఠాల్తో హృదయపూర్వకంగా పలుకుతారు.

ఒక రోజున కూంబేలో ఒక చిన్న సందుగుండా పోతూ, దారి ప్రక్క-నే ఆడుకుంటున్న ఇద్దరు పిల్లల్ని చూచా. వాళ్ళిద్దరూ తప్పకుండా అన్నదమ్ములే. పెద్దవాడికి ఏడేండ్లుంటై, చిన్నవాడికి ఐదేండ్లుంటై.

వాళ్ళిద్దరూ సామాన్యమైన చారల లాంగులు తొడుక్కున్నారు. గుండీలు లేని చొక్కాలున్నై. పెద్దవాడు మాత్రం నెత్తిమీద టోపీతో ఉన్నాడు. చిన్నవాడికి అదీ లేదు.

నన్ను చూచాడో లేదో పెద్ద కుర్రవాడు, " అరే ! ' మిచేల్' అరుగో గురువులు ! పోదాం రా! " అని పిల్చి, ఇద్దరూ కలిసీ ఒక్క ఉరుకులో నా దగ్గరకు వచ్చారు. చినిగిపోయిన టోపీ తలమీదనుండి తొలగిస్తూ, ఆ పెద్దవాడు " స్వామీ ! మిమ్మల్ని దేవుడాశీర్వదించు గాక ! " అని అన్నాడు.

రెండో పిల్లవాడు, ఇంతసేపూ భయపడుతూ, మెల్లగా ఒక కాలితో ఇంకొక కాలు రాచుకుంటూ తలవంచుకొని నిలబడి ఉన్నాడు.

పెద్దవాడు, తన తమ్ముడు గురువులకు స్వాగతం చెప్పలేదని తెలుసుకొని, చిన్నవాడిపై తన అధికారం చెలాయించాడు.

చిన్నవాడికి పెద్దవాడు చేస్తూన్నపని తెలుసు. కాని, నెత్తినుండి టోపీ తీయడానికి అసలదంటూ ఒకటుంటేనా !

పెద్దవాడు వెంటనే గ్రహించాడు. " మిచేల్'! గురువులకు వందనాలు చెప్పడానికి నీ నెత్తిమీది జుట్టైనా ఎందు కెత్తలా ! ఊఁ ! చెయ్ ! వెంటనే " అని అప్పటి కప్పుడే ఆధికారికంగా చెప్పాడు.

ఒక్కసారిగా మిచేల్లో ఉన్న భయం మటుమాయమైపోయింది. వెంటనే కాళ్ళు రెండూ సరిగ్గా పెట్టి, తన కండ్లపైకి జీరాడుతున్న ముంగుర్లను చేతితో పైకెత్తి పట్టుకొని, " స్వాములవారా ! మిమ్ములను దేవుడాశీర్వదించుగాక !" అని స్పష్టమైన కంఠంతో చెప్పాడు,

దేవాలయమే తమ నివాసస్థానంగా వున్న ప్రజలు వేరు. వారొకసారి జ్ఞానస్నానం పొందిన తరువాత చచ్చిపొయ్యేంతవరకూ చలించని దైవభక్తిపరులు. నేను డబ్లిన్ నగరానికి చాల దూరంలో నివసిస్తున్నా. ఎందుకంటే అది ఐరిష్ దేశంలో తక్కిన నగరాలకన్నా ఒక ప్రత్యేకమైన వాతావరణం కలది. 'డెర్రీ'నుండి 'కార్కు'వరకు 'విక్లో' నుండి 'గాల్వే'వరకూ ఎక్కడచూచినా అచంచలమైన దైవవిశ్వాసమే గోచరిస్తుంది. డెర్రీనగరంలోకల్లా పెద్దదైన 'సైంట్‌యూగెన్' దేవాలయ ద్వారంవద్ద నిల్చొని తండోప తండాలుగా వచ్చే భక్తుల్ని చూడూ! వాళ్ళంతా కల్మషంలేని హృదయంతో బులి బూచకాలు

లేని మాటల్తో, వినయ విధేయతల్తో ప్రేమోద్వేగంతో విరాజిల్లేవారు. నీకు, క్రిందగా పొడవైన గోపురంగల మరో దేవాలయంలోకి పోతూ వుండే జన ప్రవాహం గోచరిస్తుంది. నదీతీరాన్నున్న "ఫాయిల్" ను దాటిపో. అక్కడకూడా దేవాలయంలోకి పోయే ప్రవాహమే కన్పడు తుంది.

"గాల్వే" నగరంలో వున్న ప్రజల్లోని కతోలిక్కు విశ్వాసం నీకు తెలుసా? ఘోషపెట్టే సముద్రంలో బ్రహ్మాండమైన స్పానిష్ భవనాల్తో విరాజిల్లుతున్న ఆ పురాతన నగరానికి నావెంటరా! "క్లాడాగ్" పల్లెకు ప్రక్కగా వున్న "డొమినికన్" దేవాలయందాటి పోయి విశాలమైన "గాల్వే" అగాధాన్ని దర్శించుదాంరా! వాయవ్యంగా ఆకాశాన్నంటే ఎత్తైన శిఖరాలతో విరాజిల్లుతున్న కన్నెమెరా పర్వతాలను చేరడానికి పోతున్నయ్యా అన్నట్లుగా సముద్రంలో ఉన్న "క్లేరు" పర్వత శ్రేణులు మనకు కనబడుతై. రేవునుండి చిన్నచిన్న పడవలు విశాలమైన సముద్రంలోకి ప్రయాణం చేస్తూ మనకు గోచరిస్తై. తమ జీవనోపాధికి చేపలు పట్టుకొని జీవించే బెస్తవాళ్ళ పడవ లవి. మొట్టమొదటగా నున్న పడవపై నిల్చున్న మనిషిని సరిగ్గా చూడు! చేతిలో బైబిలు పుస్తకముతో స్లీవతో నిల్చున్న గురువా యన! ఈ రోజు వారికి చేపలుపట్టే కాలానికి ప్రథమం, వారి గురువు వచ్చి ఆ బెస్తలపైనా, ఆ సముద్రంపైనా, ఆ పడవలపైనా దేవుని ఆశీర్వాదం వచ్చేటట్లు జపం చెప్పేదాకా వాళ్ళు వల వెయ్యరు సరి గదా! ఆఖరికి తాడుగూడా ముంచరు.

పాత ఐర్లండు దేశంలో ఉన్న పట్టణ జీవితాన్ని గమనించాలి అనే కాంక్ష మీకున్నదా! అయితే, దేశం మధ్యలోకి ప్రయాణం చేద్దాం రా! "క్లేరు" పర్వతాల లోయగుండా పోతే "ఆర్డ్రిహాన్," "గోర్ట్," "ఎన్నిస్" లు దాటుతాం, అటు తరువాత దక్షిణానికి మరల్తే 'కాల్రిటో' పర్వత భుజస్కంధంపై పానన్ తిరుగుళ్ళలో పుట్టే, మధుర గీతికలు వినబడ్తై. ప్రసిద్ధిపొందిన ఆ 'గారీఓకి' సందుల్ని 'సైంట్‌మ్యాచిన్' దేవాలయపు నీడల్లో ఉండే ఆ పెద్ద శిలను చూడ డానికి తొందరపడక సంవత్సరంలో ఏ సోమవారం రాత్రిమైనా సరే నాతో రా! అక్కణ్నుంచి వచ్చే జన ప్రవాహాన్ని చూస్తే అప్పుడే ఏదైనా పెద్ద సభ ఒకటి ముగిసిందా! అనిపించేటట్లుంటుంది. నాతో పర్వతాని కవితం వైపుగా సముద్ర తరంగాలవలె వస్తూన్న ఈ జనం

సమావేశమయ్యే ! చోటికి రా. అది "రెడమ్ టోరిస్టు" గురువులు ప్రజలందరిచేతా పవిత్రమైన స్వాములు, అని కీర్తింపబడే వాళ్ళుండే "సైంట్ ఆల్ ఫోన్సస్" దేవాలయం. అక్కడి కించుమించుగా పట్ట ణంలోని సగం భాగం హాజరవుతుంది. మంగళవారం రాత్రి కల్లా తక్కిన సగం వస్తుంది. ఒకే సమావేశంలో ఆరువేల మందికి ఆ దేవా లయంలో స్థానం చాలదు అన్న విషయం ఏమంత ఆశ్చర్యకరమైంది కాదు.

'లిమరిక్' లో గల వాళ్ళ అచంచల విశ్వాసానికి అదెంత ప్రబల సాక్ష్యం !

ఇంతేగాదు. బుధవారంనాటి సాయంకాలం నీ ఇష్టం వచ్చిన దేవాలయానికి పోయి చూడు. ఆ దేవాలయం నిండా జనం కిట కిట లాడ్తూ ఉంటారు.

ఐరిష్ దేశంలోని ప్రతి పట్టణం ఇంతే. ప్రతి ఐరిష్ దేశీయుని హృదయంలో ప్రేమ స్థిర నివాసం ఏర్పర్చుకుంది. మానవ సహజ మైన పొరపాట్లు ఎప్పుడైనా చేస్తే, తప్పు చేసిన చిన్న పిల్లవాడు దుడుకు చిన్నవానివలె తండ్రి దగ్గరకు వచ్చి ప్రేమతో సంచరించేటట్లుగా, వాళ్ళు పశ్చాత్తాపంతో పాప సంకీర్తనము చేయుటకు గురువు దగ్గరకు వెళ్తారు. జీవితంలో క్రుంగి కూలారి అలసి సొలసి పోయినా, దేవాల యపు నీడల్లో వాళ్ళు తండోప తండాలుగా ప్రయాణాలు సాగిస్తూ జేసు నాథుని చల్లని చూపుల్తో పవిత్రులై అమితోత్సాహంతో జీవిత భారాన్ని వహించడానికి సంసిద్ధులౌతారు.

అట్టి పట్టణాల్లో నివసించే పిల్లల తల్లి దండ్రులు జేసునాథుని పరి పూర్ణానుగ్రహం పొందినవారు.

---

మూడవ అధ్యాయము.

# పల్లె జీవితం

పట్టణం వదలి ఇపుడు మనం పవిత్రమైన ఐర్లండు దేశంలోని గ్రామాల పరిస్థితుల్ని అవలోకిద్దాం. మనం పోతూ ఉంటే అచంచల మైన దైవ విశ్వాసంతో కూడుకున్న ప్రజల మధ్యలో మనమున్నట్లుగా మరొక ప్రబలమైన సాక్ష్యం లభిస్తుంది. ఐర్లండులోని ఈ పల్లె ప్రదేశాల్ని చూస్తుంటే పచ్చ పచ్చగా ముచ్చటగా నేత్రపర్వంగా ఉంటయ్. ఆ పల్లె ప్రదేశాలన్నీ చిన్న చిన్న ఇండ్లతోనూ, రాతి కట్టడాలతోనూ ఉండి అక్కడి జనానికి నిత్య నివాసానికి అనుకూలంగా ఉన్నట్లు కన్పడుతై. కొండల ప్రక్కనా, పచ్చిక మైదానాల్లో పశువుల్నీ, గొఱ్ఱెల్ని మేపు కుంటూ, చేలల్లో పనిచేసుకుంటూ, బురద నేలలో సరస్తీరాల్లో పరి శ్రమిస్తూ జీవిస్తుంటారు.

వాళ్ళు క్రొత్తవాళ్ళతో తొందరగా మనసిచ్చి మాట్లాడే రకం గాదు. మూకీ భావం కలిగి ఉంటారు. వాళ్ళ హృదయాల్ని ఆకర్షింప గలిగిన వాళ్ళకు మాత్రమే, వారిలోని గూఢమైయున్న అనన్య సద్గుణ లక్షణాలు బోధపడ్తై. వాళ్ళు సహజ సౌమ్య స్వాభిమానంతో, సౌజన్యంతో విరాజిల్లుతూ ఉంటారు. సునిశిత బుద్ధిగల కతోలిక్కుకు వీళ్ళ కిట్టి సుగుణాలు ఎట్లు లభించినవో తెలుస్తుంది. జేసునాధునితో, ఆయన పరిశుద్ధ మాతయైన మరియమ్మగారితో ఐక్యత కల్గి సన్నిహి తంగా జీవించుటవలననే వాళ్ళ కీ సుగుణాలు లభ్యమైనై. దీనికి తోడు మరో కారణ మేమంటే, వాళ్ళ పూర్వ చరిత్ర, దైవ దత్తమైన విశ్వా సాన్ని నాశనం చేయడంకోసం మతద్వేషులు ఛిన్నా భిన్నాలు చేసిన జీర్ణ దేవాలయ శిథిలాలు, భగ్నమైపోయిన నివాస స్థానాలు, విద్యాల యాల మధ్య గడిపే జీవితమే వాళ్ళకు మరింత వన్నె తెచ్చింది. దేవుని కొరకూ, దేశంకొరకూ, తమ జీవితాన్ని తృణప్రాయంగా గడిపినవాళ్ళ పూర్వీకుల చరిత్ర వాళ్ళ కళ్ళముందు ఎప్పుడూ సాక్షాత్కరిస్తుంది! అక్కడున్న వాతావరణ మంతేను.

వాళ్ళను చూస్తుంటే పాతనిబంధనలో చెప్పబడ్డ వాళ్ళ మూల పురుషులు గుర్తుకొస్తారు. దేవుని ఆజ్ఞలకు లోబడి అతివిధేయులై ప్రతి

పురుషుడూ పశువుల్ని మేపుకుంటూ, ప్రతి స్త్రీ నూలువడుకుతూ గృహకృత్యాల్లో నిమగ్నులై యుంటారు. వాళ్ళ జీవితమంతా ఆ విధంగా అతిపవిత్రమైంది. అతి స్వచ్ఛమైందిగా కన్పిస్తుంది. కాయ కష్టానికిగల గౌరవం తెలిసి ఆత్మాభిమానం కలవాళ్ళే అక్కడ వుండే వాళ్ళందరూ. నజరేత్ దగ్గరవున్న జేసుస్వామి హస్తస్పర్శచే వాళ్ల కష్టమంతా పవిత్రతను పొందింది. జేసునాథుని ఆజ్ఞకులోబడి వాళ్ళు తమ జీవితాలను గడుపుతారు.

ఈ పొలాల్లో పనిచేసేవాళ్ల నెవరినైనా తీసుకో! ప్రతిరోజు లాగానే, ఈ రోజు పొద్దునకూడా దేవునికి వందనాలు సమర్పించి, తన కష్టఫలితాన్నంతా భక్తితో దేవునికి సమర్పించాడు. దేవుని దయంతా తనమీద కలదనే అచంచల విశ్వాసంతోనే అతడు తన దైనిక జీవితం గడుపుతాడు. తమ తోటివారితో అతడు కులాసాగా తిరుగుతున్న వేళల్లో ఇది పైకిబాగా కన్పిస్తుంది. ఆ సందు మొదట్లోనుంచి వస్తున్న స్నేహితుణ్ణి చూడు! ఆ పొలాల్లో పనిచేస్తూ, ఆశీర్వాదం వినడానికి వస్తున్నాడు, వెంటనే ఆ పక్కవాడినుంచి "దేవుడు రక్షించుగాక!" అని మళ్ళీ ఇత డతణ్ణి అభినందించడం కూడా వెంటనే వినబడుతుంది. అడుగో! ఆ బాటసారివెంట వెళ్ళుదాం రా! బాటప్రక్కనే, ఎల్ల ప్పుడూ హృదయపూర్వకంగా అందరికీ స్వాగతం చెప్పే సగం తెరి చున్న ఆ పూరిగుడిసెలోకి ప్రవేశించాడు. "ఇక్కడందర్నీ దేవుడు రక్షించుగాక! అని అత డన్నాడు. వెంటనే అతని మాటలకు ప్రత్యుత్త రంగా, "దేవుడు దయతో నిన్ను రక్షించుగాక!" అని ఆ కుటీరంలో వున్న వారి కంఠాలనుండి హృదయపూర్వకమైన స్వాగతం వచ్చింది.

ప్రతి పల్లెలోనూ ఇటువంటి హృదయపూర్వకమైన స్వాగ తాలు, అభివందనాలే మనకు ప్రతివ్యక్తినుండి వినబడ్తై. పర్వత పరివేష్టి తమైన "వెక్సుఫర్డ్"లో, సస్యశ్యామలాలైన పొలాల్తో కూడుకొన్న 'మెతీ' లో ఎటుజూచినా కాలువల్తో వప్పుతున్న "కింగ్స్" జిల్లాలో, "మన్స్టటర్"పర్వతప్రాంతాల్లో ఎక్కడజూచినా జేసునాథుని సాక్షా త్కారమే గోచరిస్తుంది. మానవుడు దేవుని ధ్యానించడానికి, ఆయనకు స్తోత్రాలు చెల్లించడానికి, ఆయనకు సేవచేయడానికే పుట్టాడన్న జీవిత ప్రధానరహస్యం ఇక్కడివారందరికి బాగా తెలుసు. జీవితంలో ఉన్నత స్థానాన్ని పొందాలంటే వారి సత్ప్రవర్తన, ఉన్నతాశయాలు, సుభా

షితాలు, ఈ దైవప్రార్థనవల్లనే నిర్ణయింపబడ్డాయి అన్న పరమసత్యాన్ని అక్కడి వారందరూ గుర్తించారు.

రోడ్డుప్రక్కన కాస్లు అడుక్కునే బిచ్చగాడు దేవమాతపేరుతో జేసునాధుని పేరుతో, దీనంగా యాచిస్తాడు. అతడికి వచ్చిన దమ్మిడీకి ఎంతగానో సంతృప్తిజెంది, దేవునికీ, దాతకూ తన కృతజ్ఞతాభి వందనాలు అందిస్తాడు. అతనికి ఒక చిల్లిడబ్బైనా దొరక్కపోయినప్పటికీ నిరాశచెందక "దేవుడు దేవమాత నీకేవిధమైన కొరతలేకుండా రక్షించుగాక!" అని పలుకుతూనే ఉంటాడు. అతడు దరిద్రుడైనంతమాత్రం చేత అస్పృశ్యుడు కాడు. పనికోసం దేవులాడే ఆ బికారి జీవిని చూడు! అత డేపల్లెకుపోయినా అతనికి హృదయపూర్వకమైన స్వాగతం లభిస్తుంది. ఏ కరుణామయుడో, ఏ కరుణామయో, అతణ్ణి ఆహ్వానించి తన జీర్ణకుటీరంలోకి తీసుకపోయి భోజనాది సత్కారాలు చేసి గౌరవిస్తారు. అత డేవిధంగానైనా దైన్యంగా కన్పడ్తే, "జేసునాధుడు మాత్రం ఏకాకిగా దరిద్రుడుగా ఉండలేదా! నీ వెందు కింతగా జాలి పడతావ్. ఇదిగో! ఈ ఆహారాన్ని స్వీకరించు. నీ దైన్యావస్థకు నీ వేమాత్రం భిడియపడకు." అన్న ఓదార్పుమాటలు, ప్రతిగృహిణి నోటిగుండా వినపడ్తయ్. "నీకు సాయం చేయడమంటే జేసునాధునికి సేవచేయడమే," అని అంటుంది ఆమె.

ఇది వారి నిత్యదినకృత్యం. ఆదివారం వచ్చిందంటే, "పవిత్రమైన సబ్బతు దినాన్ని జ్ఞాపకముంచుకో." అన్న వేదవాక్యాన్ని హృదయపూర్వకంగా సంతోషంతో నిర్వహిస్తారు. జాతిదైవాన్ని దర్శించడం జాతిగా వారిముఖ్యవిధి. తండోపతండాలుగా దేవాలయానికి వారు వస్తూవుండడం మనం గమనిస్తాం. పొలాలుదాటి గుట్టలతిక్రమించి, శాద్వలప్రదేశాల్ని అధిగమించి, శతాబ్దాలనుండి రహదారిమార్గాలుగానున్న బాటల్లో వారు ఒక మహాప్రవాహం వలె దేవాలయాలకు వస్తారు.

స్వేచ్ఛాప్రదాత గృహసమీపంలో "కూమకిస్టా"లో ఉన్న చిన్నదేవాలయానికి గానీయండి, లేకపోతే "క్లేర్" "డోనిగల్" పర్వతాల్లో ఉన్న దేవాలయాలకు గాని, ఇంకే దేవాలయాలకు గాని ఒక ఆదివారంరోజు పోయి చూద్దాం పదండి. పెద్దపెద్ద పట్టణాలల్లో ఎంత అచంచలమైన దైవవిశ్వాసంతో ప్రజలురావడం గమనిస్తామో,

అట్లాగే ఇక్కడకూడా చూస్తాం. దేవాలయమంతా జనంతో క్రిక్కిరిసి పోతే, చర్చికిబైట మోకరించి, చాలాజాగ్రత్తగా పూజబలిని గమనిస్తూ వున్న దైవధ్యానపరుల్ని మనం దర్శిస్తాం. దైవప్రార్థనలు జరుపుకోడానికి అందరికి అవకాశం లభించక పోవడంచేత, ఐర్లండు దేశంలో ఆ యిబ్బందేమీ లేకుండా ఎక్కడచూచినా దేవాలయాలు అసంఖ్యాకులుగా వెలిసినై. ప్రతి ఆదివారం ఆ దేవాలయాల్లో చాలా పూజబలులు జరుగుతుంటై. "శ్రమించి జీవితభారంతో క్రుంగిపోయేవాళ్ళంతా నా దగ్గరకురాండి. నేను మీశ్రమ లన్నింటినీ తొలగించి, మీకు నూతనోత్తేజం కలిగిస్తా." అన్న జేసునాథుని పలుకుల్లోగల ఆంతర్యం అక్కడి ప్రజలహృదయాల్లో ఒక దివ్యజ్యోతివలె వెలుగుతూ, ఆయనకత్యంత సన్నిహితంగా వుండడానికి ప్రయత్నించేసే ప్రజానీకమే ఐర్లండు దేశంలో ఏమూల చూచినా మనకు కన్పిస్తారు.

పూజ బలి పూర్తి అయిన తర్వాత, స్నేహితులంతా బైటికి వచ్చి, కులాసాగా అప్పటి విషయాలన్నింటిని చర్చించుకుంటారు. జ్ఞానస్నానంకోసం వేచియుండే పిల్లలు తెల్లని దుస్తులు వేసికొని, మొగాల్లో సంతోషం నాట్యం చేస్తూండగా గుంపులు గుంపులుగా ఉన్నారు చూడు! అక్కడ ప్రశ్నోత్తర క్రమమైన బోధనా విధానంకోసం ఉన్న యువకుల్ని వీక్షించు! వారి వెనకాల గతించినవారి గోరీల దగ్గర దుఃఖాశ్రువుల్ని జార్చేవారున్నారు గమనించు! సత్ప్రసాదాన్ని లోగొన్న తర్వాత, దేవునికి వందనాలు సమర్పించి అందరి హృదయాల్లో ఉత్తేజాన్ని రేకెత్తించి, దయ నిండిన జేసునాథుని విషయాన్ని ప్రేమతో చర్చించే దైవ భక్తులు చర్చి లోపల బల్లలపై ఆసీనులై ఉన్నారు. ఆదివారంలో సాయంత్రం కులాసాగా కాలక్షేపం చేస్తారు. రోడ్ల ప్రక్క ఖాళీ చోట్లల్లో, నదీ తటాలపైన, వంతెన్లమీద, మైదానాల్లో గుంపులు గుంపులుగా వచ్చి పెద్దవాళ్ళంతా ఆనాటి సాయంకాలం కులాసా కబుర్లతో ఆనందంగా కాలక్షేపం చేస్తారు. హాలాల్లో 'ఫుట్‌బాల్' ఆడుకుంటూ, కేరింతలుకొడ్తూ మహదానందంతో ఉన్న యువ సమూహాన్ని చూడ్డానికి ఒక్కొక్కప్పుడు పోతూంటారు.

సూర్యుడు పశ్చిమ పర్వతంపై అస్తమిస్తాడు. సాయంకాలాన్ని తెలియజేసే గంట మ్రోతలు మనోహరంగ వినిపిస్తై. వారు దైవప్రార్థనల్తో తమ దినచర్య ప్రారంభం చేసారు గాబట్టి ఇప్పుడు అట్లాగే

ప్రార్థనల్తో ముగిస్తారు. తన గురువుచే అభ్యుదయాన్ని ప్రసాదించి తన ఆశీర్వాదాన్ని, శాంతిని అందరకూ కలుగజేసిన జేసునాధుని ముందు, దేవ వరప్రసాద సాధనంతో, అచంచలమైన దైవ విశ్వాసంతో, ప్రతి ఆదివారం సాయంత్రం ఐరిష్ జాతి మొత్తం మోకరిస్తుంది.

ప్రపంచ విశ్వాసాన్ని చూరగొన్న మరొక వేదంటే "ఆంగిలస్" సుభాషితం.

ప్రొద్దున, మధ్యాహ్నం, సాయంకాలం ఎప్పుడైనా సరే జేసునాధుని అవతార మహిమను సూచించే గంట మ్రోగితే అందరి మనస్సులు దైవ భక్తితో నిండిపోతై. పొలంలో పని చేసే రైతు, నూలు వడికే కన్య, గొఱ్ఱె కాపరి, ఆడుకుంటుండే పిల్లవాడు, ఒకరేమిటి! అంతా ఆ గంట మ్రోత వినబడగానే, నిశ్శబ్దంగా లేచి నిలబడి దైవ ప్రార్థనలు జరుపుతారు.

ఒక రోజు వేసవికాలంలో మిడిసి పడుతున్న ఎండలో, చేలో, రెక్కలు ముక్కలయ్యేటట్టు శ్రమించే యువక దంపతుల్ని చూచాను. వాళ్ళకు కొద్దిదూరంలో ఒక చెట్టు నీడలో, కుక్కపిల్లతో ఆడుకుంటూ కేరింతలు కొడ్తూ ఉన్న వాళ్ళ బిడ్డ కన్పించాడు.

ఇంతలోకే, సమీపంలో ఉన్న దేవాలయంలో గంట మ్రోగింది. తక్షణమే ఆ స్త్రీ తన బిడ్డ దగ్గరకు పరుగెత్తుకొని వెళ్ళి, చేతుల్తో పట్టుకొని అక్కడి పచ్చికపై ఆ బిడ్డను మోకరింపజేసింది. తానూ ప్రక్కనే మోకరిల్లి, ఆ బిడ్డ చేతుల్ని దగ్గరగా జేసి పట్టుకొని, స్వర్గంవైపు దృష్టి సారించింది. ఆమె భర్తకూడ అక్కడకు వచ్చి వారి ప్రక్కనే మోకరిల్లి ఘుంటారావానికి సమాధానంగా "జేసునాధుడు మరియమ్మకు పుత్రుడై జన్మించాడు," అని ప్రశాంతంగా పలికాడు. ఆ దంపతుల ఈ సమాధానం వారిలో గల దైవ భక్తిని నిరూపిస్తున్నది. అది ఒక మనోహరమైన దృశ్యం.

"జీన్ ఫాంకోయిస్ మిల్లెట్" వ్రాసిన ప్రసిద్ధమైన "త్రికాల జప" చిత్రం అందరికీ చిరపరిచయమే. ఆ చిత్రంలో ఒక పంట పొలం, దానికి ముందుగా దైవ ధ్యానంలో నిమగ్నులై నిలబడియున్న భార్యాభర్తలూ చిత్రింపబడ్డారు. మరియు మాతయొక్క ప్రేమాస్పదులైన ఈ పిల్లలు మోకరిస్తూ దైవ ధ్యానం చేస్తూ అతి సన్నిహితమైన హృద

యాలతో ఉండగా ఐర్లండ్ దేశంలో నేను చూడడం నాకు పరమ ప్రీతికరమైన విషయం.

ఇప్పుడు మనం గమనిస్తున్నవారి మాదిరిగా లౌకికంగా ప్రపంచంలో అందరూ స్వేచ్ఛా జీవులుగారు. వాళ్ళదేమీ తప్పులేక పోయినప్పటికీ దుర్భర జీవనం గడిపేవారు కొందరున్నారు. వారియొక్క అచంచలమైన దైవభక్తి ఆశ్చర్యకరమైన విషయం. పరిశుద్ధ గ్రంథంలో చెప్పబడిన "మానవుని జీవితం అతనికి కలిగిన వస్తు సముదాయంపై ఆధారపడి యుండదు." అన్న సూక్తిలోని పరమ సత్యాన్ని వారందరూ గుర్తించినట్లుగా కన్పడుతారు. ఈజిప్టుదేశంలో ఇజ్రాయేలు జాతివారు నదీ తీరాల పరివేష్టించి శోకిస్తారు. ఇక్కడ ఆ ఈజిప్టీ దేశీయులు దేశంలో జొరబడి ఇండ్లు తగులబెట్టి, మనుష్యుల్ని హతమార్చి, తా మిదివరకు శోకించి, కష్టించి జీవించిన నది కవతలనున్న పర్వత ప్రదేశాలకు ఇజ్రాయేల్ ప్రజలందరిని తరిమివేశారు. ఇటువంటి యమయాతన లనుభవిస్తూ జీవించడానిక్కూడా వీల్లేకుండా దోపిడీ చేయబడ్డప్పటికీ, వారిదివరకు ఏ విశ్వాసం కోసమై అచంచలంగా నిలిచారో, అట్లాగే దృఢమైన నమ్మకంతో ధీరులుగా ఉన్నారు. మొల లోతు మురికి నీళ్ళలో పనిచేస్తూ ఆ నీటినంతా బైటికి తోడివేసి గింజకూడా పండడానికి వీల్లేని ఆ నిస్సారమైన పర్వత ప్రాంత ప్రదేశాన్ని, సాగు చేసి వారు చిట్టెడు గింజలు సంపాదించుకోగలిగారు. ఈ విధంగా నిస్సారమైనదాన్ని సారవంతంగా చేయడమంటే పన్నుల భారాన్ని ఇంకింత నెత్తిన వేసుకోవడమేనని వారికి తెలుసు. అయినా వాళ్ళు అట్లా చేయక తప్పిందిగాదు.

ఈ విధంగా ఆ జాతి కాలక్రమేణా అభ్యున్నతిచెందినా, వారి పూర్వీకుల అక్రమమైన చర్యలకు గురియై బాధపడువారు కొందరు లేకపోలేదు. వారు వారిప్రదేశాలు బురదతో కూడుకున్నవని వారిని నిర్లక్ష్యంచేస్తూ కొన్నివిమర్శలు బైలుదేరినై. ఒక వ్యక్తిని మంటలోకి నెట్టి అతడు తగలపడ్డాడనీ, అతడు అనాథుడనిచెప్పడం ఎంతసమంజసమో, ఈ విధంగా వాళ్ళను నిందించడంకూడా అంత సమంజసంగానే కనబడుతుంది. వాళ్ళు గీచి గీచి, ఖర్చు చేసేవాళ్ళని, మరొక అభాండం వేసారు. అది వాళ్ళపై నీలాపనిందమాత్రమే. ఎందుకంటే వాళ్ళు అట్టి క్లిష్టపరిస్థితుల్లోఉండి స్వేచ్ఛకోసం పోరాడుతూ ప్రపంచలోని జాతు

లన్నిటికన్నా ఉదారంగా ఖర్చుపెట్టేవాళ్ళన్న విషయం నిరూపింప బడినదే. సమర్థుడైన "జాన్ మార్లే" ఈవిషయంలో ఏం చెప్పాడో విను.

"ఐరిష్ దేశీయుల ఉత్తమగుణాలకు ముగ్ధులైనవారిలో నేనొకణ్ణి. వారు ప్రపంచంలో కష్టసాధ్యమైన పనిని సాధించారు. అక్కడ పండే కాసినిగింజలు పన్ను చెల్లించడానికే సరిపోతూందని తెలిసికూడా తర తరాలుగా వాళ్ళు అట్లాగే ఆ భూమిని సాగుచేస్తూనే యున్నారు. ఐరిష్ దేశీయులకు సత్ప్రవర్తన, పవిత్రత, గౌరవాదరాలు, వెన్నతో పెట్టినవే! వారికి వినయంమాత్రం అమితంగా ఉన్నది. వారికి తమ నాయకుణ్ణి ఎట్లా అనుసరించాలో తెలుసు. తగినకాలం, స్వేచ్ఛా, బాధ్యతా ఉంటే బ్రిటిష్‌పతాకం ఎగిరే తక్కిన జాతులమాదిరిగా ఒక దృఢమైన జాతిని ప్రస్తుతం ఐర్లాండ్‌లో ఉన్న పరిస్థితులను ఉపయో గించుకొని నిర్మించగలమన్న దృఢవిశ్వాసం ఉన్నది.

"నీవు వాళ్ళకేమాత్రం లోపమే లేదన్నట్లుగా చిత్రిస్తున్నావు" అని ఎవరైనా నన్ను గదమాయించవచ్చు. వారికీ లోపాలున్నై. నేను కాదనడంలేదు. ఎందుకంటే లోపం మానవ సహజమేగా! వారూ మానవమాత్రులే! దేవతలుగారు నిర్దోషులుగా ఉండటానికి! వాళ్ళలో ఉన్న సుగుణాలకన్నా సామాన్యంగా పొరపాట్లే యెక్కువ. వారు వాటిని దుఃఖపూర్వకంగా అనుభవిస్తారు.

ఒకరోజున నేను "కన్నెమెరా" రోడ్డుమీద పోతుంటే ఒక ముసలామె యెదురుపడి "మా ఆయన నీకు కనపడ్డారా!" అని అడిగింది. నాకు కనపడలేదని చెప్పా. "ఆ! ఐతే ఆయన తప్పతాగా డన్నమాట." అన్నదామె

"నీ కెట్లా తెలుసు! నిజం తెలియకుండానే యెవర్నీ నిందించ కూడద"ని నేనన్నా.

"నాకిది ముమ్మాటికి తెలిసినవిషయమే! ఎందుకంటే అతడీ పెద్దబజారుగుండా పోయాడు." అని అన్నదామె.

పెద్దబజారంటే ఆమె ఉద్దేశ్యం మా వెనకాలనున్న రాజవీధి నుంచి చీలి పట్టణంలోకి తీసుకపోయేరోడ్డు. ఆరోడ్డు మేము నిల్చున్న చోటికి ఐదుమైళ్ళ దూరంలో మళ్ళీ ఈ రాజమార్గంలోకి కలుస్తుంది. అంటే ఆ రోడ్డు చీలి మళ్ళీ రాజమార్గంలో కలిసేచోటు మూడుమైళ్ళ

లోఉంది. కాని ఆ రోడ్డు వెంటనే నడిచి పోవడమంటే పదిమైళ్ళదూరం అన్నమాట. ఈ మూడుమైళ్ళలో ఒక దేవాలయం ఉన్నది. "ఇంత దగ్గర మార్గముండే ఇంత చుట్టుచుట్టి పగలల్లా పరిశ్రమచేసి పదిమైళ్ళ దూరం ఎవడుపోతాడు! అతడు ఇంతదూరం చుట్టిచుట్టి పోయాడన్న నమ్మకం నీకేమిటి?" అని అడిగాను.

ఆమె నేనడిగినప్రశ్నకు తగిన సమాధానం చెప్పగల్గుతుందని నే నేకోశాన అనుకోవడం లేదు. కాని ఆమె చెప్పిన సమాధానం విని నేను దిగ్భ్రమచెందాను.

"మేము ప్రతిరోజూ ఆ మార్గంగుండా రోడ్డుమీదకు కనబడే ఆ దేవాలయంలోకి దైవప్రార్థన చేయడానికిపోతాము. అయన దేవునికి స్తోత్రం చెప్పకుండా ఒక్కడుగుకూడా వేయలేదు. త్రాగి ఆజేసునాథుని దగ్గరకుపోడు" అని అన్నదామె.

ఇది బ్రహ్మాండంగాలేదూ! లోపాలు! అవును! వాళ్ళకూ లోపాలున్నై. దేవుడు వాళ్ళను క్షమిస్తాడు. రోజల్లా కష్టంచేసి అలసి సొలసి పోయిన ఆ దరిద్రవృద్ధజీవి అర్ధభోజనంతో తాను దేవునికి స్తోత్రంచెప్పకుండా చర్చిలోకి పోలేనందువల్ల ఇంకా ఏడు మైళ్లదూరాన్నితను పొడిగించుకున్నాడు.

గతించినవారిపై, వారికిఎంతప్రేమ! వాళ్లెంతగా జ్ఞాపకం పెట్టుకుంటారు! ఉత్తరించు స్థలములోని బాధలనుండి తప్పించి వారిని మోక్షమునకు తీసుకొని వెళ్లవలసిందిగా వారు గతించినవారికై కొన్నివందల పర్యాయాలు, దేవునికి పూజలను చేయిస్తారు. ఆత్మల పండుగరోజున మళ్లీ దైవస్తోత్రాలు చెల్లిస్తారు.

పూజబలి జరిగింతరువాత బైటకువచ్చే గుంపును ఒకసారి పరీక్షించు. వారిలో దేవాలయ బహిఃప్రాంగణానికి (గోరీలదొడ్డి) వెళ్లే వాళ్లను గమనించు. ఇక్కడ బాలవిధవ జీవితప్రాంగణంలోకి ఇప్పుడే అడుగుపెట్టుతున్నది. తన చంటిబిడ్డను గుండెకు హత్తుకొని, గతించిన తన భర్తకొరకై నిన్నమొన్ననే నిర్మించిన గోరీకడ మోకరించి కండ్ల వెంట జలజల నీరుకారుస్తూ, తన సామీప్యానికి ఆహ్వానించిన దేవునికి తన భర్తనుగూర్చి స్తోత్రాలు చెల్లిస్తున్నది. తనకు ఎదుటగా రాతిపై చెక్కబడిన తన తల్లిదండ్రులపేర్లను, తన సహోదరినామాన్నితిలకిస్తూ, వాటికెదురుగా మోకరించి సజలనయనాలతో, వాళ్ళ ఆత్మశాంతి

5

కోసమై అక్కడ చేతిలో గులాబీలను పట్టుకొని దైవప్రార్థనలు చెల్లిస్తున్న ఆ యువతిని గమనించు! మరో గోరి దగ్గర వయోభారంతో క్రుంగి, కర్రపై ఆధారపడి, దైవస్తోత్రాలు చెప్పుతున్న ఆ వృద్ధమాతను చూడు! ఆమె కెదురుగా రాతిపై లిఖించియున్న అక్షరసముదాయాన్ని వృద్ధాప్యంవల్ల చూపు తగ్గిపోవడంచేత సరిగా చూడలేకపోతున్నది. ఆమె కథ కనుక్కుంటే నాకు తెలిసినవిషయం ఇది. అప్పటికి ఏభై సంవత్సరాల క్రితం ఆమె భర్త మరణించాడట. తర్వాత కొన్నేండ్లకు ఆమె సోదరీమణులిద్దరూ గతించారట. ఆమె అప్పట్నుంచీ, అనగా అర్ధశతాబ్దినుంచి ప్రతివారం ఈ గోరీలదగ్గరకు వస్తూ వారి ఆత్మశాంతికోసమై దైవప్రార్థనలు జరుపుతూ వున్నదన్నమాట! ఆమెకు ఇప్పటికి దాదాపు 80 సంవత్సరాలుపైచిలుకే ఉన్నై. రేపోమాపో ఆమెకూడా తనంత గాఢంగా ప్రేమించినవారి దగ్గరకు చేరుకొంటుంది. ఆమెకు ఇంతకాలమైనా, వారిపైగల ప్రేమ లేశంగూడా తగ్గిపోలేదు. ఆమె ప్రేమ మృత్యువునుకూడా జయించగల్గినంత గాఢమైంది!

వారి దాతృతాగుణానికి సరిహద్దులులేవు "ఈనాడు గతించిన వారికి' ఎన్నడో గతించి విస్మృతిపాలైనవారి ఆత్మలకు' 'ఎక్కువగాఆత్మశాంతికోసం తపించి గతించినవారికి' 'నాకపకారం చేసినవారికి' అందరి ఆత్మలకు శాంతిని చేకూర్చండి ప్రభూ!" అని వారు విశాల దృక్పథంతో గతించినవారి అందరి ఆత్మలకు శాంతిప్రార్థనలు జరుపుతారు. అదే వారిలోవున్న క్రైస్తవ ఉదారాశయం. అదే ఉన్నత దృక్పథం. మరణించినవారికై పూజబలులు చేయిస్తారు.

'మన్‌స్టర్ దేవాలయ ప్రాంగణంలో సమాధులదొడ్లో అక్కడ మూలగా ఒక సమాధి ఉంది. ఆ సమాధిముందున్న పచ్చిక, ప్రతి నిత్యం మోకరిస్తూండడంవల్ల అణగి చప్పబడ్డట్లుగా ఉంటుంది. పూజబలి జరిగినతర్వాత, అంత్యక్రియలు జరిగినతర్వాత, తమ బంధువుల సమాధులదగ్గర ప్రార్థనలు చెల్లించుకొని, అందరూ ఈ సమాధిదగ్గరకు వచ్చి మోకరిల్లుతారు.

"ఈ సమాధి యెవ్వరిది?" అని నే నడిగాను. "ఈ పట్టణంలో గుండా ఎక్కడికో వెళ్ళుతున్న ఒక దరిద్ర నూతనాగంతకుడు హఠాత్తుగా జబ్బునపడి మరణించాడు. అతన్ని ఇక్కడ దీంట్లో సమాధి చేశాం." అన్న సమాధానం వచ్చింది. "ఆయనవాళ్ళ కెవరికీ ఈసంగతి తెలియనే తెలియదు. మేముతప్ప ఆయన ఆత్మశాంతికోసం ప్రార్థనలు

చేసేవాళ్ళెవరూ లేరు.'' అని ఒకరునాకు సమాధానంగా చెప్పారు. అవును. అచ్చుపడిఉన్న ఆ పచ్చికే దానికి ప్రబలతార్కాణం. అటువంటివారు మరణాన్ని ఎదుర్కోవడమంటే ఏమాత్రం భయపడరు. పైగా ప్రేమాస్పదులైన తన తలిదండ్రుల దగ్గరకు మహదానందంతో పరుగెత్తుకువెళ్ళే సంతానంలాగా మహదానందంతో మృత్యువును స్వీకరిస్తారు, అని వారినిగూర్చి అనుకోవడంలో ఏమంత ఆశ్చర్యం లేదు. ఒక ముసలాయన మరణసమయంలో నేనక్కడకు పోవడం తటస్థించింది. కానీ ఆయన విషయంలోమాత్రం మరణోన్ముఖత్వానికి సంబంధించిన ఆనందచిహ్నలేవీ నాకు గోచరించలేదు. నేను ఆయన్ని మరణించడానికి ఎందుకంతగా భయపడుతున్నాడో కారణం తెలుసుకుందామని గుచ్చి గుచ్చి అడిగా. ఆయన దానికి చెప్పిన సమాధానం ఒక్కటే ఒక్కటి.

"స్వాములవారా! దేవాలయానికి పోయి పూజబలి సమర్పించి, జేసునాధుని తనివిదీరా ఒకసారి చూచివచ్చేంతవరకూ దేవుడు నాకు స్వస్థత ప్రసాదిస్తే బాగుంటుందని నేను కోరుకుంటున్నాను.'' అని ఆ పండు ముసలి నాప్రశ్నకు ప్రత్యుత్తరంగా తన మనోభిప్రాయాన్ని వెల్లడిచేసాడు.

ఇంకోపర్యాయం నేను మరణోన్ముఖురాలైన ఒక పండుముసలామె దగ్గరకు పోవడం తటస్థించింది. ఆమె క్రైస్తవగురువుల మరణావస్థ దివ్యసత్ప్రసాదమును లోకొనుటకు నిరీక్షిస్తున్నది. తలుపుతెరచిన శబ్దం విన్నవెంటనే ఆమె ఒక్కసారిగా లేచి మోకరించింది. ఆమె ఇప్పటికో, ఇంకాసేపటికో ఇహలోకాన్ని విడిచిపోయేపరిస్థితిలో ఉండికూడా మహోద్వేగంతో అచంచలమైన దైవవిశ్వాసంతో 'ప్రభో!' నీకువేయి స్వాగతాలు ! ప్రభో! నీకు వేయి సుస్వాగతాలు" అని స్పష్టంగా తన హృదంతరంలో స్థిరనివాసం ఏర్పరచుకొన్న జేసునాధునికి స్తోత్రాలు చెల్లించింది. గురువుగాని, ఆమెచుట్టుప్రక్కల పరిచర్యలు చేయడానికి నిలబడ్డవాళ్లుగాని, ఎవళ్ళూ ఆమెకు కనపడలేదు. ఆమె బాహ్యప్రపంచాన్ని మరచి ఆమె రక్షకుడు, ఆమెకు సాక్షాత్కారం చెందిన జేసునాధునితో ఆమె తన్మయత్వం చెందిపోయింది.

మరణము, యౌవనము నందుగాని, వృద్ధాప్యమునందుగాని, ఏ చోటునందుగాని, ఏ సమయమందుగాని, ఏ పరిస్థితులలోగాని సంభ

వీంచినప్పటికి వారు దానికి భీతినొందరు. వారు హృదయ పూర్వకంగా మృత్యుదేవునకు స్వాగతం చెపుతారు. వారికి మృత్యువంటే ఆదాము తమకూ, జేసునాధునికీ మధ్య వేసిన తెర ఎత్తివేయడ మన్నమాట. వాళ్ళు జేసునాధునిపై, మరియమాతపై, తమకున్న గాఢమైన ప్రేమతో, నిశ్చలమనస్సుతో, ఆ తెర అవతలకు తరలిపోతారు.

---

నాలుగవ అధ్యాయం.

# దేశత్యాగం

ఒక మహా బలవంతమైన సేన తన తూర్పు సముద్రతీరంలో లంగరు వేసేటంతవరకూ, ఐర్లండ్ తన ప్రకృతిసౌందర్యంలో తన్మయత్వం చెందుతూ మైమరచి యున్నది.

అది కెల్టులరాక. యూరప్ దేశం వారి దండయాత్రకు ప్రథమ కబళంగా లొంగిపోయింది. క్రమంగా ఆ తూర్పుదేశాలన్నీ వారి పాదాక్రాంతమైనయ్. అడుగు పెట్టిన చోటల్లా విజయం సిద్ధిస్తుంటే వారికి మత్తెక్కి "ఎరిన్" దేశంయొక్క సస్యశ్యామల భూభాగాం పైనకూడా అడుగుపెట్టేటంతవరకూ వాళ్ళు ఊరుకోలేదు. ఆ సుందరదేశం వాళ్లని విపరీతంగా మోహపెట్టింది.

వాళ్ళు ఇక్కడ ఆగి ఇక్కడే ఒక బలిష్టమైన సామ్రాజ్యాన్ని నిర్మించారు. అటుతర్వాత శతాబ్దాలతరబడి అక్కడనుంచి వాళ్ళసేనలను నలువైపులకూ దండయాత్రలకు పంపసాగారు. "యూరప్"నుంచి "ఆల్ప్స" వరకు గల భూ భాగంలో ఐరిష్ ప్రజలు గొప్ప బలాఢ్యులుగా పేరుమ్రోగారు. వీళ్ల దండయాత్రలకు జంకి క్రమ శిక్షితులైన రోమన్ సైనికులు వాళ్ళ బ్రిటిష్ దుర్గాలనుంచి భీతితో పారిపోసాగారు.

ఐరిష్ ఆశ్వికదళం పిడుగుపాటు మాదిరిగా మధ్య యూరప్‌ను కంపింపచేసింది. ప్రకాశమానములైన ఐరిష్‌దళంఖడ్గాలు జర్మనీదేశములో చిట్టడవుల్లోగూడా మెఱపులవలె ప్రకాశిస్తూ, అచ్చటి ప్రజలను భయభ్రాంతు లయ్యేటట్టు చేసినవి.

ఉన్నట్లుండి వాళ్ళ సైనికవిజయం, వాళ్ళవిజృంభణం, ఒక్కసారిగా హఠాత్తుగా అంతమైపోయింది. వాళ్ళు గృహోన్ముఖులైనారు. తక్కినజాతులన్నీ మళ్ళీస్వేచ్ఛగా గాలి పీల్చుకునేందుకు అవకాశం కల్గింది. కాలం గడిచింది. అయిదవ శతాబ్దం ఉత్తరార్థంవరకూ ఐర్లండు దేశాన్నిగూర్చి ప్రస్తావనేలేదు.

జంకూ గొంకూ లేని మరొక దండు ఆ ద్వీపం పశ్చిమాన్నుంచి బయలుదేరింది. యూరప్ దేశాన్ని లోబరుచుకొన్నది ఆ దండు కాని కత్తితో మాత్రంగాదు. ఎట్లాగంటే, వాళ్ళ పతాక చిహ్నము జేసు నాథుడు. వాళ్ళ ఆయుధం శ్లీవ.

ఈ అద్భుత పరిణామం ఎట్లా వచ్చింది? ఏ అగోచరమైన శక్తి ఈ విజేతలను తమ స్వదేశానికి మరలించ కల్గింది? ప్రపంచ విజేతయైన జేసునాథునిపై అపూర్వకమైన ప్రేమతో ఉద్రేకపూరితాలైన వారి హృదయాలను ఎట్లా నింపగల్గింది?

అర్చ॥ పాత్రిక్కువారి నొకప్పుడు ఐరిషువారు బానిసగా జేసికొనియుండిరి. ఆ ఐరిషువారి ఉద్ధరణకై జగద్గురువర్యులగు పరిశుద్ధ పాపుగారు పాత్రిక్కువారినే పంపించినారు. వినయ విధేయతలు గల ఆ యాత్రికుడు ఐర్లండ్‌జాతి చైతన్య ప్రదాత ఐర్లండ్ దేశమంతా పర్యటించి తనయొక్క ఉదాత్తమైన ఉన్నతాదర్శ పూరితమైన ప్రవర్తనద్వారా చాలా మందిని తన వైపు మరల్చుకొన్నాడు. ప్రేమ చేతనే ఆ జాతిని ఆకర్షించి తన సాన్నిధ్యాన్ని చేర్చగల్గిన కరుణార్ద్ర హృదయుడతడు. శ్లీవ వేయబడిన జేసునాథుని గాథను ఆయన పవిత్ర సూక్తులను కథలుగా చెబుతూ ధీరులు, యోధులునైనవారితో అతడు పర్యటన సాగించాడు. వారి నింతవరకూ అజేయులుగా చేయగలిగిన పద్ధతికంటె, ధైర్య సాహసాలకు అగ్ని పరీక్షగా, మానవత్వానికి గీటు రాయిగా, ఉన్న పరమ సత్యమైన ఒక మహత్తరమైన, అపూర్వమైన, యుద్ధ విధానాన్ని, అతడు వారికి నేర్పాడు. ఆ యుద్ధ విధానం ప్రపంచంలో జరిగే, జరిపే యుద్ధ విధానాలకన్నా మహోదాత్తమైంది. నాయకులకుగూడా నాయకుడైన, జేసునాథుడు 'తన్ననుసరించినవారికి విజయం తథ్యం' అని ఏ యుద్ధ తంత్రాన్ని చెప్పాడో, ఆ యుద్ధ తంత్ర మిది. 'కాల్వరి' అధినేతయైన జేసునాథుని అడుగు జాడల్లో హృదయాలుప్పొంగగా, జ్ఞానస్నాన స్వీకృతి చేసి, ఆయన శాంతి సైన్యంలో వీరులుగా చేరడానికి, వారందరూ మహోత్సాహంతో ముందరికి వచ్చారు. ఎక్కడ చూచినా దేవాలయాలు వెలిసినై. ఐర్లాండు దేశమంతా జేసునాథునికి చాగిల పడింది.

మిట్ట మధ్యాహ్నంనాటి సూర్యునివలె ధగద్ధగాయమానంగా మెరసిపోయే ఖడ్గాలతో ఐరిష్‌జాతి తమ చుట్టు ప్రక్కలజాతులన్నింటినీ

నిర్భయంగా ఎదుర్కొని సార్వభౌమత్వాన్ని స్వీకరించగల శక్తి సామర్థ్యాలు కలదానిగా అతను కనుగొన్నాడు.

జేసునాథుని పతాకచ్ఛాయల్లో, నిర్భయంగా పోరాడే వీర యోధులుగల జాతిగా వారిని వదలిపెట్టాడు. సెంట్ పాట్రిక్, ప్రసాదించిన పరమ పవిత్రమైన క్రైస్తవ విశ్వాసాన్ని తక్కిన జాతుల్లోగూడా సర్వవ్యాప్తం చేయడానికి, అత్యుత్సాహంతో ముందంజవేసిన యోధాన యోధులు వారు.

ఆ రోజుల్లో దేవాలయాలు నామ రూపాలు లేకుండా, సర్వ నాశనమై పోయే పరిస్థితుల్లో ఉన్నై. వాటిని రక్షించడానికి శపథం పట్టిన మహామహులంతా శక్తి విహీనులై అనుక్షణం పరాజయాన్ని శంకిస్తున్నారు. తూర్పు, ఉత్తరం, దక్షిణం మూడు దిశల్లో శత్రువు లా దేశాన్ని ముట్టడించారు 'గోత్'లు 'హూన్'లు ఒక మహా సముద్రం పొంగివచ్చినట్లుగా ఐరోపానంతా ముంచివేస్తూ రోమ్‌నగర ప్రాకారాన్ని విధివిరామం లేకుండా, ఢీకొన్నారు. అంత బలసంపదలూ, శక్తి సామర్థ్యాలు గల జ్ఞాన విహీనమైన రోము ఆ మహా సముద్ర తరంగాల్లో లీనమైపోయింది. కాని, ప్రపంచాన్నంతా ముంచెత్తిన ఆ మహా సముద్ర భీకర తరంగాలకు చలించకుండా, చెక్కుచెదరకుండా, జేసునాథుని నివాసస్థానమైన కతోలిక్ రోము మాత్రం ధైర్యంగా నిలబడింది.

ఆ రోమునగరాన్ని కాపాడ్డానికి సహాయంగా పశ్చిమ దిశనున్న ద్వీపంనుండి ఐరిష్‌యోధుల రెండవదళం మహావేగంతో పోయి, యుద్ధ భూమిలో, అగ్రగామిగా నిలచింది.

ఉద్ధృతంగా ప్రవహించే ఒక మహాప్రవాహంవలె వచ్చి, జేసునాథునియందు తమకు గల అచంచల విశ్వాసంతో శత్రు సైన్యాల్ని ఎదిరించింది.

ఇతరుల కసాధ్యమైన ధైర్యసాహసాల్తో, మహారణ్యాల్ని సైతం, ఒక్క ఊపు ఊపి శత్రుసైన్యాలకు సింహస్వప్నంగా వీరోచితంగా పోరాడిన ఆ ఐరిష్‌సైన్యం, అఖండమైన మహాయోధసమూహంతో కూడుకున్న తమవంటి మరో ఐరిష్‌సైన్యాన్ని ఆహ్వానించి కదనరంగానికి ప్రోత్సహిస్తుందని ఎవరనుకున్నారు ? జేసునాథుని ఆహ్వానానికి నడుంగట్టి ముందుకుదూకి, తమ ఇండ్లూ వాకిళ్లుగూడా తృణప్రాయంగా

వదలి మహాగ్నిజ్వాలలవలె చెలరేగి శత్రుసమూహాన్ని జేసునాధునికి దాసానుదాసులుగా చేయగలిగారు. 'గోత్' 'హూన్' లలో కరడు కట్టుకొనిపోయిన కిరాతత్వాన్ని మాయంచేసి, వాళ్ళ హృదయాలు కరుణారసపూరితాలుగా చేసి, జేసునాధుని సూక్తిబీజాలు వాళ్ళహృదయక్షేత్రాల్లో నాటి, నాగరికతా వృక్షాన్ని మొలిపించగలిగారు.

కృతజ్ఞత, ఐరిష్‌జాతి ప్రధానలక్షణం. అందుకనే వారు రోము నగరములో, సెయింట్ పీటరుచుట్టూ బారులుతీర్చి, బ్రహ్మాండమైన ఊరేగింపు చేసారు. ఐరిష్‌భూమిపై మరోమతం అంకురించలేదు. సెయింట్ పీటరు సింహాసనంపై అధిష్టించి భూలోకంలో జేసుస్వామి ప్రతినిధిగాఉన్న ఆయనకు ఐరిష్‌జాతి సర్వదా వినయవిధేయతలు ప్రదర్శిస్తూనే ఉన్నది. "నీకు జేసునాధుడు కావాలంటావా! రోము నాశ్రయించు" అన్న సెయింట్ పాట్రిక్ సుభాషితం, ఐర్లాండు మరచిపోలేదు.

"అసంఖ్యాకంగా, ఐరిషీయులు, జేసునాధుని పవిత్రసూక్తుల్ని ప్రచారంచేసుకుంటూ, భక్తిప్రపూరిత హృదయులై అనుదినం బ్రిటనుకు వస్తున్నారు." అని 'వెనెరబుల్ బీడ్' నొక్కి చెప్పాడు. "కష్టతరంగాల్ని ఈదుకుంటూ, క్రూర నక్ర తిమి తిమింగలాది జతుసంతానాన్ని నిరోధిస్తూ, అపాయ మహాసముద్రాన్ని దాటి మనతీరాలకు సురక్షితంగా చేరుతున్న ఐరిష్‌వైదాంతికుల ఘనవిజయాన్ని గూర్చి నేనేమని చెప్పగలను?" అని 'ఆక్జెర్ ఎరిక్' ఫ్రాన్సునుండి వ్రాస్తున్నాడు.

"ఐర్లాండునుండి పొంగి వరదలై ప్రవహించే ఒక మహాప్రవాహంవలె, ప్రతివ్యక్తులు, వేనవేలుగా, విదేశాలపైకి అవతరిస్తున్నారు" అని సెయింటు బెర్నార్డు వ్రాస్తున్నారు. ఈ మహాప్రవాహం తూర్పున ఈజిప్టువరకూ, పశ్చిమాన 'గ్రీన్‌లాండ్' 'లబ్రడార్' వరకూ పరుగులుతీసింది.

ఐరిష్ ప్రప్రథమ దేశనిర్గమము అట్టిది. శతాబ్దాలు గతించిపోయినై. జేసుస్వామి ఐరిషీయులకు అగ్నిపరీక్షపెట్టారు. రెండవసారి దేశత్యాగం ప్రారంభమైంది. ఈ సారి దేశత్యాగం తీవ్రమైంది. ఐరిషీయులు తలదాచుకుంటానికి ప్రపంచం మూలమూలలకూ పరుగెత్తారు.

జేసునాధునిలో అచంచలమైన విశ్వాసం, భక్తి, వినయం కలిగివుండడం, తమ ప్రభువుపై గాఢానురాగం కలిగిఉండటం, తమసేతకు

కృతజ్ఞులైఉండటం, వారికి విరోధం కొనితెచ్చిపెట్టినై. అందుకనే మళ్లీ దేశత్యాగం లభించింది. అనాదిగా, సెయింట్ పాట్రిక్ కాలమునుండి ఏమాత్రం తగ్గిపోకుండా క్రమ క్రమాభివృద్ధిగా వస్తున్న దైవవిశ్వాసాన్ని వదలిపెట్టకుండా అంటిపెట్టుకున్న కారణాన ఆయన దివ్యసూక్తి రత్నాన్ని తమ హృదయాల్లో గాఢంగా హత్తుకునేటట్లు చేసుకోవడం వల్ల 'ఎరిన్' నగరం తన పసిబిడ్డల రక్తధారల్లో స్నానమాడింది. తన కండ్లయెదుటనే తన సంతానం ముక్కలు ముక్కలుగా తరిగివేయబడడం చూచింది. వాళ్లు తమ దైవవిశ్వాసానికి స్వస్తిచెప్పడానికి నిరాకరించినందువల్ల, సముద్రం అన్నివైపులనుండి మృత్యువు భీకరాకారంతో, కండ్లవెంబడి నిప్పులుగ్రక్కుతూ వేయికరాలు చాచుకొని, సహస్ర ముఖాల్తో, సర్వనాశనం చేస్తానంటూ, ఐర్లండుపైకి పరవళ్ళుత్రొక్కింది. వాళ్ళు జేసునాధుని శరణువేడి, మృత్యువును చూచి పరిహాసా సూచకమైన ఒక చిరునవ్వునవ్వి ఊరుకున్నారు. ఐర్లండ్ దేశంపైకి కత్తులు, కటార్లు దూకినై. అగ్నిజ్వాలలు సహస్ర ముఖాలుగా ప్రజ్వరిల్లినై. ఐరిషీయులరక్తం వరదలై పారింది. కానీ ఇంత భీభత్సంలోను, పర్వతపులోయల్లో, ఒంటరిగా పూజబలి ఘంటారావంమాత్రం నిరంతరం దిశదిశలా ప్రతిధ్వనించింది. వెలుగునీడల్లో, జ్ఞానోపదేశ సంగ్రహ పుస్తకం నిరాఘాటంగా అధ్యయనం చేయబడింది.

మశూచి, క్షామం, ఐర్లాండ్ దేశంలో విలయతాండవం చేసినై. వాటి నీలిఛాయల్లో భయవిహ్వలమై ప్రజానీకం దేశాంతరగతమైంది.

బాధా సర్పదష్టమైనజాతికి, ఈ దేశత్యాగం అనన్యమైనప్రచారంగా ఉపకరించింది.

మశూచి క్రూరదృక్కుల్లో, అట్లాంటిక్ సముద్రంగుండా ప్రయాణించిన ఓడలు, నూతనప్రపంచతీరాల్లో తమ మరణించిన; మరణోన్ముఖమైన, ప్రజాసమూహాన్ని దించినవెంటనే, ఫ్రాన్సుదేశానికి వన్నెపెట్టిన, విశాలహృదయంగల కెనడా, పరుగెత్తి వారందరినీ తన హృదయానికిగాఢంగా హత్తుకొన్నది. కెనడా ఎంతో జాగ్రత్తగావారిని కాపాడినా, ఐరిష్ప్రజలు లక్షోపలక్షలుగా మరణించారు. తల్లిదండ్రులు లేని అనాథులైన ఐరిష్ సంతానాన్ని, కెనడా, రెండవ మాతృదేవిగా సంరక్షించింది. కెనడా దేశంలోని ఒక నగరంలోని దేవాలయంలో ఆదివారపు పూజబలి సమయములో నేనుచూచిన హృదయాన్ని కరి

గించివేసేఒకానొక సంఘటన, కెనడాయొక్క ఉదారమైనబుద్ధికి, సాక్షీభూతాలైన అనేక సంఘటనల్లో ఒకటిమాత్రమే. ఫ్రెంచిమతబోధకుడు, చేతుల్లో ఒకపసిబిడ్డనుపెట్టుకొని, ఇరువై నలుగురుచిన్నపిల్లలు, తన్ననుసరిస్తూ వస్తుండగా, దేవాలయంలోకివచ్చి, దైవపీఠం దగ్గరనిల్చున్నాడు. పిల్లలు దిగ్భ్రమచెంది నుంచున్నారు. "సోదరులారా! ఈ పసికూనల్ని చూడండి. వీరు మన ఐరిష్‌కతోలిక్కుల అనాథ శిశువులు! దేవుని పేరుతో వీరిని రక్షించగలవారెవరు?" అని అతడు తన మాతృభాషలో అక్కడమూగినవారిని ఉద్దేశించి పలికాడో, లేదో, వెంటనే, పూజను చూచేవారల కరుణార్ద్రములైన వేయి హస్తాలు ఒక్కసారిగా వారిని ఎత్తుకొని, గాఢానురాగంతో హృదయాలకు హత్తుకొని తమవిగా చేసుకొన్నై.

కెనడా కతోలిక్కు గృహాలల్లో అనాధశిశువులుగాఉండి, పెంచబడిన ఐరిషీయులే, నేడు చాలమంది అమెరికాలోనినాయకులు. వాళ్లు బ్రహ్మాండంగా అభివృద్ధిచెందారు. వాళ్లు తాము కెనడాకు ఋణపడియున్నామన్న విషయం లేశంకూడా విస్మరించలేదు. కొద్ది సంవత్సరాలక్రితమే, వారంతా ఏకమై, తమకు కెనడాయందుగల కృతజ్ఞతకు నిదర్శనంగా, తమ జాత్యభ్యుదయ సూచకంగా ఒక కట్టడాన్ని నిర్మించారు.

ఈనాడు సెయింట్ లారెన్సువరకుపోయిన ప్రతి బాటసారి తన ఎదుట గ్రాసీద్వీపంలోఉన్న ఆ కట్టడాన్ని, దర్శించకల్గుతాడు. కట్టె స్లీవపై, బ్రహ్మాండంగా మలచబడిన జేసునాధునిస్వరూపం, తనపాద సమీపంలోఉన్న దేశాంతరగతులైన 12,000 మంది ఐరిష్‌ప్రజల సమాధులపై, దీనంగా చూస్తున్నట్లు, నిర్మించిన కట్టడం అది. కెనడా గంగిరేగు చెట్లక్రిందగాని, ఆఫ్రికా తాటిచెట్ల క్రిందగాని, ప్రపంచం చిట్టచివరనున్న ఆస్ట్రేలియా వృక్షచ్ఛాయల్లోగాని, న్యూజిలాండులోగాని, లేక ప్రపంచం మారుమూలల్లోగాని దేశత్యాగం చేసిన ఐరిషీయులు, ఎక్కడదీర్ఘనిద్రతీస్తున్నా, స్వాతంత్ర్యప్రదాత, న్యాయాధికారియైన తమ జేసుస్వామికోసమై నిర్మించుకొన్న, ఆ కట్టడములలో జరుగు పూజబలుల ఘంటారావం ప్రతిశబ్దిస్తుంది.

ఇంటికి దగ్గరా, దూరమా అన్నది కాదు. ఎక్కడున్నా అన్నివేళల స్లీవసందేశం వారిని అంటిపెట్టుకొనే ఉంటుంది. క్షామం ధాటికి తట్టుకోలేక పరుగెత్తుకొనివస్తూ ఇంగ్లండు దక్షిణ తీరాన్న ఓడ బద్ధలై,

చావుతప్పి, కన్నులొట్టబోయిన సామెతగా బ్రతికి బైటపడ్డ ఒక ఐరిష్ మహిళాహృదయంలో ప్రజ్వలించిన సందేశ మిదే.

ఆమె, అక్కడ ఒక భూస్వామికుటుంబానికి చాకలి పని చేయ డానికి కుదిరింది. ఆమె నెలకోసారి శనివారం సాయంకాలం తను ఉంటున్నగది విడిచివెళ్లి, సోమవారం ఉదయం బారెడు ప్రొద్దెక్కే టప్పటికి తిరిగి వస్తూండడం వాళ్లు గమనించారు. ఒక రోజామెను ఈ సంగతి చెప్పమని అడిగారు. తక్కినవాటికన్నా సమీపంలో ఒక ముప్పైమైళ్ళదూరంలో ఉన్న దేవాలయానికి పూజబలిని చూడ బోయి వస్తున్నానని ఆమె సమాధానం చెప్పింది. ఆ యింటియజమాని ఇద్దరు సోదరీమణులు, ఈ రోమన్ కతోలిక స్త్రీని వెంటనే పనినుండి తొలగించివేయాల్సిందని పట్టుపట్టారు. "అట్లాకాదు. వీలులేదు. మీరు చదువుకొన్న స్త్రీలు, పాపం ఆమె అన్నెం పున్నెం తెలియని అమాయ కురాలైన ఐరిష్‌వనిత. పోయి మీ రామె మనసు మార్చండి" అని ఆయన వారికి నిక్కచ్చిగా సమాధానం చెప్పాడు.

ఆమెను మతాంతరురాలుగా చేయటానికి పుస్తకాలు చదవ మనడం ద్వారా, వినయంగా బోధించడం ద్వారా, ఆమెపై దండ యాత్ర సాగించారు. విశ్వ ప్రయత్నం చేసారు. ఆ దండయాత్ర పట్టు దలతో, దీర్ఘకాలం సాగించారు. కానీ, ఆ ఐరిష్‌వనిత విమర్శల్నీ, విమర్శనలతో, దురభిప్రాయాల్నీ, సదభిప్రాయాల్తో, ఎదుర్కొన్నది. వాళ్ళిచ్చిన పుస్తకాల అట్టలుగూడా చూడకుండా, చేతికి తీసుకొన్నవి తీసుకొన్నట్లుగా అలమర పైభాగంమీద దొంతర్లుపేర్చింది. తన మంచి కోసం తంటాలుపడుతున్న తన అధికారిణులకు వెలుగును ప్రసాదించ వలసిందిగా దేవుని ప్రార్థిస్తూ వచ్చింది. ఆఖరికి వాళ్ళిద్దరుకూడ రోమన్ కతోలిక్కులయ్యారు. పూజబలికోసం ఇంచుమించుగా ముప్పైమైళ్ళ దూరం దేవాలయానికి వెళ్ళివస్తున్న ఆ ఐరిష్‌వనితలోని కార్యదీక్ష, కష్ట సహనాన్నీ చూచి, ఆ యజమాని దిగ్భ్రమజెందాడు. ఇటువంటి ఆత్మత్యాగాన్ని ప్రబోధించిన ఆ మతగ్రంథాలన్నీ పట్టుదలతో ఆమూ లాగ్రం చదివాడు. అతడూ, అతని సంసారంలోని యావన్మందీ కతో లిక్కులుగా మారారు. అతని పెద్దకుమారుడు జేసుసభలో తత్త్వవిచా రకుడుగా మహాప్రసిద్ధి పొందాడు. ఈ నాడు వాళ్లనివాస గృహానికి ఎదురుగావున్న పచ్చికబయల్లో, ఇంతకుముందెన్నడూలేని, మూడు దేవాలయగోపురాలు చూడగలుగుతాం.

ఈ రోమన్ కతోలిక్కు ప్రభావ వ్యాపకత్వానికి దూరంతో నిమిత్తంలేదు. న్యూజిలాండులో ప్రథమంగా నివాసాన్ని ఏర్పరచుకొన్న కతోలిక్కువ్యక్తి భార్య 'వెక్స్‌ఫోర్డు' యువతి. ఆమెకు మొదటి బిడ్డ కలిగింది. ఆ బిడ్డకు జ్ఞానస్నానం ఇప్పించడానికి అతి సమీపములో ఉన్న దేవాలయానికి, ఆమె నివాసస్థానానికి, సుమారు వేయిమైళ్లు పైచిలుకుగా, మహాభయంకరమైన తుఫానుల్తో సంక్షుభితమై, ఘోషపెట్టేసముద్రం, ఉత్తుంగ తరంగాల్తో వ్యాపించి ఉంది. ఆ యువతి ఏ మాత్రం వెనుకాడకుండా, ఒక చిన్నఓడలో తనబిడ్డను తీసుకొని 'ఆక్లండ్' నుండి 'సిడ్నీ'కి జ్ఞానస్నానం ఇప్పించడానికి ప్రయాణం సాగించింది.

ఔరా! ఐర్లండు దేశ త్యాగంవల్ల ఎంత దురంత దుఃఖం ప్రాప్తించినదో ఎవరు సాహసించి మాటలలో చెప్పగలరు!

"నీవు పవిత్రమైన ఇంగ్లండునుగూర్చి వ్రాస్తున్నావు కదా? నీవు నీ కలాన్ని గుండెల్లో ముంచి వ్రాయవూ?" అని నిన్న నా కొక సందేశం వచ్చింది. జేసునాథుని పవిత్ర హృదయం మినహా, ఇంక ఏ హృదయం కూడా శతాబ్దాలతరబడి ఐర్లండనుభవిస్తున్న కష్ట పరంపరల్ని సరిగా అర్థం చేసుకోలేదు. మనం ఐర్లండు కష్టాల్ని ప్రత్యేక వ్యక్తులద్వారా గ్రహించవచ్చు. కాని, వ్యక్తుల కష్టాలు, ఒక గంభీరమైన సముద్రములో లేచే చిన్న చిన్న అలలవంటివే! ఆ అలల చాటున మన కందని లోతులు లేవు.

పడమటి ఐర్లండులో, ఒకరోజు ఉదయం, రైలుస్టేషనులో రైలుకోసం వేచివున్నా. అమెరికన్ బోటు మెయిలు వచ్చేవేళయింది. ప్లాట్‌ఫారంమీద ఉన్న ఒక గుంపు నన్నాకర్షించింది. తన మాతృ దేశాన్ని వదలిపెట్టి పోతున్న ఒక ఇరవై సంవత్సరాల యువతి, ఆ ప్లాట్‌ఫారం మీద తన సామాను ప్రక్కనే నిలబడివుంది. ఆమె చుట్టూ ఆమె తల్లి, తండ్రి, ఇద్దరు సోదరులూ నిలబడివున్నారు. వారామెకు వీడ్కోలివ్వడానికి బరువు గుండెల్తో రైలుకోసము యెదురు చూస్తున్నారు. ఆమె ఏమాత్రం తన దుఃఖాన్నిగాని, కష్టాన్నిగాని పైకి పొంగి రానీయకుండా అణచిపెట్టుకోని, ఒక్కొక్కళ్ళతో బలే చలాకిగా మాట్లాడుతున్నది.

ఇంతలోకే స్టేషన్‌లోకి వస్తున్న రైలింజను కూత వినపడింది. పాపం! ఆ యువతి ధైర్యం చిక్కబట్టలేక, బావురుమని ఏడుస్తూ, తన

తల్లి చేతుల్లోకి వ్రాలిపోయింది. ఆ తల్లి ఆమెను గుండెకు గాఢంగా హత్తుకొంది. ఆమె ఇద్దరుసోదరులూ చకచక సామానంతా రైల్లోకిఎక్కించి గుండెకు హత్తుకుపోయి, తమ మాతృ హస్తాలల్లో బంధింపబడ్డ సోదరిని ఎట్లాగో విడిపించి, రైలెక్కించారు. ఆమె కన్నీరు మున్నీరుగా ఏడుస్తు ఎక్కలేక ఎక్కలేక ఎట్లాగో రైలెక్కింది, ఆమెతల్లి దుఃఖం ఆపబట్టలేక, దగ్గరలోవున్న ఒక బల్లమీాదకు పోయి, చేతుల్లో తలపెట్టుకొని వెక్కివెక్కి ఏడవడం మొదలుపెట్టింది.

అక్కడివాళ్ళందర్లోకి పాపం ఆ యువతి తండ్రిని చూస్తే హృదయం కరిగిపోయేటట్టుగా ఉంది. ఆ యువతి తన ఇద్దరు సోదర్లకు వీడ్కోలిస్తూంటే, ఆయన గంభీరంగానే ఉన్నాడు. ఆమె, తన మెడచుట్టూ చేతులు పెనవేసినప్పుడూ, చిరునవ్వు మొగంతోనే ఉన్నాడు. "నీవెక్కడుంటే అక్కడ నీకు తోడునీడలై, జేసుస్వామి, మరియమాతా నిన్ను కాపాడుతారు!" అని ఆమెకు హృదయపూర్వకమైన ఆశీస్సులు పలికేటప్పుడుగూడా ఏమాత్రం తడబడలేదు. కానీ, తన కుమార్తెనుతీసికొని ఆ రైలు ప్రయాణమైపోతుంటే, ఆమెకు చివరివీడ్కోలు చెప్పేటప్పుడు ఆయనమొగం వివర్ణమైపోయింది. ఇంతవరకూ, అతనిగుండెను పీల్చిపిప్పిచేస్తున్న దుఃఖం, అమాంతంగా పొంగి పొర్లి బైటకుపారింది. అతడు రైలు వెంట పరుగెత్తుకు పోదా మనుకున్నాడు. కాని అమాంతంగా ఆగిపోయాడు. అక్కణ్ణె మోకరించి, చేతులుపైకెత్తి, బిగ్గరగా, దీనంగా దైవాన్ని ప్రార్థించాడు. ఒక్కసారిగా అతనిమీాద జాలిచూపులు ప్రసరించినై. దుఃఖభారానికిక్రుంగి కుప్పకూలిన ఆ మాతృమూర్తి- ఆమెకు దగ్గరగా కొయ్యబారి నిలబడ్డ ఆ ఇద్దరు సోదరులూ—ఆ గచ్చు నేలపై మోకరించి, చేతులు పైకెత్తి ఆపుకోలేని దుఃఖంతో దీనంగా దైవాన్ని వేడుకొంటున్న ఆ పితృమూర్తి - క్షణికమైనా—ఈ సంఘటన నా స్మృతిపథంలో జ్వాజ్వల్యమానంగా ప్రకాశించింది.

ఈ దృశ్యాన్ని పదివేలరెట్లుచేసి ఊహించు. దైవవిశ్వాసం గల ఐరిషీయుల గృహాలపై తారాడే విషాదచ్ఛాయల స్వరూపంలో సహస్రాంశం మాత్రమే నీకు బోధపడుతుంది.

కొన్ని సంవత్సరాల తర్వాత నేను అమెరికా ఐర్లండు మధ్యనున్న సముద్రంమీాద ప్రయాణం సాగించా. ఆ ఓడమీాద ఎనిమిది వందల మంది 'ఎరిన్' స్త్రీ పురుషులున్నారు. మేం ఓడమీాద పశ్చిమ

దిశకు ప్రయాణం చేస్తున్నాం. ప్రతిరోజూ ఉదయం పూజబలి సాగుతూనే ఉంది. మా ప్రయాణం అంతమయ్యేటప్పటికి, ఆ ఓడలో ఉన్న ప్రతివ్యక్తికి జేసునాథుని దివ్యసత్ప్రసాదమూలంగాస్వీకరించే అవకాశం లభించింది. ఓడమీాదఉన్న ప్రతివ్యక్తికీ అతనిదైవం అతనితోనే ఉన్నాడు. క్రింద మహావేగంతో తిరుగుతూన్న యంత్రములవల్ల కలిగేధ్వని, పైన మోకరించి దైవ స్తోత్రాలు చెల్లించే ప్రతి వ్యక్తి హృదయంలో ప్రతి ధ్వనించి,విషాదపూరితుణ్ణిగా చేస్తున్నది. ఆ యంత్రం పనిచేస్తున్నకొద్దీ, ప్రతివ్యక్తీ తన మాతృదేశంనుంచి దూరదూరంగా వెళ్ళిపోతున్నాడన్న మాట. కాని వినమితగాత్రుడై అతడు తన దైవానికి భక్తి స్తోత్రాలు చెల్లిస్తేసరి, అతడిలో వున్న విషాదం మటుమాయమై పోతుంది. ఒక నూతనోత్తేజం అతడిలో కాపురం చేస్తుంది.

డొంక తిరుగుళ్లన్నీ తిరుగుతూ, నానా యాతనలు పడుతూ, ప్రపంచంలోకల్లా పెద్ద సందడిగల 'న్యూయార్కు' రేవు పట్టణాన్ని చేరుకుంటానికి మేం వస్తున్నప్పుడు, తన సర్వస్వం దాచుకొన్న పెట్టె మీాద కూచోని ఏడుస్తున్న ఒక స్త్రీ మూర్తినిచూచా. జనసమ్మర్ధంచేత అల్లకల్లోలమై, మహాఘోషపెట్టే ఆ పట్టణాన్ని చూచేటప్పటికి ఆమె కెక్కడలేని పెద్దభయంపుట్టి. ఆ భయంతోనే కుంగిపోయింది.

రెండురోజుల తర్వాత. ఆ పట్టణంలోనే, ఒక దేవాలయానికి నేను పోయినా. అక్కడ కిటకటాలవెంబడిగా మోకరించి దైవప్రార్థనలుచేస్తూ, ఆనాడు ఓడలో భయపడి యేడ్చిన వ్యక్తి నాకు కనపడ్డది.

"ఇప్పుడు నీగుండె కుదటపడ్డదా?" అని ఆమె నడిగా.

జేసువైపు చూపిస్తూ,"ఔనుస్వామి! మనదైవం ఇక్కడున్నాడు' నేను ఆయనతో మాట్లాడుతాను. అందుకనే నాకు ఒంటరితనమంటూ ఏమీాలేదు." అని ఆమె సమాధానం చెప్పింది.

కెల్టిక్ ప్రేమకు సముద్రాలు, వనాలు, పర్వతాలు అడ్డురావు. రాలేవు. ఆ ప్రేమతోనే వారు బ్రహ్మాండమైన వంతెనను నిర్మించి దిగంతాలవరకూ నిరాఘాటంగా ప్రయాణాలు చేసారు. పూజబలి ఘంటారావంలో వారి పవిత్ర ప్రేమసూత్రా లన్నింటినీ మేళవించి, దశదిశలా ప్రతిధ్వనించేటట్లుగా మధుర మధురంగా గానం చేసారు.

---

ఐదవ అధ్యాయము.

# వ్రూజపీఠము

శతాబ్దములు గడిచిపోయినకొలది చాలా మంది ఐర్లెండు బిడ్డలు విజయముగాంచిన సత్యసభ సైన్యములో చేర్చబడినారు. ఆశ్చర్యకరవిషయమేమన, అర్చ్యు॥ పాట్రిక్కువారు మరణమునకు తర్వాత పన్నెండువందల సంవత్సరాలలో అర్చ్యశిష్టుల సైన్యములో నొకభాగమైన వేదసాక్షుల దళములో ఐరిషువారిలో నొక్కరైనను మచ్చునకుగూడ గానరారు! ఐరిషు అర్చ్యశిష్టుల పట్టికలో అపోస్తులు, మేత్రాణులు, విశ్వాస వ్యాపకులు, కన్యకలు అసంఖ్యాకులై యున్నను, మోక్షానందనిలయమున అర్చ్య॥ పాట్రిక్కువారిని చుట్టు ముట్టియుండు పావనచరితులలో ఇన్ని సంవత్సరాలలోగూడ ఒక్క వేదసాక్షియైనను కానరారు.

దీనికి కారణం చాలాసులభమైందే ఐర్లండు, సెయింట్ పాట్రిక్ ఇచ్చిన అమూల్యమైన కానుకను హృదయ పూర్వకంగా స్వీకరించి, సంవత్సరాల తరబడిగా, ప్రేమాస్పదమైన త్యాగశీలంతో, దాన్ని చెక్కుచెదరకుండా రక్షించుకొంటూ వస్తున్నది. భిన్నభిన్న దృక్పథాలుగల వ్యక్తులందరినీ తనవైపు ఆకర్షించుకొనగల శక్తితో ఐర్లండు తన సరిహద్దులలో నివాస మేర్పరచుకొన్న ప్రతివ్యక్తి హృదయంలో ఆ దృఢవిశ్వాస బీజాల్ని నాటింది. "తనమీదికి కత్తిగట్టి వచ్చినవాళ్ళను వాళ్ళెన్నడూ కలలోగూడా ఊహించడానికి వీల్లేనంతగా ఆశ్చర్య నిమగ్నులుగాచేసి, తనలో, తన ప్రేమహృదయంలో విలీనంచేసుకొగల ఒక మహాద్భుత శక్తి ఐరిష్ కెల్టులకుంది. ప్రపంచంలో మరెవ్వరికీ ఇటువంటి శక్తిలేదు. సరళత్వం, సున్నితమైన హాస్యం, భావనా శక్తి, ఆర్ద్రత, పెద్ద విషయాలు మొదలుకొని చిన్న విషయాల వరకూ గల సుముఖత్వం, దేశభక్తి, మతవిశ్వాసం, ధైర్యం, సాహసం, అచంచలమైనదీక్ష, వినయం, విధేయత, గాఢానురాగం మొదలైన సద్గుణ రత్నాకరులు వారు". అని "ఫ్రౌడీ"వాళ్ళను ప్రశంసించాడు.

ఐరిషీయులు అత్యాసక్తితో దైవ సంబంధమైన ఈ కానుకను తమదిగా చేసుకొన్నారు. వాళ్ళెవళ్ళకైతే దీన్ని అందుకోమని చేయి

చాచి ఇచ్చారో, వాళ్ళంతా కిక్కురు మనకుండా హృదయపూర్వకంగా, ప్రేమతో స్వీకరించేటట్టుగా, దాని దైవానుభవాల్ని, వాళ్ళు ప్రత్యక్షీకరించగల్గారు. దేవుడు వేదహింస తాండవించునట్లు సెలవిచ్చునంతవరకు దేవాలయాలు శతాబ్దాల తరబడి ప్రశాంత వాతావరణంలో ప్రబలినవి.

సెయింట్ పాట్రిక్ సారథియైన 'ఓడ్రన్' తప్ప ఆనాటివరకూ ఐర్లండు సంతానంలో వేదసాక్షియైనవారు మరొక్కరు లేరు. దహన బలిగా సమర్పింపబడిన జాతిగా, ఐర్లండు దేవుని యెదుట సంసిద్ధురాలైంది. ప్రశాంత వాతావరణంలో ప్రతిష్ఠించబడ్డ దేవాలయాలు, ఒకప్పుడు త్యాగమహిమలతో బలవత్తరంగా నిలబడి, మతం కోసం చంపబడ్డ త్యాగమూర్తుల పవిత్ర రక్తధారాంకితాలై, చెల్లాచెదరైన దైవపీఠాల్తో, భిన్నాభిన్నాలై పోవలసిన సమయ మాసన్నమైంది

భయంకర హింసాపిశాచి, ఐర్లండుపై గజ్జకట్టి, కవ్వించి, నాశనానికి కదను త్రొక్కింది. ప్రాణ త్యాగాలవల్ల, సత్యం ఘన విజయం పొందుతున్న దాని కది తార్కాణంగా నిలచింది. అజ్ఞానం హింసించని చోట, వేద మత భ్రష్టులు హింసించడానికి పూనుకొన్నారు. తిరుసభ పదియను శతాబ్దిలో వేద హింసలకు గురియై ప్రాణ రక్షణార్థం, భూగర్భ సొరంగములో ప్రవేశించి వేదకార్యములను నెరవేర్చుకొంటూ అభివృద్ధిచెందినది. ఆమె కొరడా దెబ్బలు తిని శరీరము హూనా హూనమై పోతున్నకొద్దీ, బాధా సహనత్వం నేర్చుకొని బలపడింది. ప్రచండవాయువేగానికి భూమిలో లోతుగా వ్రేళ్ళు నిలద్రొక్కుకొని, తన వసుంధరామాతను గాఢంగా ఆలింగనం చేసుకొనే 'ఓక్' చెట్టుమాదిరిగా, ఐర్లండు విద్వేషక శాఘాత జర్జరశరీర ఐనప్పటికీ, హృదయానికి ప్రశాంతిని చేకూర్చే దైవానికి ఇంకా సన్నిహితంగా నిలబడింది. శిశిరతువునందు కొమ్మలువిరిగి, ఆకులురాలి, మోడై, వసంతకాలంలో చిగుర్లుతొడగి, పచ్చపచ్చగా ప్రకాశించి, బ్రహ్మాండంగా పునర్విజృంభించే వృక్షరాజం మాదిరిగా, ఐర్లండు మృత్యువనే చలికాలపు నీలిచ్ఛాయల్లో అణగారి తన ప్రజల పవిత్ర రక్తధారల్లో పూతమై, మహోజ్వలంగా ఎక్కువబలంతో మళ్ళీ నిలబడింది.

దానిమీద పెను తుఫాను చిరకాలం భయంకరంగా విజృంభించింది. కాని, జీవిత త్యాగధనులైన ఐరిషీయుల ధైర్య సాహసాలు దాన్నెదుర్కోంటానికి వేయిరెట్లుగా విజృంభించినై. తుఫాను అణగారిపోయింది. తుదకు సహనం, శాంతి రాజ్యమేలినై. మానవాతీతమైన ఐర్లండు ధృఢదీక్ష, దాన్ని ఇంతగా బాధించిన దేశానికి తలవంపులు తెచ్చిపెట్టింది. దురూహా శృంగి, కృశించి, నశించింది.

మూఢత్వంవలన ఏర్పడిన అభిప్రాయ భేదాలనే చీకట్లు మటుమాయ మయ్యేంతగా సత్యజ్యోతి మహోజ్జ్వలంగా ప్రకాశించినది. తదనుగుణంగానే హృదయసమైక్యతకు మార్గమంటూ ఒకటి ఏర్పడినది. ఐర్లండులోని మంచితనాన్ని దైవవిశ్వాసంలో గల బలాన్ని, మానవాతీతమైన తత్వాన్ని, ఒకటొకటిగా సద్గుణాలన్నింటినీ పుంజుకొంటున్నది. దైవ విశ్వాసం, నైతిక మార్గాసక్తి, మతాభిమానం, మొదలైనవి ఇంగ్లండుకు సహజంగా ఉన్నవే. అందుకే, అది ఐర్లండును గుర్తించి, దాని ఆదర్శాలను సర్వదా అంగీకరిస్తున్నది. ఐరిషీయుల్లోని అచంచల దీక్షకు, ఇంగ్లండు విస్తుపోయింది. ఎన్ని కష్టాలువచ్చినా తలవంచకుండా, తనకున్న దైవ విశ్వాసాన్నెమాత్రం సడలిపోనీకుండా, ఐర్లండు జేసునాథునికి సన్నిహితంగా నిలబడడం, ఇంగ్లండును చకితం చేసి వేసింది. అందుకనే, తాను చిరకాలం తృణీకార భావంతో చూచిన ఐర్లండును, ఇంగ్లండు ఈనాడు హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నది. ఇదివరకు తాను పోగొట్టుకొన్న 'మేరీకానుక' అనే బిరుదును నేడు మళ్లీ, ఐర్లండు సహాయసంపత్తితో, సంపాదించుకోడానికి తంటాలు పడుతున్నది. ఐర్లండు అచంచలధైర్య సాహసాలే, ఆమెకింతటి ప్రతిష్టను సంపాదించి పెట్టినై. ఐర్లండుజాతిని సర్వనాశనం చేయడానికి వీలైనన్ని విరుద్ధచట్టాలు సృష్టించారు. ఐరిషీయు లసలు బ్రతకక్కాడదన్నారు. వారు చచ్చిపోతూ తమ సంతానాన్ని మరోమతస్తుల కప్పగించాలన్నారు. ఉపాధ్యాయుణ్ణి, గురువునూ, మృగాన్ని వేటాడినట్లు వేటాడారు. వాళ్ళకు సంఘంలో ఏమాత్రం స్థానం లేదన్నారు. ఒకటా! రెండా! లెక్కలేనన్ని యిబ్బందులుపెట్టారు. ఐరిష్ జాతిని నామరూపాలు లేకుండా చేయాలని లక్షోపలక్షలు వ్యూహాలు పన్నారు. ఐతేనేం! ఐరిష్‌జాతి చలించలేదు. తమ మాతృదేశ గౌరవాన్ని, దైవ విశ్వాసంలోగల గౌరవాన్ని, దృఢదీక్షా పరాయణులైన ఐరిషీయులు కాపాడారు.

ఐర్లండు భూమిమ్మీద, ఒక గురువునుకాని, ఒక కథోలిక్కు వ్యక్తినిగాని, సజీవంగా ఉండనీయం అని దుర్మార్గులు కొందరు బహాయి కూతలు కూసారు. అందుకనే ఆ దుర్మార్గపు ముఠా ఐర్లండుమీద ఎగబడి, నానాభ్రష్టు పట్టించింది. అందినవాళ్ళ నల్లా చంపారు. కనపడ్డ ఇంటినల్లా తగలబెట్టారు. చిక్కినవ్యక్తినల్లా బంధించి బానిసలుగా చేసారు. ఒకటేమిటి! దేశం మీదకి దండెత్తి దోచుకొన్నారు వాళ్ళ కిరాతకృత్యాలకు దేశం గజగజలాడిపోయింది. ఐరిషీయులు ప్రాణాలరచేతుల్లో పెట్టుకొని 'కానాట్' కొండల్లో కోనల్లో పోయి తలదాచుకొన్నారు. 'చిన్నగులాబి' ఐన ఐర్లండు నల్లబడిపోయింది. అనాథ శిశువుల ఆర్తనాదాల్తో, విధవల శోకాశ్రువుల్తో ఐర్లండు నల్లకప్పువేసి పోయింది.

గాఢాంధకారంలో పయనించి, తుదకు సుఖాస్పదమైన వెలుతుర్ని చేరవలసిందిగా, ఐర్లండును దైవమూ దేశించాడు. మానవుడు తాను మోక్షద్వారాన్ని ప్రవేశించాలంటే, అతడు జేసునాధుని మాదిరిగా ముందనేకబాధ లనుభవించాలి. అట్లాగే జేసునాధుని మోక్షారోహణ మహిమానందంలో పాల్గొంటానికి, ఐర్లండు, వారి మరణవేదనలో ముందుగా తాను భాగస్వామిని కావలసివుంది.

ఐర్లండు ధైర్యంతో స్లీవను భుజస్కంధాలపై ధరించింది! గొర్రెకాపర్లంతా దేశం వదలి వెళ్ళాలన్న శిక్షనే విధించారా? లేక వాళ్ళంతా మరణించి, నీరసించిపోయిన గొర్రెలన్నిటినీ వాటి చావుకు వాటిని వదలిపెట్టేటట్లు చేసారా? ఈ ప్రశ్నకు, గొర్రెకాపరి, తన గొర్రెలకోసం ఎట్లా ప్రాణాల్ని బలిచ్చాడో అన్న సమాధానం 'ఎరిన్' భూమిమ్మీద ఉన్న ప్రతి సంఘంలో చదువరికి గోచరిస్తుంది.

వృక్ష సంపదతో అందాలు చిందే 'కింగ్స్' జిల్లాలోగుండా ప్రయాణంచేసే బాటసారి, ఆ రోడ్డు మలుపులో, రోడ్డుమీదికి వంగిఉన్న ఆ జీర్ణ వృక్షాన్ని చూస్తే, తన నెత్తిమీద టోపీని ఎందుకు తీస్తాడు? అత న్నడుగు! ఆ చుట్టుప్రక్కల కొన్ని మైళ్ళవరకూ, ఆ వృక్షం 'గురువు వృక్షం' అని పేరు పడ్డది. దానికా పేరెందుకు వచ్చిందంటే, ఆ కష్టపు రోజుల్లో, ఆ చెట్టుకొమ్మలకొక గురువు గొంతు కురివేయబడి చంపబడ్డాడు; అని సమాధానం చెపుతాడు. అక్కడున్న గొర్రె కాప

ర్లందరిలో చాలా సుగుణవంతుడతడు. అతడు తన గోత్రీలకోసం జీవితాన్ని బలిచ్చాడు.

ఎక్కడ చూచినా ఇటువంటి ధీరులే కృషి సల్పారు. వాళ్ళ ప్రార్థల్నకి, ఐర్లండుకు తూర్పు దిశలో ఉన్న 'గ్లెండలో' సెయింట్ 'కెవిన్' దేవాలయం ప్రతిధ్వనించింది. పశ్చిమాన 'కెర్రీ'లో ఉన్న ప్రతి లోయ, ప్రతి పర్వతం, గురువును సంరక్షించింది. ప్రప్రథమ త్యాగి, ఫ్రాన్సిస్ అనుయాయి, ఐరిషీయుడైన ఫాదర్ 'ఒక్వెల్లియాన్' మతంకోసం ప్రాణాలర్పించిన గౌరవాన్ని, 'బ్లాక్ వాటర్' కు చాలా ఎత్తుగా ఉన్న మనోహరమైన 'యోఘల్' పొందింది. అతడొక్కడే కాదు; అతనివెంట స్వర్గా న్నధిరోహించడానికై, అనేకులు మృత్యు సోపానా లారోహించారు.

'యోఘల్' నుండి తూర్పుకు తిరుగు! 'ట్రామోర్' ఉన్నత పర్వతపాద సమీపంవరకూ వ్యాపించిన పచ్చని 'వాటర్ ఫోర్డ్' పచ్చిక మైదానాన్ని చూడు! ఏటవాలుగా ఉన్న ఆ పర్వతంపై, పచ్చిక పొలం మధ్యగా, చీకటి గుయ్యారంగా ఉన్న ఒక గుంట కన పడుతుంది. అక్కడకు పోయి చెవియొగ్గి ఆలకిస్తే, ఆ చీకట్లోనుంచి, నీళ్ళ తాకిడి శబ్దం వినిపిస్తుంది. ఎందుకంటే, అక్కడ వంకరటింకర్లగా ఉన్న గుహ ఆ ఖాళీ ప్రదేశాన్ని, సముద్రంతో కలుపుతుంది.

జేసునాథుని వప్పుకోడమంటే, మృత్యువును ఆహ్వానించడంగా ఉన్న ఆ రోజుల్లో, ఒక చిన్న బోటులో, ఎవరికీ తెలియకుండా, సముద్రపు తీరంగుండా ప్రయాణంచేసి గురువులున్న ప్రదేశాన్నుంచి, ఒక గురువు, తరచుగా ఆ గుహలో జొరబడుతూండేవాడు. సూర్యకిరణాల్లో పచ్చిక మైదానంలో మోకరించి, పూజ బలి ప్రగతిని సూచించే, ఆ మధుర ఘంటానాదంలో, కాపలాదారుల జాగ్రత్తలో ఉన్న సమూహానికై ఆ గుంటకు మొదట్లో ఉన్న శిలా ప్రదేశంపై నిలబడి పూజ బలి అర్పించేవాడు.

'మోన్ ఘహాన్' పర్వతాలల్లో, రహస్యంగా ఉన్న, ఆ మరో గుహలో, వినయంగా మోకరించి ఆ శీతల ప్రశాంత కుడ్యాల్ని ఒక సారి చూడు! తన చుట్టూ మోకరించి ఉన్న దైవ విశ్వాసులందరికీ పూజ బలి అర్పిస్తూ, ఆ శిలా ప్రదేశాన, గురువు నిలబడి ఉండగా జరిగిన ఘోర కృత్యాన్ని ఒకసారి ఊహించుకో! ఆ గుహలో గుండా

ప్రాణాలు ఉక్కిరిబిక్కిరయ్యేటట్లుగా, దట్టమైన పొగ క్రమ్ముకోని వస్తూండగా, అక్కడున్న వాళ్ళల్లో భయ పిశాచి ఎట్లా తాండవం చేసిందో తలచుకో! మరణావస్థలో ఉన్న ఆ గురువు నోటిగుండా తడబడుతూ, బాధా సూచకంగా వస్తూన్న ఆ మాట లాలకించు! పైకి దూసుకోని వచ్చిన ఆ ఘాతుకుల ఉద్ధృతాన్ని గమనించు! ఇంకా చావకుండా మిగిలిన పదిహేను మందిని, ఆ గురువులను ఎట్లా చిత్రవధ చేసారో భావించు! ప్రశాంతమైన ఆ గుహలో మోకరించు! ఆ మరణించిన మహాత్యాగుల పవిత్రాత్మలతో నిండి యున్నట్లు ఊహించు! స్వర్గఖండమైన ఈ ప్రదేశాన్ని నీవు దర్శించ కలిగినందుకు దేవునికి వందనాలు సమర్పించు!

ఉత్తర పర్వత శ్రేణిని వదలి, తూర్పుగా సాగిపో! 'డ్రాక్ హెడా'లో డొమినికను కాన్వెంటులో, జేసునాధుడు నివాసమేర్పరచుకొన్న ఆ పర్వతాన్నధిరోహించు! తెల్లని దుస్తుల్లో, దైవధ్యానంలో, నిరంతరకృషిలో, జీవితాన్ని గడిపిన 'సెయింట్ డొమినిక్' కొమార్తెల ఆ పవిత్రమైన గృహంలోకి పో! ఆ రజిత దైవపీఠం కనపడేచోట మళ్లా ఒకసారి మోకరించు! నీవు చూస్తున్న ఆ ప్రదేశం చాలా పవిత్రమైంది. అక్కడ గౌరవనీయుడైన 'ఆలివర్ ప్లన్ కెట్' గురువరేణ్యుడు మతం కోసం ప్రాణాలర్పించాడు. మరణావస్థలో కూడా ఆ మొగంపై కళాకాంతు లేమాత్రం తరిగిపోలేదు. అతడొక ధీరోదాత్తుడుగా జీవితాన్ని బలియిచ్చాడు.

దక్షిణానికి మరలు! దేశనిర్వాసితులైన గురువుల కాశ్రయమిచ్చిన రహస్యప్రదేశాలు గల 'డబ్లిన్' 'విక్లో' 'వెక్స్ఫర్డ్' పర్వతాల్ని, లోయల్ని చూస్తావు. ఈ పర్వతాలలో వేటాడబడి చిట్టచివరకు ఊబిలో తలదాచుకొన్న ధీరుడైన ఆ గురువుకష్టాల్ని ఒక్కసారి స్మరించు! చెట్లకొమ్మల్లో అత డక్కడ ఆశ్రయాన్ని నిర్మించుకున్నాడు. పైన వర్షంతోగాని, క్రిందనీటితోగాని, ఎల్లప్పుడూ చిత్తడి చిత్తడిగా వుండే గుప్పెడుగడ్డే అతనికున్న వస్తుసామగ్రి. అతడి వయస్సు 8౦ సంవత్సరాలు. అత డిక్కడుండి తన మందను పోషించాడు. ముందుండి నడిపించాడు.

ఈ పర్వతాల్లోనే జేసునాధునికోసం పోరాడిన యోధు డొకడు తలదాచుకొన్నాడు. అతని సంగతి ఇది, 'డబ్లిన్' నగరంలో 'టిమోతి

సల్లివన్' కు ఒక పాఠశాల ఉంది. అతడు 'ట్రినిటీ' కాలేజీ విద్యార్థు లిద్దర్ని రోమన్ కథోలిక్కులుగా మార్చి నేరం చేసాడు. అందుకని, అతనికి ద్వీపాంతరవాస శిక్ష పడ్డది. కాని తిరిగి వచ్చి 'లిమెరిక్' లో ఒక చిన్న పట్టణంలో బడి చెపుతున్నాడు! మహోదాత్తుడైన 'సల్లివన్' వంటివా రనేకు లున్నారు. అణగారిపోయిన ఐర్లండును అంటిపెట్టుకోని, దానికోసంగా చిరు నవ్వుతో ప్రాణా లర్పించిన మహా త్యాగులు వారు!

కసిబోక మసి పూసుకొన్నట్లుగా, దేశాన్ని నాశనం చేద్దామన్న దురూహతో వచ్చిన ఆ క్రూరులు, వాళ్ళ కోరిక నెరవేరకపోవడం వల్ల, దైవ పీఠాన్ని బ్రద్దలు కొట్టి జేసునాధుని పవిత్ర చిహ్నాన్ని కాళ్ళక్రింద వేసి మట్టగించారు. వాళ్ళు చేసిన కిరాతాలకు ఐర్లండు మరింతగా దైవ విశ్వాసపూరితమైంది. "తండ్రీ! వాళ్ళను క్షమించు! పాపం, వాళ్ళు చేస్తున్న దేదో వాళ్ళకే తెలియదు! వాళ్ళు వట్టి అజ్ఞాను లు!" అని, చనిపోయిన త్యాగుల ఆత్మలన్నీ శతాబ్దాలనుంచీ, తమ దుస్థితికి కారకులైన కిరాతకులకోసం, తమ నాయకుడైన జేసుస్వామి ఆదేశానుసారం, దైవ ప్రార్థల్ను చేస్తున్నై.

"ఒక్క యూరపు జాతుల నేమిటి, మానవ లోకమంతా ఐరిష్‌వారిని గురించి గర్వపడవలసిన అవసర మెంతైనా ఉంది. దుర దృష్టం విలయతాండవం చేసినా, కష్ట పరంపరలు కదను త్రొక్కినా, భీభత్సం పెల్లుబికినా, పరమ ఘాతుక కృత్యాలు పరవళ్ళు త్రొక్కినా, నాశనమే నాట్యం చేసినా, చలించని ధైర్యంతో, సడలని దైవ విశ్వా సంతో, దిగజారని నైతిక గుణంతో, లొంగని కృతజ్ఞతతో, కృంగని మహాదాశయాల్తో, కాంతి తరుగని సద్గుణ రత్నాల్తో, బ్రహ్మాండంగా నిలబడ కలిగిం దొక్క ఐరిష్ జాతి తప్ప, మరొక టీ ప్రపంచం మూల మూలల గాలించి వెదకినా కనిపించదు." అని ఫ్రెంచి బిషప్పు 'డ్యూపాన్‌లాప్' వాళ్ళనుగూర్చి ప్రశంసించాడు.

ఎగబడి, దైవ పీఠాన్ని బ్రద్దలుచేసి, దేవాలయ కుడ్యాల్ని కూల ద్రోసి, గురువుల, ప్రజల పవిత్ర రక్తధారల్లో వాటిని ముంచెత్తి భయంకరంగా చెలరేగి, వృధావేశంలో కన్నూమిన్నూకూడా తెలియ కుండా, తాము దైవమునకే విరుద్ధముగా పోరాడుతున్నామనైనా, తెలుసుకోకుండా, గ్రుడ్డితనంగా, దేశాన్ని సర్వనాశనం చేసిన ఆ పరమ

ఘాతుకుల విద్రోహ చర్య లన్నింటినీ, మూగ వ్యాఖ్యానాలు చేస్తూ, నేటికీ ఐర్లండులో, బ్రహ్మాండమైన స్మృతి సౌధాలు చాలా ఉన్నై. వీటన్నిటికన్నా నన్ను బాగా ఆకర్షించింది, జేసునాథునికోసం ధైర్యంతో ప్రాణాలర్పించిన త్యాగమూర్తుల మానవాతీతమైన అచంచల ధీరత్వాన్ని అక్షరాలా నిరూపించే, ఒక బ్రహ్మాండమైన నల్లరాయి. ధూళి ధూసరితమైన ఆ నల్లరాతిమీద జేసునాథుని పవిత్ర నామాక్షరాలు బాగా లోతుగా చెక్కబడ్డయ్. ఆ శిలా ఫలకం చుట్టూ కండ్లపండగ్గా పచ్చ పచ్చని పచ్చికబయ లావరించి ఉంది. అది ఐర్లండుకు తరగని నిధి. ఐర్లండులో అమూల్యమైన 'పూజ బలి శిలా ఫలక' మది.

గురువులూ, ప్రజలూ, అడవుల్లోకి, కొండల్లోకి, కోనల్లోకిపారి పోతూ, తమ వెంట దేవునికూడా తీసుకుపోయారు. (అనగా దేవుని ఎప్పుడు తమ హృదయములలో కలిగియున్నా రన్నమాట.) కీసిలా కాశంతప్ప దైవమందసం లేదు. 'పూజబలి శిలాఫలకం' తప్ప దైవ పీఠం లేదు.

ఒక్క దైవమందసంకూడా లేదని చెప్పానుకదూ! ఔరా! తప్పుచేశాను! ఆ పర్వతంపై జరిగే పూజబలి జాగ్రత్తగా పరిశీలించు! గురువు వంగి జేసునాథుని అద్భుతవచనాలు చెప్తున్నాడు. జేసుస్వామి వారి మధ్యలో ఉన్నాడు. ఆ గురువు అప్పంలో అదృశ్యరూపములో ఉన్న జేసునాథుని హస్తాల్లోధరించి, తన కెదురుగా మోకరించి ఉన్న జనసమూహంవైపు మరలి "గొఱ్ఱెకాపరియైన దైవాన్ని పరువకండి! ప్రపంచంలోని పాపాలన్నింటినీ పరిహరించగల జేసుస్వామిని హృదయపీఠాలపై సుస్థిరంగా ప్రతిష్టించుకోండి" అని పలుకుతున్నాడు. "ఏలినవారా! తమరు నా మందిరము ప్రవేశింప నేను పాత్రుండను గాను. తమరు ఒకమాట ఆనతిచ్చిన పక్షమున నా ఆత్మ పవిత్రమగును" అని చెప్తున్నాడు.

పాపం! ఆ గురువు జేసుహృదయం తప్ప జేసునాథునికి నిలువ నీడ కల్పించడానికి జానెడు స్థలంకూడా చూపించలేకపోయాడు. ఆతని నిండుహృదయంలో, జేసునాథుడెంత ఆప్యాయంగా నివాస మేర్పరచుకొన్నది దేవునికీతప్ప మరెవరికి తెలియును.

ప్రొద్దున్నే వీచే మందవాయువుల్లో, "ఏలినవారా! ఇదిగో గొఱ్ఱెపిల్ల. లోకముయొక్క పాపములను పరిహరించెడు గొఱ్ఱెపిల్లను

దృష్టించు" అను వాక్యముల శబ్దము నలుదిశలా ప్రయాణం చేసి, దైవంచేతకాకుండా, మానవులచేత బహిష్కరింపబడ్డ ప్రతిన్యక్తిహృదయంలో ప్రతిధ్వనిస్తుంది. జనులు వెంటవెంటనే ఒకరొకరుగా వచ్చి, గురువు పాదపద్మాల ఎదుట మోకరించి, దివ్యసత్ప్రసాదము లొకొంటారు. జేసుస్వామిమీద తమకున్న అచంచలప్రేమకోసం, మృత్యువునైనాసరే ధైర్యంతో ఆహ్వానించగల్గిన, ఆ ఐరిషీయుల హృదయాల్లో క్రీస్తునాథుడు వేంచేసి నివాసము ఏర్పరచుకుంటారు.

ఫ్రాజబలి శిలాఫలకం!

ఇటువంటి బ్రహ్మాండమైన స్మృతి సౌధాన్ని, భూమాత ఇంకా ఎక్కడ చూపించగలదు?

"ఫ్రాజబలి కొండ" అను పదంవల్ల ఎటువంటి ప్రేమ - విషాద చరిత్రలను హృదయోద్వేగాన్ని కలిగిస్తయ్! ప్రేమాస్పదమైన ఆ బిరుదు నంటుకొని ఎన్ని అపూర్వస్మృతులు తటాలున స్ఫురిస్తయ్. శిథిలమైపోయిన సంసారాల్ని గూర్చి, భగ్నమైన దైవపీఠాల్ని గూర్చి, అది ఎటువంటి విషాదగాథ చెపుతుంది! జేసుస్వామి నిర్వాసితుడు! ప్రజలు నిర్వాసితులు! చలిలో, చీకట్లో, ఆ ఫ్రాజబలి శిలాఫలకం చుట్టూ ప్రజలుమూగిన తక్షణం, జేసుస్వామి నిర్వాసితుడు కాడు! ప్రజలూ గృహస్థులే!

ఓ! ఫ్రాజబలి శిలాఫలకమా! మహా త్యాగుల పవిత్ర రక్తముతో అరుణారుణమైన, విషాద మేఘావృతమైన ఈ నేలను నీవు చూసావు కదూ!

ఓ! ఫ్రాజబలి శిలాఫలకమా! కరువులో, ఆకులు మేసి అల్లాడి కృశించి, కంటికొనల్లో ప్రాణాలు పెట్టుకొని, జీవించిన ప్రజా సమూహము గల ఈ శాద్వల ప్రదేశాన్ని వీక్షించావు! విశ్వరూపం దాల్చి, విలయతాండవం చేసిన మృత్యువు ఇనప గజ్జెల మ్రోత లాలకించావు! కానీ! ఓ! ఫ్రాజబలి శిలాఫలకమా! నీ విశాల భుజస్కంధం పై అధిష్టించి, బక్కచిక్కిన ప్రజానీకం, తమ గురువుతో సహా, దేవుని యెదుట మోకరించి, గద్గద కంఠంతో చెల్లించిన దైవ స్తోత్రాలెప్పుడైనా విన్నావా? సాహసవంతులైన ఆ గురువుల అధరచుంబనా స్పర్శ సుఖాన్ని గుర్తించావా?

గుహ నుంచి గుహకు, కోనసుంచి కోనకు, వృక్ష సమూహం నుంచి వృక్ష సమూహానికి, 'శేషహృదయం పూజబలి' అన్న మాట మహా వేగంతో, కాంతిపుంజం వలె నిశ్శబ్దంగా ప్రయాణం చేసింది. నీ ప్రక్కనే నిరీక్షిస్తూన్న గురువూ, జేసునాధుడు తప్ప, వాళ్ళకీ ప్రపంచంలో సహృదయులని చెప్పుకోదగ్గ వాళ్ళెవరూ లేకపోవడంచేత, ఆ గుహల్లో నుంచీ, కోనల్లోనుంచీ, చెట్ల గుంపుల్లోనుంచి, చీకట్లో తడుముకొంటూ క్రింద పడుతూ, లేస్తూ, నిశ్శబ్దంగా ఒక మహాజన ప్రవాహం నీ దగ్గ రికి వస్తుంది.

ఓ! పూజబలి శిలాఫలకమా! నీ చుట్టు పర్వతంపైన వున్న పొగమంచు తప్ప, నీకు ధూప ధూమ పటలం వేరే లేదు. గాలిమోత తప్ప, కంఠశబ్దం వినపడదు! మిణుకుమిణుకుమంటూ, బాధాపీడితమైన ఐర్లండును దర్శిస్తూ, వెలిగే నక్షత్రకాంతులుతప్ప వేరే దీపకాంతి లేదు!

ఓ! పూజబలి శిలాఫలకమా! నీ చుట్టూ మూగినవారంతా బాధా సంతప్తహృదయులు! స్వప్నిక గ్గను ఆవరించి ఎగిరే పదివేల దేవదూతల రెక్కలచప్పుళ్ళు వాళ్ళువిన్నారు! జేసునాధుని పవిత్ర హృదయంలో తమకోసం ప్రకాశించే ఆ అపూర్వమైన ప్రేమలోగల అలౌకికానందాన్ని వాళ్ళనుభవించారు.

విజయ పరాజయాలకు చిహ్నంగా నిలబడి, అనన్యత్యాగమూ ర్తుల మహౌదార్యగుణాల్ని తరతరాలుగా వ్యాఖ్యానంచేస్తూన్న, ఈ 'పూజబలి శిలాఫలకాన్ని ఒక్కసారి దర్శిస్తే మా హృదయాలు ఎట్లా గర్వంతో నిండిపోతున్నయ్! మా శరీరాల్లో రక్తం ఎంతమహో ద్వేగంతో ప్రవహిస్తున్నది!

ధూళిధూసరితమై ఉన్న ఆ శిలాఫలకంపై ఆ నల్లని నెత్తురు చార చూడు!

ఏకాంతంగా ఉన్న ఆ పర్వతం - ప్రశాంత ప్రాతఃకాలంలో, తనచుట్టు పచ్చికమీదమూగిన ఆ నల్లనినీడలు- జేసునాధుని హస్తాల్లో ధరించిన ఆ గురువు- అంధకారాన్ని చీల్చుకొని ఆ భయంకరారావం- అక్కడ మోకరించిన వాళ్ళ పగిలిన గుండెల్లోనుండి వెలువడ్డ ఆ విషా దాక్రోశం-తుపాకుల ఆ హఠాత్ప్రవేశం-శిలా ఫలకం మీద పడిపోయి, తన జీవిత రుధిరంతో దానికి రంగువేస్తూ, ఇంకా ఆ కలశాన్ని తన

హృదయానికి హత్తుకుంటూ మరణించిన ఆ మత గురువూ – ఈ విష యాల్నన్నింటినీ మన కది ఎట్లా చెపుతున్నదో ఆలకించు !

ఓ ! పూజబలి శిలా ఫలకమా !

ఐర్లండు విషాదాన్ని, ఐర్లండు ఘనవిజయాన్ని చెపుతూ, ఐర్లండు నిధివై, నాశనరహితమైన ఒక స్మృతిచిహ్నంగా, నీ వక్కడున్నావ్ !

ఓ పవిత్ర పూజబలి శిలాఫలకమా ! నీవు ఐర్లండు జీవ గఱ్ఱవు ! సంజీవినివి ! నీవు ఐర్లండు దేశపు కాల్వారి గిరివి.

---

ఆరవ ప్రకరణము.

# ఐర్లండులో క్రిస్టమస్

ఐర్లండులో క్రిష్టమస్ అంటే ఆ నేలకు ప్రభువైన జేసుకు మహోత్సాహంతో, బ్రహ్మాండమైన స్వాగత మివ్వడమన్నమాట! ప్రతి వ్యక్తికీ అత్యంత సన్నిహితుడైన జేసుస్వామి రాక! అందుకనే ఆయన కంతటి బ్రహ్మాండమైన స్వాగతం! ఎవ్వడూ ఒంటరిగా ఉండడు. అందరూ కలిసి మహోత్సాహంతో ఈ కార్యక్రమంలో పాల్గొంటారు. దేశమంతా ఒక ప్రశాంత వాతావరణంతో నాట్యం చేస్తుంది. కీర్తి ప్రతిష్ఠలు కదను త్రొక్కుతై. చలికాలపు చలి నిరంకుశంగా విజృంభిస్తుంది. కాని, జేసురాకకై గాఢానురాగంతో నిరీక్షించే అక్కడి ప్రజలు దీన్నేమాత్రం లక్ష్యం చేయకుండా, పండుగ రోజు కోసం సర్వవిధ సన్నాహాల్లో పూర్తిగా నిమగ్నులై ఉంటారు.

క్రిష్టమస్ రోజుల్లో ఐర్లండులో ఒక తీరంనుంచి మరో తీరం వరకూ క్రొత్త నక్షత్ర సమూహ మొకటి ప్రకాశిస్తూ గోచరిస్తుంది. 'ఇయార్ కొన్నాట్' పర్వతాలపై, డోనెగల్ తరంగాలమీద, 'విక్లో' అరణ్యసీమల్లో, అవి మిణుకు మిణుకు మంటుంటై. విశాలమైన 'షానన్' నదీ తీరాన్నుంచి, 'బ్లాక్ వాటర్' గమనాన్ని సూచిస్తూ అవి ఒకే వరసలో ప్రకాశిస్తై. ప్రతి నగరంలో, ప్రతి గ్రామంలో, ప్రతి మార్గంలో, పర్వతారణ్య సీమల్లో ఆ నక్షత్ర సముదాయం తన దివ్య కాంతుల్ని వెదజల్లుతుంది. కోనల్లో, కొండల్లో, నదుల్లో, సరస్సుల్లో, పచ్చిక మైదానాల్లో, ఒకచోటేమిటి! సర్వే సర్వత్రా ఆ ఐరిష్ క్రిష్టమస్ తారకలు దేదీప్యమానంగా ప్రకాశిస్తయ్. ప్రతి గృహ గవాక్షంలో ఆ క్రిష్టమస్ దీప కళిక వెలుగుతూ, బాల జేసువును అక్కడికి నడిపించుకొని పోను, దేవదూతలకు, భూమినంతా ప్రకాశవంతంగా చేస్తుంది.

బాటసారికి మార్గం స్పష్టంగా కనపడేందుకు, ధార్మికగుణంతో పవిత్రలతా గృహం క్రింద గవాక్షంలో కొవ్వొత్తి దీపం ఉంచుతారు. ఈ రోజు రాత్రి జేసునాథుడూ, ఆయన మాతృశ్రీ, చాలా దూరం ఇల్లూ వాకిలి వదలి తిరగడం చేత అలసి సొలసి ఉంటారని, వారికి

సుస్వాగతం ఇవ్వడానికి, తమ ఇంటిముందుగా పోతుంటే, ఇంటిలోపలికి రావడానికి సర్వావకాశాలూ కల్పించడానికి, అందరూ తమ తలుపులు బార్లా తీసి ఉంచుతారు. ఇది అనుశ్రుతంగా వచ్చే ఆచారం.

బెత్లెహేము పురవాసులు కవాటాలు బంధించి దివ్య బాలునికి చేసిన అపరాధానికి, అవమానానికిగాను, ఐరిష్ జాతంతా నేడు ఇవ్విధమున ప్రేమతో పరిహారము చేస్తుంది. ఈ క్రిష్టమస్ సమయంలో బికారి జీవులందరికీ స్వాగతం ఇచ్చి, ఇదివరకన్నా పుష్కలంగా డబ్బు దానమిస్తూ, ఇట్టి సత్క్రియలవలన గూడా, పరిహారము చేస్తూంటారు.

ఐర్లండులో దానం చేయడం ఎప్పుడూ వాళ్ళ మానవ ప్రేమకు నిదర్శనమైనప్పటికీ, ఇప్పుడింకా ఎక్కువగా దాన ధర్మాలు చేస్తారు. ఈ రోజుల్లో జేసునాధుని బీద ప్రజలకు సౌఖ్యం, శాంతి, తేజస్సూ కలగజేయడం ఐరిష్ జాతి ప్రధాన కర్తవ్యం.

తిరు కుటుంబం పేరుతో, అవసరంలో ఉన్న పురుషుడికిగాని, స్త్రీకిగాని, బిడ్డకుగాని మృష్టాన్నం పెట్టి, నూతన వస్త్ర దానం చేసి సత్కరించడం వాళ్ళకు తరతరాలుగా వస్తూన్న ఆచారం. దయా మణులైన కన్యా స్త్రీల ఆధ్వర్యం క్రింద పాఠశాలల్లో చదువుకొంటున్న చిన్నబిడ్డలు తమ జాతి చేస్తున్న దాన ధర్మాల్లో, వాళ్ళ తాహతుకొద్దీ వీళ్లు సాయపడుతారు. అంతేకాకుండా, వాళ్ల తీరిక సమయాల్లో నిరుపేద బికారి జీవుల కోసం వస్త్రాలు సంపాదిస్తారు. దుస్తులుతయారు చేస్తారు.

ఈ క్రిష్టమస్ సమయంలో, చీకటిపడ్డ తర్వాత, ఒక ఐరిష్ గృహం తిలకిద్దాంపద ! క్రిష్టమస్ దీపకళిక వెలిగించి, పాదరింటిలో గవాక్షంలో ఉంచిన తర్వాత, ఆ ఇంటిపెద్ద పవిత్రోదకాన్ని మొట్ట మొదటగా ఆ దీపకళికపై చిలకరించి, తర్వాత ఇంట్లోఉన్న వాళ్ళందరి మీాదా చల్లుతాడు. అటు తర్వాత వాళ్ళంతా జపమాల స్తోత్రం చెల్లించడానికి దానిముందు మోకరిల్లుతారు. ఆ దేశం దేశం జపంతో ధ్వనించిపోతుంది. నిజంగా ఇది మన జేసు ప్రభువుకూ, మరియ మాతకూ అర్హమైన సుస్వాగతం ఇంగ్లండు, స్కాట్లండు మొదలగు దూర దేశాల్లో ఉన్నవాళ్ళు, ఏమాత్రం అవకాశమున్నవాళ్లైనప్పటికీ ఈ శుభ సమయానికి గుంపులు గుంపులుగా బైలుదేరి, తమ మాతృ

దేశానికి వచ్చి చేరుకుంటారు. మాతృ దేశానికి తిరిగి వచ్చే వీళ్ళంతా, నగరం ఎంత అందంగా ఉన్నప్పటికీ అక్కడికి పోకుండా తమ హృదయాల్లో మాసిపోకుండా ఉన్న ఆ పురాతన గృహం దగ్గరికి పరుగెత్తుకు వచ్చి, తమందరికీ స్వాగత మిచ్చి, ఆశీర్వాదాలు చెల్లించడానికి సిద్ధంగా ఉన్న ఆ వృద్ధ దంపతుల దగ్గరికి చేరుతారు.

క్రిష్టమస్ జపమాలస్తోత్రానికి అందుకోడానికి వీల్లేకుండా, దూరదూర దేశాల్లో చాలా మంది నిర్వాసితులుగా ఉండడం మూలాన అక్కడ చాలా ప్రదేశాలు ఖాళీగానే ఉన్నయ్. కానీ, ఆ రాలేని వాళ్ళంతా, ఇక్కడున్న ప్రతివాళ్ళ మనస్సుల్లో సాక్షాత్కరిస్తూనే ఉంటారు. తల్లి, ఖాళీ ప్రక్కలన్నింటినీ ముద్దుపెట్టుకొంటూ, వాళ్ళను పేరు పేరునా పిలిచి, జేసునాథునికి, దయతో ఆదరించమని అప్పగిస్తుంది. నేత్రాల్లో ఉత్సాహరేఖలు కాంతి వెదజల్లుతూంటే, హృదయం కదలి, వాళ్ళు చెల్లించే ఆ స్తోత్రపాఠాల కప్పుడు మరింత మహిమ కలుగుతుంది.

ఒక ఐరిష్ గృహంలో జపమాలను చెప్పే వలయంలో ఖాళీగా ఉన్న ఆ కుర్చీలు చూడు! ఏమి గాథ వాటిది! అవి, వాటిని విడిచి పెట్టి వెళ్ళేటప్పుడు వాళ్ళకు కలిగిన దుస్సహ దుఃఖాన్ని చెప్తై. ముక్కూ మొగం తెలియని ఆ క్రొత్త ప్రదేశాలకు పోవడానికి వాళ్ళు చేసిన ధైర్య సాహసాలు వర్ణిస్తయ్. అంతేకాదు, అక్కడ లేనివాళ్ళకోసమని నిరంతరం పరితపించే ఆ గృహంలోని విషాద హృదయాన్ని విప్పి చూపిస్తయ్.

ఆర్కిటిక్ హిమప్రదేశాల్లో, 'నోమ్' మొదలుకొని 'యూకన్' వరకూ, అర్జెంటైనాలో, ఆస్ట్రేలేషియాలో, ఆ వెచ్చని సూర్యుని క్రింద ఆ నిర్వాసులు పరిభ్రమిస్తారు. ఐతే ఏం? క్రిష్టమస్ సమయంలో వాళ్ళ ఊహాలు సంవత్సరాల వెనక్కి పరుగెత్తుకుపోయి, ఆ పురాతన గృహంలో, క్రిష్టమస్ సమయంలోని జపమాల స్తోత్రి సమావేశాలు గుప్పున జ్ఞాపకానికి వచ్చి హృదయాలు అమృతం నింపుకొన్నట్లౌతయ్.

గతస్మృతి వాళ్ళ హృదయాల నెట్లా కదలించివేస్తుంది! వాళ్ళు ఐర్లండుకు ప్రయాణం కావడంతోటే, ఎంత దూరమైనా అడుగు మాత్రిమైపోతుంది.

ఎంతకాలమైనా నిన్నగానే గోచరిస్తుంది. అదృశ్యమైపోయిన వీళ్ళంతా దేశదేశాలనుంచీ, అన్నిసముద్రాలమీదుగా వచ్చేస్తారు.

ప్రేమపాశాల్తో బంధింపబడి, పూర్వస్మృతి మార్గదర్శిగా, వాళ్ళు చిన్న తనంలో ఆడుకొని పాడుకొని తిరిగిన దేశానికి, కొండలగుండా, లోయల గుండా, కాల్వలగుండా, ప్రయాణాలు సాగిస్తారు. వాళ్ళమార్గం ఎంత కీకారణ్యావృతమైనప్పటికీ, ఆ పర్వతాలగుండా రావడానికెంత కష్ట మైనా, అమితోత్సాహంతో కష్టాలన్నీ లెక్కచేయకుండా ప్రయాణ మైవస్తారు. బీద, ధనిక భేదాలుగానీ, బాలవృద్ధ భేదాలుగానీ వాళ్ళలో గోచరించవు. వివిధ దేశాలనుంచి ఐర్లండుకు క్రిష్టమస్ సమయంలో, తమ మాతృదేశానికి ప్రయాణమైవచ్చే ఆ జనపరంపరలో దరిద్ర ధనిక భేదాలూ, బాలవృద్ధభేదాలూ అంతరించిపోతయ్. ఎందుకంటే, నూత నోత్సాహంలో వాళ్ళంతా యువకులుగానే గోచరిస్తారు. దైవ మాతృ దేశభక్తి విషయాల్లో వాళ్ళంతా ధనికులే!

ఆ పవిత్రస్థలంలో అడుగుపెట్టడానికి వాళ్ళల్లో ఎంత ఉత్సాహం వెల్లివిరుస్తుంది! విదేశాలనుంచి వచ్చేవాళ్ళకు తమ పురాతన నివాసన స్థలాన్ని చేరుకునేందుకే అక్కడవున్నదా? అనిపించే ఒక పురాతనమైన దీర్ఘమైనమార్గం, వాళ్ళందరికీ సుపరిచితమైంది అక్కడుంది. విశాల హృదయంతో కూడుకొన్న ఆ పురాతన 'షాన్' నగరంలో ఆపిల్ ఫల వృక్షాల చుట్టూ ఒక ముళ్ళకంచెఉంది. చూడగానే నోరూరే ఆ ఆపిల్ పళ్ళను అభక్ష్యాలుగా నిషేధించినప్పటికీ ఆశాపీడితులైన మానవులు వాటిని తినడానికి ఆ తోటలోకిపోకుండా ఆ ముళ్ళకంచె లేమాత్రం అడ్డగించలేవు.

నక్షత్రకాంతుల్లో తెల్లగా ప్రకాశించే ఆ పాఠశాల ప్రశాంత వాతావరణాన్ని భగ్నపరుస్తూ, కిలకిలా రావాలుచేసే పక్షుల కాల వాలమై దట్టంగా పెరిగిన ఆ ముళ్ళపొదను ఛేదించుకుంటూ ఆ మార్గం సాగిపోతుంది.

గతానుభవాలికి సంబంధించిన వీటన్నింటినీ నిరంతరం ఆలో చిస్తూ మన నిర్వాసితులు శీఘ్రగమనం సాగిస్తున్నారు. "ఇదిగో! ముందీవంతెన! తర్వాత ఆకాలవ! వెంటనే ఆ పచ్చనిపొలాలు! వాటి తర్వాత ఆ పండ్లతోటలు, ఆ గోడమలుపు తిరగంగానే, ఇదిగో! ఈ ఒక్కలంగలో నేనక్కడుంటాను," అని అతడు శరవేగంతో నడకసాగి స్తున్నాడు. ఇప్పుడీ తొందరెందుకూ! వేసే ప్రతిఅడుగూ ఆనంద చిహ్నమే! మాతృదేశంపై గల గాఢానురాగంతో ఆతనిపూర్వస్మృతి

మరుగుపడిపోగా, అమందానందంతో ఆతడీ విశాలపథం గుండా ఉరుకులూ, పరుగులూ తీస్తాడు.

ఆ సందు మలుపుగూడా తిరిగాడు. అతని విశాలనేత్రాలు మిలమిలా మెరిసిపోతున్నయ్. అతని హృదయం వేగంగా కొట్టుకుంటోంది. ఔను! అదిగో! నాటికీ నేటికీ ఒకేరకంగా వున్న ఆ పవిత్రస్థలమే అతని జన్మభూమి. ఆ లతాగృహం క్రింద సువర్ణచ్ఛాయల్లో ప్రకాశించే ఆ పర్ణకుటీరమదుగో! తనకు పూర్వపరిచితమైన ఆ మార్గంగుండా అతడు ప్రయాణం సాగిస్తుంటే ఆ క్రిష్టమస్ దీపకళిక అతనిపాదాల్ని తేజోవంతంగా చేస్తున్నది. ఆ గృహంలోనుంచి వినిపిస్తున్న సంభాషణలో అక్కడున్న ప్రదేశమంతా ప్రతిధ్వనించి పోతున్నది. అతడు, తన హృదయంలో నిరంతరంగా మధుర గానం చేస్తున్న వాళ్ళ గానామృతాన్ని తనివిదీరా ఆస్వాదించడానికని అదిగో! అక్కడా గవాక్షం దగ్గర నిలబడిపోయాడు. ఆ గృహంలోని వాళ్ళందరూ జపమాల స్తోత్రం చెలిస్తున్నారు. అతడి నిత్య కృత్యాలన్నీ ఏకరువు పెడుతూ వాళ్ళతని నామోచ్చారణ చేయడం అతడికి వినపడ్డ వెంటనే, అతనికి కళ్ళల్లో గిర్రున నీళ్ళుతిరిగినై. అమితోత్సాహంతో, అమందానందంతో అతడొక్కసారిగా ఆ గృహంలోకి దూసుకుపోయి తన నెత్తిమీద టోపీ తీసి, 'ఇక్కడున్న వాళ్ళందర్నీ జేసునాథుడు రక్షించుగాక!' అని అంటూ ఇంతకు ముందు ఖాళీగా ఉన్న ప్రదేశంలో ఆ క్రిష్టమస్ దీపకళికకు మోకరిస్తున్నాడు.

తా నా రోజు వదలిపెట్టిపోయిన వాళ్ళందరూ అక్కణ్ణే ఉన్నారు. మరియ చాలా సంవత్సరాలుగా కన్యాస్త్రీ అయిందనిగాని, అమెరికాలోని రాకీపర్వతచ్ఛాయల్లో జేమ్సు మంచిదశలో ఉన్నాడనిగాని అతనికి చెప్పే ప్రయోజనంలేదు. స్థల, కాలమార్పులచే ఎంతోదూరంగా ఉన్నప్పటికీ, దృఢతర సంస్మరణ ప్రభావంచేత వారంతా తన కండ్ల ఎదుట ప్రత్యక్షముగా ఉన్నటు అతనికి తోచినది. స్మృతి పథంలో కలలు గన్న ఆ దివ్య దృశ్యాల్ని కాలం ఏ మాత్రం మార్చలేదు. కాల ప్రభావంచేత మారకుండా ఆ నిర్వాసితుడి గృహం నాటికీ నేటికీ అట్లాగే ఉంది. బెత్లెహామును ప్రకాశవంతం చేస్తున్న ఆ ఐరిష్ నక్షత్రాల విశ్వాస కాంతుల్ని తేజో విహీనాలు చేయడానికికాల ప్రభావము చాలదు. ఆ కాల ప్రభావము నిర్వాసితులైన ఐరిష్

ప్రజల హృదయాలను వాళ్ళ మాతృ దేశానికి ప్రేమ పాశాల్తో బంధించి వేస్తున్నది.

ఆ నక్షత్రాలు రాత్రల్లా ప్రకాశవంతంగా వెలిగీ వెలిగీ, క్రిస్టమస్ రోజు అరుణోదయానికి తేజోవిహీనాలౌతై. దేశమంతటానిశ్శబ్దం కాపురం చేస్తుంది. జేసు ప్రభువు రాకను మౌనంగా నిరీక్షిస్తున్నదా, ఏం అనిపిస్తుంది. శీతాకాలప్రభావంచేత ధూళి ధూసరితమై, తేజో విహీనంగా ఉన్న ఆ ప్రదేశాన్నంతా మేలి ముసుగ్గా ఉన్న ఆ మంచు తేజోవంతంగా, ఆకర్షణీయంగా చేస్తుంది. వృక్షాగ్రాలమీది మంచు బిందువులు ముత్యాల్లా మెరిసి పోతుంటై. పర్వత శిఖరాలపైనా, లోయల్లో, ఆ మహిమ ధవళకాంతులు బాగా ప్రకాశిస్తయ్.

పూజ బలి ఘంటారావాలు, దేశంలో నిశ్శబ్ద వాతావరణాన్ని భేదించి, మధుర గానంతో నింపివేస్తయ్. 'పాలస్తీనా' క్షేత్రాలలో గుండా మహావేగంతో, ఆనాడు మొట్టమొదటి క్రిష్టమస్‌కు తమ సంరక్షకుడైన జేసునాధునిముందు మోకరించడానికి పరుగెత్తుకువచ్చిన గొర్రెకాపర్లమాదిరిగా, ఈ పూజబలి ఘంటారావాలకు సమాధానంగా మహోజ్వలంగా వెలిగే హృదయాల్తో, నేడు పొలాల్లోగుండా రహదార్లవెంబడి, కాల్వలపైనా, పచ్చిక మైదానాలద్వారా, ఒక మహా జనప్రవాహం అద్భుతవేగంతో మహాయాత్ర సాగిస్తుంది.

దివ్యకాంతులు విరజిమ్ముతూ, దేశానికి సంతోషాన్ని కలిగించే ఆ దేవాలయంలో దైవపీఠం మొదలుకొని గోపురద్వారంవరకూ, ఇసుక వేస్తేరాలకుండా జనసమూహం పరివేష్టిస్తుంది. జూదయాదేశపు గొర్రెకాపర్లను నాడు ఆనందంతో ముంచెత్తిన దేవదూతలపాట "వెనీతె ఎక్జల్ తేమున్" గీతం, ఈనాడు దైవపీఠందగ్గర మోకరించివున్న జేసు ప్రభుని ఐరిష్ గొర్రెకాపర్ల హృదయాల్ని పులకింపచేసి, వాళ్ళకు కర్ణ రసాయనంగా వుంటుంది. ప్రభువుపై వాళ్ళుచూపే ఆ గౌరవాతిశయాలు, ఎంతనిర్మలాలు! ఎంతప్రశంసా భావసహితాలు! ఎంతత్రికరణ శుద్ధిమంతాలు! మోక్షానికి బెత్తెడంలో ఉన్నానని ఒక్కొకడు తలపోస్తాడు. ఒక వంక తమ సృష్టికర్తనుగూర్చి భక్తిశ్రద్ధల్తోగూడిన విశ్వాసమును వెల్లడిస్తున్న ప్రేమపూర్వక ప్రణామవాక్యాలను మెల్లగాఉచ్చరిస్తుంటే మరోవంక ప్రార్థనాశబ్దతరంగాలు ఒక్కొక్కటిగా ప్రయాణంచేసి దైవపీఠం దరిజేరి పారవశ్యంతో మూర్ఛిభవిస్తున్నవి.

చేతులు జోయిలించి, దైవపీఠందగ్గర మోకరించి, దైవపీఠాన్ని మినహా ఇతర మేమీ తెలియని, పవిత్రసాక్షాత్కారం తప్ప మరొకటి గోచరించని పారవశ్యంలో, గంభీరమైన కంఠధ్వనితో "నా ప్రభూ! ప్రియతముడూ, విశ్వాసపాత్రుడూ, మిత్రుడూ అయిన జేసునాథునికి స్వాగత సహస్రాలు" అని పలుకుతూ, దైవ ప్రార్థనలు చెల్లించే, ఆమె పవిత్రహృదయాన్ని, జీవన్మరణాల్లోగల రహస్యాలేం చేస్తై? ఆమె మొగంపై ప్రతిరేఖా, ఆమెలోవున్న ఆ ఆత్రుతా, ఆమెగాఢ భక్తీ, ఆ దైవపీఠంమీద దేవమందసములో నున్న, జేసువునుగూర్చి పూర్ణజ్ఞానాన్ని స్పష్టంచేస్తున్నయ్.

వారెంతభక్తితో పూజచూస్తూ వుంటారు! భక్తిపూరితమైన హృదయాలు ప్రేమజ్వాలలతో ప్రజ్వరిల్లుతూ, మధ్యపూజలో మోక్షమునుండి దిగివచ్చి, పీఠముపై ప్రతిష్ఠింపబడిన దైవాన్ని అలుముకొంటాయి. వారి పవిత్రప్రాచీన పారమార్థిక చింతతోగూడిన ఆరాధన అందరిహృదయాలనీ ఆకర్షిస్తుంది. భక్తిప్రపూరితమైన వాతావరణముతో దేవాలయం నిండి నిర్మలత్వాన్ని విరజిమ్ముతూ వుంటుంది. ప్రజల ఆ భక్తిప్రపత్తులు నిరాడంబరాలూ, నిష్కల్మషాలు. ఏమని చెప్పాలి! బ్రహ్మాండమైన హర్షధ్వను లనుభవించినట్లుగా, అమితోత్సాహంతో అక్కడి వాయుతరంగాలు చలిస్తయ్.

నడిపూజలో వర్ణనాతీతమైన భక్తిప్రపత్తుల్ని జేసుకు ప్రదర్శించడములో, ఐరిషీయులలో కొన్నిప్రాంతాల్లో ఒకవిధమైన ఆచారం ఉంది. ప్రతిష్ఠ జరుగనున్నదని తెలియజేసే ఘంటారావం వినపడడంతోటే, ప్రార్థనాశబ్దాలు నిలచిపోతయ్. అక్కడున్న శిరస్సులన్నీ వంగుతై. నిశ్శబ్దం తాండవిస్తుంది. అద్భుతం పరిసమాప్తమైందనీ, జేసుప్రభువు వారిమధ్యలోనే వున్నాడనీ తెలియజేయడానికి మళ్ళీ ఒకసారి గంటమ్రోగుతుంది. అప్పుడొక ఆశ్చర్యకరమైన విషయం జరుగుతుంది. ఆపరాని మహావేగంతో ప్రవహించే ఒక జలపాతంలాగ ఆ జేసుప్రభువుఎదుట, ఆ భక్తుల హృదయాలనుంచి ఒక్కసారి కట్టలు తెంచుకొని ఆయనపైగల ప్రేమప్రవాహం ఉరుకులూ, పరుగులూ తీసుకొంటూ బైటికిప్రవహిస్తుంది. అక్కడవున్న భక్తసమూహమంతా ఒక్కసారిగా ఒకేవక మనిషిమాదిరిగా వంచినతలలన్నీ పైకెత్తి, అమితోత్సాహంతో, గంభీరనినాదంతో దైవపీఠంవేపుచూస్తూ ప్రార్థల్ను

చేస్తుంది. వాళ్ళుచెల్లించే దైవస్తోత్రాల్లో అనుభవంలేని హృదయం, అందులోఉన్న మనస్సునాకర్షించే సౌందర్యాన్ని గుర్తించలేదు; అక్కడున్న ప్రతివ్యక్తీ తన భౌతికకాయాన్ని విడిచి, ఒక్కసారిగా దైవపీఠం దగ్గరికి పరుగెత్తి, లోకసంరక్షణార్థం తన జీవితాన్ని బలిచ్చిన జేసు నాథుని పాదపద్మాలను ముద్దుపెట్టుకొంటున్నాడా! అనిపిస్తుంది. వాళ్ళ మధ్యలో జేసును సాక్షాత్కరింప జేసుకొన్నవాళ్లు, తదనంతరం తమ పూజ బలిని నిర్విఘ్నంగా కొనసాగిస్తారు. భక్తిశ్రద్ధలు వెల్లివిరిసేటట్లు, సత్ప్రసాదంకోసం, జేసునాథునికి ఘనస్వాగతం పలుకుతారు. మళ్ళీ ఘంటారావం వినపడేటప్పటికి, అక్కడ సమావేశమైనవారంతా సత్ప్రసాదార్థం బైలుదేరుతారు. జేసుప్రభువు వాళ్ళ పవిత్రహృదయాల్లో తను నివాసం ఏర్పరచుకుంటాడు. క్రిష్టమస్ రోజుల్లో ఐరిష్ జాతంతా సత్ప్రసాదం కోసం దేవాలయాలకు విరగబడి వస్తుంది. దేశమంతా బోసిపోతుంది. ప్రతి వాని హృదయం జేసు పాదపద్మాల ముందు మోకరిస్తుంది.

జేసువు జన్మించిన రోజులలో వాయుప్రపూరితమై పాడుబడి యున్న పశువులకొట్టముకన్నా, ఐర్లండు వేదహింసకాలమున విషాద పూరితమై నిర్మానుష్యమై యుండెను. ఐర్లండు పవిత్రపర్వతములపై నుండే పూజబలి శిలాఫలకం గడచిపోయిన జయంతి ఉత్సవదినాలలో వారనుభవించిన బాధలను బాగా వారికి స్ఫురణకు తెస్తుంది. కాన వాళ్ళంతా జేసునాథునిపుట్టుకను, ఆ సమయమున ఆయన అనుభవించిన బాధలను బాగా గ్రహిస్తారు. గ్రహించి సానుభూతి చూపిస్తారు. పూజబలి ముగిసిం తర్వాత, మందహాసవదనాల్తో, క్రిష్టమస్ ఆశీర్వాదాలూ, అభివందనాలూ పలుకుతూ గుంపులు గుంపులుగా కలుసుకొంటూ, ప్రయాణం సాగిస్తారు. కానీ వాళ్ళ హృదయాల్లోనుంచీ అక్కడ దైవపీఠంమీద ఉన్న జేసుప్రభువుమాత్రం విడిచిపోడు. రోజు రోజల్లా ఒక మహాప్రవాహం మాదిరిగా ప్రజలు, మరియమాత, జోజేఫులతో జేసు ప్రభువుకు మోకరించడానికి దేవాలయానికి వస్తూయుంటారు. దైవస్తోత్రాలు వినే దేవదూతలు, అక్కడ జరుగుతున్న ప్రదర్శనాలను చూస్తూ మురిసిపోతారు. ఇదిగో! ఇక్కడ వాళ్ళతల్లి, దైవస్తోత్రాలు విశదంచేస్తూ, జేసుప్రభువును చూపిస్తూ వాళ్ళందరిని మరియమాతకు, ఆమెబిడ్డపై ప్రపంచ సంరక్షకుడైన దివ్యమూర్తి

జేసునాథునకు పరిచయం చేస్తూండగా, పిల్లలగుంపొకటి అద్భుతా వేశంతో, అమాయకమైన చూపుల్తో, ఆశ్చర్యంగా చూస్తూ మోకరించి ఉన్నారు. అదుగో! వాళ్ళప్రక్కనే ముసలితనంచేత సగం వంగిపోయిన వృద్ధ మతబోధకుడొకడు తనపైబడ్డ ఏళ్ళభారంతో, భారాన్ని మరచి జనసమూహాన్ని లక్ష్యపెట్టకుండా, గొంతులతరబడిగా మోకరిస్తూ తన్మయత్వంతో ఆ పవిత్రకుటుంబంతో కలసిపోయి దైవప్రార్థనలు చేస్తున్నాడు.

ఎంత చిన్నదైనా, ఎంతపెద్దదైనా ప్రతిదేవాలయం జనసమూహంతో క్రిక్కిరిసిపోతుంది. అందంగాఉండి చాలామందికి యాత్రాస్థలముగావున్న దేవాలయం గానీయండి, లేకపోతే దారిద్ర్యంలో రూపుమాసిపోయిన 'ఆనాటి బెత్లెహేములో ఉన్న చిన్నదేవాలయం గానీయండీ, నిమిత్తంలేదు. ఆ గుహకు సంబంధించిన పూర్వ చరిత్రనంతా వాళ్ళవిశ్వాసం ఆమూలాగ్రంగా పఠిస్తుంది. అయస్కాంతం మాదిరిగా వాళ్ళహృదయాలన్నింటిని, క్రిష్టమస్, ప్రభువులవైపు గాఢంగా ఆకర్షిస్తుంది.

ఈ విధంగానే కలకాలం మహత్తరం గా ఉండుగాక! క్రిష్టమస్ దీపకళిక తన దివ్యకాంతుల్ని, ఆచంద్రతారార్కం దశదిశలా వెదజల్లుగాక ! దివ్యప్రభువగు జేసునాథుడికి ఘన స్వాగత మిచ్చే ఇర్లండు ఆకల్పాంతం పుణ్యక్షేత్రంగా వర్ధిల్లుగాక !

---

ఏడవ ప్రకరణము.

# ఐర్లండు _ మరియమాత నెల

ఐర్లండులో మరియమాత నెలయగు మే మాసంలో మరియ మాతపైగల భక్తి ఐరిషీయుల దైవవిశ్వాసంలోగల ప్రధానవిషయం. జేసుప్రభువు తల్లియైన మరియమాతను ఐరిషీయు లీ నెలలో ప్రత్యేక మైనవిధానంతో గౌరవిస్తారు. ఆమె నిజంగా వాళ్ళజాతికే మాత! అందువల్ల వాళ్ళకామెపై అంతభక్తి. విశ్వాసం గట్టిదైనప్పుడు మరియ మాతపై భక్తిచాలా ఆకర్షణీయంగా ఉంటుంది. విశ్వాసం మరియ మాతను ప్రేమిస్తుంది. భిన్నమతావలంబనం ద్వేషిస్తుంది.

ఐరిష్‌వాళ్లు మరియమాతపై ప్రదర్శించే భక్తిశ్రద్ధలు ఆనంద దాయకాలు; తేజోవంతాలు. తల్లి బిడ్డల మధ్యనున్న సమ్మకాన్ని, ప్రేమను వాళ్ళభక్తి వెల్లడిస్తుంది. ప్రకృతి, సౌందర్యము కలిసి ఐర్లం డులో మే నెలను నిజంగా ఆనందదాయకం చేస్తాయ్. మరియమాత మందస్మితంలో తేజోవంతమై మొత్తం దేశం ఆనందపరవశత్వం చెందు తుంది. మరియమాతను గౌరవించటానికి ప్రకృతి మనోహరంగా అలం కరించుకొంటుంది. ఏప్రిల్ నెలలో సూర్యుడు రోజురోజూ పైపైకిపోయి మిశ్రమ బంగారమయమైన తరంగాల్ని ప్రసాదిస్తాడు. అల వెంబడి అల ప్రయాణం చేసి, ధూళి ధూసరితమై సొంపు చెడిన కొండల్ని, లోయల్ని పచ్చ పచ్చగా నేత్రపర్వం చేస్తుంది. దేశంలో వసంతం నవ్వినట్లుగా, పచ్చని ఆకులు మంద వాయు ప్రసారానికి కదుల్తూ, తమ చ్ఛాయల్లో శాద్వల ప్రదేశాల్ని కప్పివేస్తూ ఉంటాయి. నిద్రా ముద్రితమైన ప్రకృతి మేల్కొని వసంత స్పర్శకు సౌందర్యంతో పుల కించి, మే నెల కోసం నిరీక్షిస్తూంటుంది.

మే నెల అరుణోదయమైంది. పచ్చని ప్రదేశాలమీద తన మృదు హస్తాలతో పుష్పాల్ని వెదజల్లి స్వాగత మిచ్చింది. సముద్రం నుండి సముద్రంవరకూ మే నెలలో ఐర్లండుయొక్క కౌమారదశ స్వచ్ఛమైన మంచువలె వ్యాపించింది. పర్వత పార్శ్వంలో పసుపు పచ్చని ముండ్ల పొద స్వర్ణకాంతుల్తో ప్రకాశిస్తున్నది. పుష్ప సౌరభా

సారంతో శాద్వల ప్రదేశాలపై, వాయువు మందగమనం సాగించింది. ఐర్లండు పక్షిసంతానములతో స్వర్గములా ఉంటుంది.

కోకిల, భరద్వాజం మొదలయిన పక్షిజాలం, తమ తమ తియ్యని కంఠాలెత్తి మధుర గానం ప్రారంభించినై. మే నెల పుష్పాలకూ, క్షేత్రాలకూ, ఆనందదాయిని; శోభప్రదాయిని; భూలోకానికీ, స్వర్గలోకానికీ దేవియై, మానవజాతి కత్యంత మహిమాన్వితురాలైన మరియమాతకు మేనెల సర్వదా అర్హమైనదే. మధురగానంతో, సౌందర్యంతో ఓలలాడిపోతున్న ఈ భూఖండానికి, గౌరవప్రదమైన దేవాలయంలోకి ప్రవేశించినట్లుగా మరియమాత వస్తుంది. ఆమె స్వాగతం హృదయపూర్వకమైంది.

ఆ భూఖండాన్నంతా కప్పివేసిన విశ్వాస మనే పచ్ఛాదం ఆమెపై గల ప్రేమవల్ల సహస్ర సౌందర్యాలతో అలంకరింపబడినది. ఆ దేశస్థులందరికీ మరియ మాత, జేసు ప్రభుని ప్రతి బింబాన్ని ప్రదర్శించే అద్దం వంటిది.

భగవంతుడి సృష్టిలో మరియమాత కున్న స్థానం వాళ్ళకు తప్ప మరెవరికీ గోచరం కాదు.

న్యాయాధిపతియైన జేసునాథునికీ, పాపాత్ముడికీ తల్లియైన మరియ మాత పాద పద్మాల ముందు వారంతా మోకరిస్తూ, తమ స్తోత్రాలన్నిటినీ ఆమె ద్వారా క్రీస్తునాథుని కందజేస్తారు. బెత్లెహేమునుంచి, కాల్వరీవరకూ తన పుత్రుడితో సహా ఆమె వారితోనే ఉంటుంది. వాళ్ళ దైవ భక్తి ప్రశంసార్హమైంది. ఆమెకు సంబంధించిన ప్రతి విషయం పవిత్రం. ఇంగ్లీషు భాషలో మనకు మరియ మాత అన్న ఒక్క పేరే ఉంది. ఆ నామాన్ని దేవదూత, పాపి ఒక్కటిగానే ఉచ్చరిస్తాడు. మతాభిప్రాయంతో కూడుకొన్న, ఐరిష్ మాతృ భాషలో మాత్రం అట్లాగాదు. (Muire) మ్యూర్ అనే పదాన్ని పరమ పవిత్రంగా, ఆమె పేరుగా వాళ్ళు ప్రత్యేకించారు. వాళ్ళకు మరియమాత పైగల గౌరవ మటువంటిది. ఆమె నామాన్ని ధరించిన ఇతర మహిళామణుల్ని (Maire) " మైర్ " అని వ్యవహరిస్తారు. ఐరిష్ వాళ్ళల్లో ఏ ఒక్కరూ మ్యూర్ అనే పవిత్ర నామాన్ని పెట్టుకోరు. నిజంగా, మరియమ్మ అనే పేరుగల వాళ్ళు ఐర్లండులో లెక్కలేనంతమంది ఉన్నారు.

ప్రతి కుటుంబములో కనీసం ఒక్క కుమార్తెయినా మరియ మాత పేరుతో జ్ఞాన స్నానం పొందినదై ఉంటుంది.

మరియమాత మీంద వాళ్ళకి గాఢానురాగం తరతరాల్నుంచీ వస్తున్నది. నిజానికి పశ్చిమ జాతుల్లో పరమ పవిత్రమైన మరియ మాత జన్మ పాపములేని ఉద్భవమును సిద్ధాంతమును బహుళ ప్రచారంలోకి తీసుకవచ్చినవాళ్ళు, మొట్ట మొదటగా ఐరిష్‌వాళ్ళే. "ఓ మహిమాన్వితమైన మరియు మాతా! మాతలకన్నా విశిష్టమైన మరియా మాతా! సర్వ మహిళా శిరోమణీ! దేవ దూతల రాజ్ఞీ! మోక్ష వాసినీ! ఉదారాశయా!! శిశు సంరక్షిణీ! స్వర్గ సోపాన మార్గదర్శనీ!" అన్న ప్రార్థనా గీతం వాళ్ళ కత్యంత ప్రీతికరమైంది. ఇది వేయి సంవత్సరాలనుంచి నిరంతరం గానం చేయబడుచున్న వాళ్ళ పరమ పవిత్ర గీతం!

సంవత్సరమంతా ప్రతి దినం అరుణోదయ కాలానికి మరియ మాత స్తోత్రాన్ని తెలియజేసే గంటలు మ్రోగుతాయ్. మధ్యాహ్నానికి మళ్ళీ ఘంటారావం వినబడుతుంది. ఆ ఘంటారావం వినబడేటప్పటికి ప్రతివాడి మనస్సు ఇహ లోకాన్ని వదలి, పరలోక నివాసియైన జేసునాధుని ప్రార్థల్న కంకితమౌతుంది. రోడ్డు ప్రక్క ఆడుకొంటున్న పిల్లలుసైతం వాళ్ళ చిన్న చేతుల్ని ముకుళించి, దైవ ప్రార్థన చేస్తారు. పొలాల్లో పనిచేసే ప్రతి కర్షకుడూ, ఆ గట్లమీదనే మోకరించిమరియ మాత వద్దకు జేసు వచ్చినందుకు తన నమస్కారాలు చెల్లిస్తాడు. పాఠశాల గదిలో, గుంపులుకూడే సంతలో ఎక్కడైనాసరే అందరి మనస్సులూ స్వర్గ నిమగ్నాలై ఉంటై. పూర్వం మాదిరిగానే అందరూ అప్పుడు జేసు ప్రభువుకూ, మరియమాతకూ యథావిధిగా స్తోత్రాలు చెల్లిస్తారు. ప్రతిరోజూ మూడుసార్లు ఆ ఘంటారావం వినబడగానే ఎక్కడివాళ్ళక్కడే తమ పనిపాటల్ని, ఆటల్ని అన్నీ వదలి పెట్టి దైవ ప్రార్థల్ను చేస్తారు.

ఇది సర్వసామాన్యమే ఐనప్పటికీ, మరియమాత నెల్లో, ఆమెపై వాళ్ళకున్న అనురాగం మరింత స్థాయీభావాన్ని పొందుతుంది. అప్పటి వాళ్ళ ప్రత్యేకతే వేరు. మే నెల మొదటిరోజున అందరూ పెందలాడే నిద్రలేచి, త్వరత్వరగా పనులన్నిటినీ ముగించుకొని, పరమ పవిత్రమైన బావి చుట్టూ తిరిగి రావడానికి బైలుదేరుతారు. చుట్టూ తిరిగి

రానడమంటే బావి దగ్గరికి యాత్ర సాగించడమన్న మాట! జప మాల స్తోత్రాల్ని పఠించడమన్న మాట! బీదా బిక్కికి దానధర్మాలు చేయడమన్న మాట! ఆరోజు సూర్యోదయం మొదలుకొని సూర్యాస్తమయం వరకూ ఈ విధంగా నిరంతరాయంగా సాగిపోతుంది. ఇది ఆ నెలకు సరైన ఉపోద్ఘాతం!

ఈ నెలంతా ప్రతిరోజూ పూజబలితో, దివ్యసత్ప్రసాదంతో ప్రారంభించి, పరమ పవిత్రమైన ఆ మరియమాత ఆశీర్వాదంతో ముగిస్తారు. ఆదివారాల్లోను, ప్రతి పల్లెలో, ప్రతి పట్నంలో ఆ మరియ మాత సంతానం ఆమె స్వరూపంతోనో, లేకపోతే ఆమె చిహ్నంగా ఉన్న ధ్వజంతోనో ఆమెను స్తుతించే జపాలు చదువుకొంటూ, ఒక పెద్ద ఊరేగింపుగా బయల్దేరుతారు. భగవంతుడి దయాంతఃకరణానీ మహోదార స్వభావాన్నీ చూపిగొనడానికి మే సర్వదా యోగ్యమైన నెల. వసంతం తన పని ముగించుకుంది. పంట కోతలింకా ప్రారంభించ బడలేదు. అందుకని జనం ఇదివరకటి మాదిరిగా హడావుడి పడి స్థితుల్లో లేదు మతబోధ సంఘ సమావేశాల్లో మరియమాతపై గల అచంచల విశ్వాసం వర్ణింపరానిది. డోనెగల్లో వున్న కొందరు సత్పురుషుల విషయం నాకు తెలుసు. వారు సాయంత్రం ఆరు గంటల కా సమావేశానికి హాజరై రాత్రల్లా అక్కడ్నే జాగరణ చేసి మర్నాటి ఉదయం పూజబలి సమయంలో దివ్యసత్ప్రసాదాన్ని లోగొనటానికీ, పాపసంకీర్తనానికీ సర్వ సన్నాహంతో సిద్ధంగా ఉండేవాళ్ళు. వాళ్ళు గంటలతరబడి జపమాల స్తోత్రాలు చెల్లిస్తూ కాలక్షేపం చేసేవాళ్ళు చాలామంది ఉపవాసాలుండి చాలాదూరం ప్రయాణం చేస్తారు. సామాన్యంగా సాయంకాలం నాలుగ్గంటలదాకా సత్ప్రసాదాన్ని లోగొనడానికి వాళ్ళు పచ్చిగంగ కూడా ముట్టుకోకుండా ఉంటారు. వీళ్ళవంతా చేయడం త్యాగబుద్ధితో కాదు. వాళ్ళు జేసును గూర్చిన ఊహల్లో తన్మయత్వం చెందుతారు. వాళ్ళ హృదయాలు ఆనందంతో నిండిపోతై. ప్రతి ఐరిష్ గృహంలో మరియమాత పూజ పీఠం ఉంది. బాలబాలికలంతా అమితోత్సాహంతో సరస్సుల దగ్గరికీ, ఉద్యాన వనాల్లోకీ, కొండలమీదికి పరుగెత్తుకుపోయి రకరకాల పూలను సంపాదించి తమ గృహాన్ని బాగా అలంకరిస్తారు. ప్రతి రాత్రీ, ప్రతి గృహంలో ఆ పీఠం ముందు జపమాల స్తోత్రం చెల్లింప బడుతుంది.

ప్రతి హృదయం మరియమాతపై గాఢవిశ్వాసంతో ప్రకాశిస్తుంది. నిష్కల్మషమైన హృదయంతో ఉన్న మరియమాతను అపారాయక మైన చూపుల్తో చూస్తూ, తన చిన్ని చేతుల్తో దోసిలిపట్టి, మొగంపై దివ్యకాంతుల్ని వెదజల్లుతూ, కూర్చొని ఉన్న ఆ పసిపిల్ల వెంబడే, నడుమువంగి మోకరించి కూర్చున్న ఆ వృద్ధమాత, తన బోసినోటితో స్పష్టాస్పష్టంగా జపమాల స్తోత్రాన్ని చెల్లిస్తున్నది! వాళ్లు దైవప్రా ర్థలో నిమగ్నులైనపుడు వాళ్ళ హృదయాల్లో లవలేశమైనా భయం గోచరించదు. ఎరిన్‌లో ఉన్న స్త్రీ జనం అంతా వాళ్ళమాత చుట్టూను గుంపుగా కూడి, వాళ్ళ సంరక్షణకూ మార్గదర్శకత్వానికీ, అమితాను రాగంతో, గాఢ విశ్వాసంతో ఆమెను సందర్శిస్తారు. వాళ్ళేనాడూ నిరాశాపూరితులు కారు!

ఐరిషీయుల హృదయాల్లో నిండి పొంగిపోయే ప్రేమ, స్వర్గ ములో పునాదులు గలిగి పరిపోషణ పొందిన ప్రేమ- ఈలాంటి ఆధ్యా త్మిక ప్రేమధనము ఐహికమైన ప్రేమ సంతతిని పరిశుద్ధముగాను, పవి త్రంగాను చేస్తుంది. స్త్రీ ఆధ్యాత్మిక ప్రవృత్తి విలువ అర్థమైంది. మరియ మాత ఎప్పుడూ ఆమె వెన్ను కాచుకొనే ఉంటుంది. ఆమె మరియ మాతను గౌరవాదరాల్తో చూస్తుంది. స్త్రీత్వానికి సంబంధించిన ఈ ఉన్నతాదర్శం జాతిని ఉన్నతంగా, విశ్వాసపాత్రంగా ఉండేటట్లు చేసింది. ' లెకీ ' తాను వ్రాసిన ' యూరపు హేతువాద చరిత్ర ' లో ఈ విషయాన్నిగూర్చి ఎటువంటి ప్రశంసా వాక్యాలు పల్కాడో వినండి!

"ఈ ప్రపంచమంతా దాని ఆదర్శాలవల్ల పరిపాలింప బడు తున్నది. మరియమాతపై మధ్య యుగాలవారి అభిప్రాయాల కన్నా గూఢమైంది గాని, మొత్తంమీద శ్రేయస్కరమైంది గానీ ప్రపంచాన్ని పరిపాలించలేదు. మొట్ట మొదటిసారిగా స్త్రీకి అర్హమైన స్థానం లభిం చింది. గతయుగాలవాళ్ళకి తెలియనిపవిత్రతా, ఆర్ద్రతా, కోమలత్వము, పై ఉన్నతాదార్శమునుబట్టి, ఉన్నతాదర్శ ప్రాయణియైన మరియమా తనుబట్టి ఈ యుగంలో బాగా వ్యాప్తి చెందినై. గురువులు తమ పాలకు లైన మరియమ్మగారిని గూర్చి వ్రాసిన గ్రంథాలవల్లా, దేశ దేశాల ప్రజలు తమ ప్రవర్తనను సరిదిద్దుకొనచేసిన నిరంతర ప్రయత్నాలవల్లా, మరియమాతపై గల అత్యంత గౌరవం కొద్దీ ఐహిక వాంఛల్ని త్యజిం

చిన పవిత్ర యువతుల వల్లా, మరియమాత దయను పాత్రులు గావటానికి వాళ్ళు చేసే త్యాగాలవల్లా, తపస్సువల్లా తమతోను అభిరుచుల్ని తదనుగుణంగా మార్పు చేసుకొనేవాళ్ళవల్లా, ఉన్నతాదర్శ ప్రభావం ఆ కాలంలో యెంతగా ప్రవర్తిల్లిందో తెలుసుకోవచ్చు. యూరోపులో వున్న మంచినంతా దాని ప్రభావమే! మన ఈనాటి నాగరికతకూ, పవిత్రాశయాలకూ అదే మూలాధారం.

ఐర్లండు సర్వదా మరియు మాతనే ఆశ్రయించి ఉంది. ఆమె కూడా ఐర్లండుకు ధైర్య సాహసాలూ, గాఢ విశ్వాసం ప్రసాదించి, నాటినుంచి నేటివరకు స్వయంగా రక్షిస్తూనే ఉంది. ప్రతి సంఘటనను ప్రతి నిముషము అక్కడున్న ప్రజల జీవిత విధానాలను, మతమే దిద్ది తీరుస్తున్నది. వాళ్ళకున్న ఆధ్యాత్మికానుభూతి ఊహించలేము. విశ్వాసమైన దృష్టితో వాళ్ళు ప్రతి జీవిలోనూ జేసును సందర్శిస్తున్నారు. వాళ్ళ ప్రకృతి సౌందర్యం భగవంతుణ్ణి చేరే సోపానం! ప్రతి వృక్షం జేసు దివ్య స్మృతి చిహ్నమే! ప్రతి పుష్పం సృష్టికర్తయైన జేసునాథుని గుణ కీర్తనం చేసే నాలుకే!

అటువంటి దృఢ విశ్వాసాన్ని ఐహిక భోగాలే మాత్రం కదిలించలేవు. శాంతి సమయంలో, యుద్ధంలో, ప్రశాంత వాతావరణంలో, పెను తుపానులో, కష్టసమయాల్లో, భయంకరమైన మృత్యు ముఖంలో ఎక్కడయినా వాళ్ళకు జేసునాథుని అభయ హస్తం సాక్షాత్కరిస్తూనే ఉంటుంది! కరువుతో అనారోగ్యంతో పీడింపబడి, మృత్యు ముఖంలో ప్రవేశించియున్న ఆ దరిద్ర నిర్భాగ్య జీవియైన పిల్లను చూడు! ఆమెకు సన్నిహితులైనవాళ్ళందరూ మరణించారు. అనాథయైన ఆ బాలిక నడవటానిక్కూడా శక్తిలేక తన పూరి గుడిసెలో నిశ్చేష్టురాలై మరణ వేదన అనుభవిస్తున్నది. మృత్యు దేవత తాండవించే ఆ ప్రదేశంలో పర్యటిస్తున్న గురు విప్పుడే మరణోన్ముఖురాలైన ఆ బిడ్డను చూచాడు. పాప మా నిర్భాగ్యురాలు కేవలం అస్థిపంజరమాత్రావశిష్టయై, కాంతి విహీనాలైన కళ్ళతో మృత్యు సందర్శనం కోసం నిరీక్షిస్తున్నది. రాత్రింతా దట్టంగా మంచు కురిసింది. సూర్యుడు ఆ యింట్లోకి తొంగి చూచాడు. ఆమె ఫాల భాగమంతా మంచుచేత కప్పబడింది. ఆ బిడ్డను చూట్టంతోటే గురువు నీరయిపోయాడు. ఆయన హృదయం కరుణా పరిపూరితమయింది. ఆయన కళ్ళనిండా నీళ్ళు క్రమ్మినై

మోతు రాజ్యమును జేర సంసిద్ధురాలనుగా జేయ ఆమె ప్రక్కనే మోకరించాడు. ఆమె తెల్లని పెదవులు కదిలినాయి ఆమె పైకి వంగి గురు వామె అస్పష్టమైన హీనస్వరా న్నాలకించాడు.

"స్వామీ! భగవంతుడు మంచివాడు కాడా! జేసునాధుడూ, ఆయన తల్లి మరియమాతా తప్ప నన్ను రక్షించేవా ళ్ళెవరూ లేక నే నిక్కడ దిక్కులేని పక్షినై పడివున్నా. నేను జ్వరంతో తపించిపోయా. నాకు మిక్కిలి దప్పిక వేసింది. గుక్కెడు మంచినీళ్ళిచ్చి నా దాహాన్ని తీర్చేవా ళ్ళెవరూ లేరు. కరుణామయుడైన జేసుస్వామి చల్లని మంచు నా కొరకు పంపించాడు. అది నా దగ్గరకు వచ్చింది. దప్పిక తీర్చు కోడానికి నేను దాన్ని త్రాగాను. భగవంతుడు మంచివాడు కాడా?" అన్న మాట లామె నోటనుండి వచ్చినై.

అటువంటి మహత్తరమయిన హృదయంలో గల గాఢ విశ్వా సం ఊహగా మారింది. ఐరిష్ వ్యక్తి తాను రోజూ చేసే ప్రార్థనలవల్ల తనలో వున్న ఊహకు స్పష్ట వ్యాఖ్యానం చేస్తున్నాడు. "భగవంతుడు సరిహద్దుగాగల అంతం లేని ఒక దీర్ఘ మార్గంలో మనం పయనిస్తున్నాం. మనం తప్పకుండా ఆ జేసుప్రభువును జ్ఞాపక ముంచుకోవాలి!" వాళ్ళు మరియమాతజపమాలను చేత్తో ధరించి ఆ మార్గాన్నే అనుసరిస్తు న్నారు.

ఐరిష్ జపమాల! ఐరిష్‌వాళ్ళ మెత్తని వ్రేళ్ళా జపమాల నెట్లా తాకుతున్నయి! ఐరిష్‌వాళ్ళ ఆ లేత పెదవు లా జపమాల నెట్లా ముద్దాడుతున్నాయి! మరియమాత కానెకోకను వా ళ్ళెట్లా గట్టిగా పట్టుకొని దాన్ని వదలకుండా అనుసరిస్తున్నారు! ఆమె వారిని సర్వదా కాపాడుతునే వుంది. స్వర్ణయుగ మాతయిన మరియమాత జపమాల వలన దరిద్ర నిష్ఠుర జీవనాన్నుంచి, భయంకర క్షామం నుంచి, మహా ప్రమాదా న్నుంచి, యుద్ధాగ్నిజ్వాలల నుంచి, జైలు గదిలో చల్లని చలినుంచి, ఒకచోటనుం చేమిటి? ప్రతి ప్రదేశాన్నుంచి ఐరిష్ ప్రాణి పద్మాలు పైకెత్తబడుతున్నాయి. బాల, వృద్ధ, వ్యాధిపీడిత, బలహీన, కర్కశ బాధా సంతప్త, పవిత్ర, పాప ఒక టేమిటి? అందమయిన

అన్ని హస్తాలు అనురాగకంపితాలయి ఇహలోకం నుంచి పరలోకానికి మరియమాత కోసం చాచబడి ఆమె కొంగు నందుకున్నాయ్. ఆమె కొంగు తాకిన వెంటనే ఆ బాధా పీడిత హృదయంలో సౌఖ్యం, ఆ భగ్నహృదయంలో ఆశ కలుగుతున్నాయి. అవమానం, కష్టం, నిరాశా తొలగిపోయినవి. ఆమె కొంగును తాకటమంటే మోక్ష సోపానాన్ని దాటుట మన్న మాట! ఎప్పుడూ ఐరిష్‌వాళ్ళకు జపమాల లంగరువంటిది! "గాబ్రియల్" దేవదూత పిలిచే టట్లుగానె పిలుస్తూ, ఆమె కొంగును పట్టుకొని వ్రేలాడుతూ ఆ జపమాల లోని పూసల ద్వారా ఆమె కుమారుని పవిత్ర జీవిత గ్రంధాన్ని పఠిస్తున్నారు. ఒక మధుర గాయకుడు అందమయిన ఒక గీతాన్ని ఆలాపించి, ఆరోహణావరోహణ క్రమములో అర్ధవంతంగా పాడి, అందరి హృదయాల్ని సంతృప్తిపరచేటట్లుగా మరియమాతను ప్రార్థించేవాళ్ళు. ఆమె చీరె చెరగును పట్టుకొని ఆమె గత చరిత్రనంతా హృదయపూర్వకంగా స్తోత్రం చేస్తున్నారు. మరియమాతచేత సక్రమమైన మార్గమున నడుపబడ్డ ఆమె తన ప్రాణానికన్న ఎక్కువగ ప్రేమించుకొన్న మరియమాత ప్రియపుత్రుడయిన జేసునాధుణ్ణి ప్రత్యక్షంగా సందర్శించగల్గుతున్నది. పూసలు తాకినంతమాత్రం చేతనే, బాల్యంచేత ముద్దులు మూటలు గట్టే మందహాస శోభితమైన ఆ అమాయకపు వదనాన్ని ఆమె దర్శిస్తున్నది. ఆ నేత్రాలామె హృదయంలోకి తొంగిచూస్తున్నయి. అదిగో! ఉపాధ్యాయుడయిన జేసునాధుని అద్భుతమయిన ఆ వదనం! అదిగో! మళ్ళీ అటు చూడు! స్లీవపై కొరతవేయబడిన వారి వివర్ణ వదనమును చూడుము! అదిగో! అదిగో! ఆమె మళ్ళీ అటువేపే చూస్తున్నది. మహిమాన్వితమైన జేసునాధుని సుందర ముఖారవిందాన్ని ఇప్పుడామె సందర్శిస్తున్నది. మరియమాత మాతృ వాత్సల్యంతో గాఢంగా బంధింపబడి ఆమె చాలా విశ్వాసంతో మోకరించి జేసునాధుడి కోసం అట్టే చూస్తున్నది. భూమాత ఇంతకన్నా మనోహరమైన దృశ్యాన్నింకోటి చూపించగలదా? లేకపోతే ప్రకృతి ఇంతకన్నా మహోదాత్తమైన భావాన్ని తెలుపగలదా?

మే నెలలో, ఐర్లండు భగవంతుడి భక్తులతో నిండిన దేవాలయం వంటిది! ప్రపంచ జ్యోతియైన ఆ జేసునాధుడి దివ్యకాంతులచే దేదీప్య

మానంగా ప్రకాశించే భూమి ఐర్లండు! మరియమాత ప్రియకుమారుడు, లోక సంరక్షకుడు అయిన యేసునాథుడు విశ్రాంతి తీసుకొనే పవిత్రమైన స్థలం ఐర్లండు.

---

ఎనిమిదవ ప్రకరణము.

# ఐర్లండులో దివ్యసత్ప్రసాదపు పండుగ



తిరుసభకు సంబంధించిన పడంగలన్నింటినీ, ప్రత్యేకమైన భక్తి శ్రద్ధల్తో జరుపుకోవడం ఐర్లండుకు తరతరాల్నుంచి వస్తున్న ఆచారం. ఎందరెన్ని విధాల దూషించినా, ఎటువంటి నిరసన భావంతో చూచినా, ఎంతగా విమర్శించినా ఐర్లండు వాటన్నింటినీ లక్ష్యపెట్టక, దేవాలయాన్నీ, జేసుప్రభువునూ, నాటినుంచి నేటివరకూ అచంచలమైన భక్తివిశ్వాసాల్తో హృదయపూర్వకంగా పూజిస్తూనే ఉంది. ఆ స్థిరదైవ విశ్వాసం కలిగినందుకు ప్రతిఫలంగా ప్రతిపండక్కీ, ప్రత్యేకాలైన చక్కని ఆచారాలు ఏర్పడ్డయ్.

ప్రేమపూర్వకమైన ఈ విషయాల్లో వాళ్ళు చూపించే ఆ దృఢ విశ్వాస మహిమ మహాదాశ్చర్యకరమైంది. కొన్ని సంవత్సరాల క్రితం ఐర్లండులో ఒక నగరంలో నాకు దివ్యసత్ప్రసాద పండక్కి సంబంధించిన ఊరేగింపులో పాల్గొనే సదవకాశం లభించింది. వివిధవృక్ష పరివేష్టితమైన ఆ నగరం ఐర్లండు హృదయపీఠం అనదగ్గ మైదానంలో వుంది. దాని దగ్గర్నే మూడు రాజధానులూ కలుసుకొంటై. దానిమీద నీలివర్ణ పరిశోభితాలైన స్లీమెవిబ్లూమ్ (Slieve Bloom Mountains) పర్వతాలున్నై. ఆ పర్వతాల్నుంచి ఒక చిన్న నది ప్రవహిస్తుంది. ఆ నది ఈ నగరంచుట్టూ తిరిగి దక్షిణదిశకు ప్రవహించే షానన్ నదిలో పోయి పడుతుంది.

ఇప్పుడీ పట్టణం ఉన్నచోట వేయి సంవత్సరాల నాడొక మఠం నిర్మింపబడింది. కృషిచేత, పూజచేత, పూజబలిచేత ఆ ప్రదేశాన్నంతా పునీతంచేసిన పండితులూ, నిశ్చలదైవధ్యాన పరాయణులైన కతోలికు సన్యాసుల్తో అది నిండి ఉండేది. ఒకనాడు మహోజ్జ్వలంగా ప్రకాశించిన ఆ ప్రదేశంలోని శిధిల పాషాణాలూ, వారల అచంచలమైన విశ్వాసమును దైవభక్తినిగూర్చి వేనోళ్లచాటుచున్నవి. ఆ రాళ్ళకుప్పల వెంబడె వీళ్లు మరో దేవాలయాన్ని నిర్మించారు. గత కాలంలో మ్రోగిన దేవాలయ ఘంటారావం, ఏ పూజబలినీ, ఏ చర్చినీ, ఏ

మతాచార్యత్వాన్నీ, ఏ విశ్వాసాన్నీ సువ్యాఖ్యానం చేసిందో, ఈ నాడు ఆ దేవాలయ గోపురంలో మ్రోగే ఘంటారావం, కొండల్లో గుండా, కోనల్లోగుండా, మైదానాల్లోగుండా ప్రయాణంచేసి, అదే పూజబలినీ, అదే చర్చినీ, అదే మతాచార్యత్వాన్నీ, అదే విశ్వాసాన్నీ వ్యాఖ్యానం చేస్తున్నది.

ఆ నగరంలోకి పోయేరోడ్డు మెత్తని బురద నేల దాటిపోతుంది. ఆ మార్గాని కవతలగా పచ్చిక మైదానం ఒక టుంది. ఆ పచ్చిక మైదానం గుండా ఇంకా కొన్ని మైళ్ళదూరం వరకూ ఈ రోడ్డు పోతుంది. రోడ్డు కవతలా, ఇవతలా గుబుర్లగాపెరిగిన తీగెలున్నయ్. మంచుచేత ఆవరింపబడి వన్నెదరిగిన ఆ గతసౌందర్యాన్నంతా జ్ఞాపకం చేస్తూ, మే నెల్లో బాగా వికసించిన ఈ పుష్పజాలం తన సౌరభాల్ని దశదిశలా వెదజల్లుతుంటుంది.

కొండలెక్కుతూ, దిగుతూ ప్రయాణం చేసేవాళ్ళ కా రోజు ఈ నగరం నేత్రపర్వంగా గోచరిస్తుంది. ఆ నగరానికి చుట్టుపక్కల నివసించే జనసమూహ మంతా ఆనా డక్కడ సమావేశమౌతుంది. రోడ్డు రోడ్డంతా పట్టణానికి ప్రయాణంచేసే జనసమూహంతో క్రిక్కిరిసి ఉంటుంది. పది పన్నెండు మైళ్ళ దూరం నుంచీ కూడా గుంపులు గుంపులుగా ఆ పట్టణానికి వచ్చిపడతారు. అడుగులోఅడుగు వేసుకొంటూ నడిచే 'నెడ్డి' జంతువు మొదల్కొని బరువుమోసే ప్రతిజంతువుకీ, ప్రతి వాహనానికీ, ఆఘమేఘాలమీద పరుగెత్తే గుఱ్ఱం వరకూ ఆనాడు మంచి గిరాకీ తగుల్తుంది.

నే నొక్కసారి 'సాగ్జన్' అతిథికి ఐరిష్‌వాళ్ళ దైవభక్తి విశ్వాసాలంటే ఏమిటో నిదర్శనపూర్వకంగా పరిచయం చేస్తానని మాట ఇచ్చా. అతడు సరే నని నాతోపాటు బండిలో ఎక్కి కూర్చున్నాడు. మే మిద్దరం తీర్థయాత్రా జనంతో కిటకిటలాడిపోతున్న ఆ మార్గం వెంట కులాసాగా ప్రయాణం చేసాం.

కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ ఉన్న జనంతో నిండివున్న ప్రతి బండి దాటిపోతున్నాం. అతడు నావేపు తిరిగి "ఇంత మంది జన

సమూహాన్ని కలుసుకోవడం, పండెవు సభల్లోనో లేకపోతే బ్యాంకి సెలవురోజునో అని మాత్రమే నా అనుభవం. కానీ ఇది నిజంగా నాకు మహాదాశ్చర్యం కలిగిస్తున్నది." అన్నాడు.

"నగరంలోకి పోయేదాకా కొంచెం ఓపిక పట్టు. ఆ పట్టణంలో ప్రతి మార్గం జనంతో ఇసుక వేస్తే రాలకుండా క్రిక్కిరిసిపోతూంది. అది చూస్తే ఇప్పుడు నీకు కల్గిన ఆశ్చర్యాని కన్నా మరింత ఆశ్చర్యం కల్గుతుంది." అని నేనన్నా.

అప్పటి పరిస్థితి నేను చెప్పింది అక్షరాలా నిజమే నని నిరూపించింది. మేము రోడ్డుమలుపు తిరిగాం. ఆ పట్టణం దృగ్గోచరమైంది. అతనంత టతనే ఆ పట్టణాన్ని చూచీ చూడక ముందే బ్రహ్మాండంగా ప్రశంసించాడు.

ప్రకృతి సౌందర్యారాధకుడికి మా ముందు కనబడుతున్న ఆ దృశ్యం నేత్రపర్వంగా ఉంటుంది. ఆ రోడ్డు మేం నిల్చొన్న దగ్గర్నుంచీ క్రిం దెక్కణ్ణో ఉన్న మైదానం వరకూ పోయింది. అక్కణ్ణుంచి నది మీాద కట్టిన వంతెనమీాదుగ సాగిపోయి, ఆ నగరం ప్రారంభించిన చోటువరకూ ఉన్న గుడిసెల మధ్యగుండా చొచ్చుకుపోవడంచేత, అది మా కంటి చూపు కందకుండా మాయమైపోయింది. ఆ నగరంలో ఉన్న సౌధకుడ్యాల ధవళ కాంతుల్లో మునుగుతూ పట్టణంలోకి వంకర టింకర్లగా ఆ రోడ్డు దూసుకుపోయి మళ్లీ పట్టణాని కల్లంత దూరంలో కనిపించింది. పచ్చని పొలాల్లోని ధవళరేఖ మాదిరిగా అక్కణ్ణుంచి ఎత్తుకు పోయి పోయి, ఆ రోడ్డు అంబరచుంబి శిఖరాగ్ర విలసితాలైన 'స్లీమెవిబ్లూమ్' పర్వత పాదపీఠం దగ్గర ఆగిపోయింది.

కానీ నా మిత్రుణ్ణి ముగ్ధుణ్ణిగా చేసింది ఆ ప్రకృతి సౌందర్య దృశ్యం కాదు. ఆ నగరాలంకార శోభ లతణ్ణి పరవశుణ్ణిగా చేసినై. మాకు కుడి ప్రక్కగా ఉన్న ఆ పురాతన మఠశిధిల ప్రదేశాన్నుంచీ, పట్టణాని కెడమవైపుగా రోడ్డువెంబడున్న ఆ పర్ణకుటీరాల వరకుకూడా ఒకే ఒకరకమైన దృశ్యం. ఆ నదిబడ్డుపై ఉన్న నల్లని ఆ చెట్లగుండా

చిత్రవర్ణశోభితాలైన కాంతులు వస్తున్నయ్. అనేక సౌధాలమీద ధ్వజపటాలు గాలిలో రెపరెపలాడు తున్నయ్. ప్రతిసౌధకుడ్యాలు, గవాక్షాలూ, చిత్రపటాల్తో, స్వరూపాల్తో, దివ్యకాంతులు వెదజల్లే దీపకళికల్తో అలంకరింపబడ్డయ్. బజార్లన్నీ, నిరీక్షించే జనంతో నిండి ఉన్నయ్. ఆ సరంబీలమీద వ్రాయబడ్డ వ్రాతలు వాళ్ళ నిరీక్షణావస రాన్ని స్పష్టంచేస్తున్నయ్. రాజమార్గానికిపోయే దారికడ్డంగా "వెనీతే ఎక్జుల్ తేమున్ దొమినో" అను గీతం, లిఖింపబడ్డ ఒక ఆర్చి గోచ రించింది. దానిక్రిందగా మేం వెళ్ళాం. మరొకచోట రోడ్డు కడ్డంగా దాని క్రిందగాపోయే ఆ జేసు కభివందనార్థంగా "సర్వేశ్వరుని పేరట వేంచేయువారు ఆశీర్వదింపబడినవారు" అని వ్రాయబడ్డ మరో ఆర్చి గోచరించింది.

"ఆ ఆర్చిలమీద వ్రాయబడ్డ అక్షరాలకు వాళ్ళ కర్థం తెలుసా ?" అని నా సాగ్జన్ మిత్రుడు రోడ్డువెంబడి పోతున్నప్పుడు నన్నడిగాడు.

"నెత్తిమీద ఉత్తరీయం మాదిరిగా శాలవా వేసుకొని, చేతిలో జపమాల్తో అక్కణ్ణుంచున్న ఆ వృద్ధవనితను చూచావా?" అని నేను సమాధానంగా అడిగా.

"వాళ్ళంతా చేతుల్లో జపమాలల్ని పట్టుకొనే ఉన్నారు, అం దులో నీవుచెప్పే దెవర్నిగురించి?" అని అత డన్నాడు.

'లోర్డస్' మాతయొక్క ధ్వజపటం వైపు నిశ్చలధ్యానంతో చూస్తూ జపమాలస్తోత్రం చెవుతూ నిలబడున్న ఆ బలిష్టురాలైన గృహిణిని చూపించా.

"నీ వడిగే ప్రశ్నకు సూటైన, సరైన జవాబు కావాలంటే ఆమె దగ్గరికిపోయి, ఆ వ్రాతల కర్థం తెలుసునో ? తెలియదో ? అడుగు ! నీ వామెను ప్రశ్నించబోయే ముందు, నీ జీవితభీమాపాలసీ సక్రమంగా ఉందో లేదో బాగా ఆలోచించుకో! ఆమెలో దైవభక్తిని నీవు శంకించి, ఆమెను అవమానిస్తున్నా వని అనుకొంటుంది. నీవు విద్యా సంగ్రహ

ణంలో చదువుకోకుండా వదలిపెట్టిన విషయాలన్నింటినీ ఆమె నీకు నేర్పి మరీ పంపుతుంది" అని అతడితో అన్నా.

ఆ విషయాన్ని గూర్చి తెలుసుకుంటానికి కొంతకాలం వేచియుండాలని అతడు నిశ్చయించుకొన్నాడు. ఆరోజున జరిగిన సంఘటనలాతనికి త్వరలోనే ఆ విషయానికి సంబంధించిన అంశాలు ఒకటి వెంబడి ఒకటిగా స్పష్టం చేసినై.

ఏ గుడినుండి దివ్యసత్ప్రసాద ప్రదక్షిణ బయలుదేర నున్నదో ఆ దేవాలయానికి ప్రయాణమయ్యాం.

పీఠముమీదనున్న దేవమందసము నుండి దివ్య అప్పమును దీసి సత్ప్రసాద పాత్రములోనుంచి, ఆ పాత్రమును చర్చి కవాటం దగ్గరికి తీసుకవచ్చారు. ఆ జనసమూహం లోంచి ఆయన్ని దర్శించిన భక్తులంతా అత్యంతగౌరవ ప్రపత్తుల్తో ఆయన ముందు మోకరించారు.

గురువులు పవిత్రమైన దుస్తులు ధరించుకొని ఆయనయందు భక్తి గౌరవాలూ వినయ విధేయతలూ గల జన సమూహం గుండా ఆయనను మోసుకొంటూ బ్రహ్మాండమైన జైత్రయాత్ర కాయనకు మహా ప్రస్థానం సాగించారు. అందరూ అక్కణ్ణే ఉన్నారు. ఆయనకు ముందు పూలరేకులు చల్లుకొంటూ, ఆయనకు అత్యంత ప్రియులైన పసిబిడ్డలు పరుగులు తీశారు. జేసునాథుని పవిత్రమాతైన మరియమాతకు తా మంకితమైనట్లుగా తెలిపే నీలి దుస్తులు ధరించి, నెత్తిమీద తెల్లని ముసుగుల్తో మరియమాత ప్రేమ పుత్రులు కొందరు వచ్చారు. వాళ్ళ వెనకాల ఆ నగరానికి సంబంధించిన ఇతర్లు కొందరున్నారు. ఆ నడిచే ప్రతి స్త్రీ ప్రతి పురుషుడూ తమ కా రోజున కల్గిన గౌరవ స్థానానికి గర్వంతో ఉన్నారు.

ఆ ఊరేగింపు బ్రహ్మాండంగా ఉంది. వాటి మధ్యగుండా వచ్చిపోతున్న జేసు గౌరవార్థం చేసిన గృహాలంకరణం ఆ ఉత్సవంలో మరింత ఆకర్షణీయంగా ఉంది. అక్కడ దక్కడా ఏ ఒకటో అరో తప్ప అన్ని గృహాలూ బాగా అలంకరింపబడ్డవి. ప్రతి వీథిలో ప్రతి గృహం

అలంకరింపబడ్డది. ఈ గృహా లన్నింటిలోకి ఒక గృహం నా మన స్సులో అచ్చు గ్రుద్దుకుపోయింది. రెండు కిటికీలు, ఒక కవాటం ఉన్న పూరిగుడిసె అది. ఆ గృహ ద్వారంలో మన మరియమాతకోసం ఒక పీఠం అమర్చబడి ఉంది. ఆ ఇంట్లో పచ్చని ఆకులూ, అడవిమొక్కలూ బాగా అమర్చబడి ఉన్నయ్. ఆ గృహ ద్వారం ముందు మరియమాత స్వరూపం నిలచుంది. ధూప కలశం నుండి బైలుదేరిన పరిమళం ఆ వీధి నిండా వ్యాపించింది.

ఆ స్వరూపం నుంచి స్వర్ణకాంతులు ప్రసరిస్తున్నయ్. తమ ఇంటి బైట శిలాఫలకాల మీద మోకరించివున్న ఆ వృద్ధ దంపతుల హృద యాల్లో ప్రకాశించే స్వర్ణకాంతుల కన్నా ఈ స్వర్ణకాంతు లేమంత ప్రకాశవంతాలు కావు. సమస్తం మరచి, ఆ వృద్ధ దంపతులు గౌరవ భావాల్తో తమ ఎదుటున్న రాజరాజైన జేసుకు వందనం చేసారు. ఆ వృద్ధ గృహిణి భక్త్యావేశంతో ఉంది. ఒక్కసారామె తన గుండె కొట్టు కొంటూ, తన ఫాలభాగం రోడ్డుమీదున్న రాళ్ళకు తగిలేటట్లు వంగి వందనా లర్పిస్తుంది. మరో మారు చేతులు పైకి చూపుతూ ఆ జేసును తప్ప మరేమి చూడ్లేని పరశత్వంతో, తన హృదయంలోని అనురాగ వాహిని పొంగి పొరలేటట్లుగా, పెద్దగా ఆయనకు స్తోత్రాలు చెల్లిస్తుంది. ఆమె నేత్రద్వయం నుంచి సంతతాశ్రుధార బైలుదేరింది. ఆమె హృద యంలో భగవంతుని వరప్రసాదము ఒక మధురగానం చేస్తున్నందున, ఆమె కళ్ళనుండి ప్రవహించేవి ఆనందాశ్రువులే !

ఆ పవిత్రహృదయం జేసునాధుని శిష్యులకాలంలో ఉండియుండి "నజరెత్ జేసుప్రభువు పోతున్నాడు" అన్నమాటలు వినవలసిన అవ సరం లేదు. లేక జూదయాదేశంలో ఉండియుండి ఆ జేసుప్రభువు పవిత్ర స్థలంనుంచి నిర్గమించేటప్పుడు ఆయన్ని దర్శించడానికి తోసుకొని వచ్చిన జనసమూహాన్ని చూడవలసిన అగత్యత అంతకు ముందేలేదు. జెరికో రోడ్డుప్రక్కన కూర్చొని "ఆయనెవరు?" అని అడిగి "నజరెత్ జేసుప్రభువు నిర్గమిస్తున్నాడు" అన్న సమాధానం పొందిన అంధుడి మాదిరిగా అడిగి తెలుసుకునే అవసరమున్నూ ఆమెకులేదు. జేసుపాదాల దగ్గరికి తీసుకురాబడి, దృష్టిలాభం కోసం ఆయన పవిత్రహస్తస్పర్శ

వాంఛించే అవసరం కూడా ఆమెకు లేదు. ఇతర్లను అడిగి తెలుసుకోకుండానే, జేసు నిర్గమిస్తున్న సంగతి ఆమెకు తెలుసు. ఎందుకంటే ? ఆమెయాత్మ సృష్టింపబడినప్పుడే, ఆయన పవిత్రహస్తస్పర్శ దానికి లభించింది. ఆయన పవిత్రహస్తస్పర్శ ఆమెయాత్మకు కల్గిన నాటినుంచీ నేటిదాకా ఎన్నడూ ఆమె జేసును విడనాడలేదు. అంతేకాదు. ఆ పవిత్రమైన ఐర్లండు దేశంలో ఆనాడు జేసు ప్రయాణం చేస్తునాడు. అక్కాలమున జేసునాధుని చూచిన గలిలేయులు ఎంతగాఢంగా ప్రేమించిరో, ఆమెయును జేసును అంతగాఢంగా ప్రేమించిది.

మే మా గృహ ద్వారంగుండా నిర్గమించేటప్పుడు, నా సాగ్జను మిత్రుడి చూపు ల్నొకసారి పరికించా. అక్కడ మోకరించి వున్న ఆ వనితయొక్క ప్రేమపూర్వకమైన అనన్య కవితా వాచాలత్వం ఆ వీధి వీధంతా నిండిపోయింది.

తనలో వున్న ఆవేశాన్ని బైటికి వెల్లడించే మనస్తత్వం కలవాడు కాదు నా మిత్రుడు. ఆయనదృష్టి ఎట్టెదుటగా ఉన్న జేసుపై లగ్నమైఉంది. బాహాటంగానే, సిగ్గూ ఎగ్గూ లేకుండా ఏడుస్తున్నాడు.

"ఇటువంటిది నే నెన్నడూచూడ్లేదు. విశ్వాసం ! అది విశ్వాసం కాదు. జేసునాధుడు వాళ్ళకు ప్రసాదించిన దివ్యదర్శనమది !" అని నా మిత్రుడు తర్వాత చెప్పాడు.

బ్రహ్మాండమైన ఊరేగింపుతో, ఆయన అనుచరులైన వాళ్ళ ప్రేమగీతాల ధ్వనులమధ్య జేసుప్రభువు వీధులగుండా మహాప్రస్థానం చేసాడు. ప్రతి గవాక్షంలో ఆయన గౌరవార్థం వెలిగించిన దీపకళికలు దివ్యజ్యోతులు చిమ్ముతున్నయ్. ప్రతి గృహం ఆయన పటమో, స్వరూపమో ఉంచబడ్డ పీఠంతో అలరారుతూంది. సెయింట్ జోసఫ్‌కు అక్కడ స్థానముంది. సేక్రెడ్ హార్టుకు స్థానముంది. సెయింట్ బ్రిజిడ్‌కు స్థానముంది. పెద్దగడ్డంతో కూడుకొన్న సెయింట్ పాట్రిక్‌కూ, అందరికీ అక్కడ స్థానం ఉంది.

మే మొక తెల్లని దైవపీఠందగ్గరికి వచ్చాం. అక్కడ పూలు తెల్లగా ఉన్నయ్. అలంకారాలూ తెల్లటివే ! అక్కడున్న గుడారం

కూడా తెల్లటిదే. ఇక్కడ మన జేసునాథుడు కొంతకాలం విశ్రమించి, తనముందుగా మోకరించిన వేలాది ప్రజల కంఠాల్లోనుంచి మేఘగర్జన్లాగా వినిపించే దైవస్తోత్రాలన్నీ ఆలకిస్తాడు. తర్వాత కొండలోయల్లోని ప్రశాంతతను భగ్నం చేసుకుంటూ వాటిగుండా ప్రయాణం సాగిస్తాడు. అటుతర్వాత స్నిగ్ధనీలారణ్యాల్లో, ఎత్తుగా ఉన్న దైవపీఠం మీద ఆయన్ని స్థాపిస్తారు. ఆయనకోసం ప్రాణాలు బలిపెట్టిన త్యాగమూర్తుల కాదర్శప్రాయంగా ఆ రక్త దైవపీఠం ఉంది.

అట్లాగే, వాళ్ళు ప్రదక్షిణమున పట్టణ మంతయు తిరిగి ప్రతి వ్యక్తికీ ఆశీర్వాదాన్ని పాలింపమని ప్రార్థిస్తూ, జేసునాథుని వెంబడిస్తారు. పూర్వం మహోన్నంగా విరాజిల్లి ఇప్పుడు శిధిలావశేషమైపోయిన సిస్టెర్సియన్ మఠ శిఖరచ్ఛాయల్లో, ఒకా నొకప్పుడు ప్రకాశించి నట్లుగా, నేడు తన మహోన్నత శిఖరాగ్రచ్ఛాయల్లో ఉన్న గృహా రాజాల్తో కూడిన ఆయన నివాస గృహానికి వంతెనమీదగా వాళ్ళంతా మళ్ళీ ఆయన్ననుసరిస్తారు.

జేసు గుడిలో తిరుగ సింహాసనాసీనుడై సత్ప్రసాద పాత్రము నుండి తనముందు మోకరించి ఉన్న అసంఖ్యాక ప్రజానీకంపై తన కరుణార్ద్రదృక్కులు ప్రసరిస్తాడు. అంత పెద్ద చర్చిలోనూ, అక్కడికి వచ్చిన ప్రజాసమూహంలో ఏ పదోవంతు మంది మాత్రమే పడతారు. ఆ అశేష ప్రజానీకంనుంచి వచ్చే దైవ స్తోత్రాలు ఆయన ఆలకిస్తాడు. ఉన్నట్లుండి ఆశీర్వాద ఘంటారావం వినబడ్తుంది. అంతా ప్రశాంతంగా ఉంటారు. గురువుహస్తాలచే ఎత్తబడి, జేసునాథుడు తన ప్రజల్ని ఆశీర్వదిస్తాడు. అక్కడున్న ప్రజల్నందర్నీ మైకంలో ముంచేసే టట్లుగా సంగీతపెట్టె మేఘ గంభీర గర్జనచేస్తుంది. "మనం సర్వదా జేసుప్రభువుని సమాదరిద్దాం" ఓహో! "కలకాలం, కలకాలం" అని ప్రజాసమూహం ఆహ్లాదంగా గానంచేస్తుంది. ఐర్లండు గమ్యస్థానం అట్లాగే కలకాలం ఉండాలి!

జూదయా దేశములో గుండా నడచిపోయేటప్పుడు ప్రజలు చేసే జోహార్లకు, మన జేసుప్రభువు హృదయం కదుల్తే, ప్రాణాపాయమును

లెక్కింపక నిందవమానమును భరించి ఆయన ఒక్కడే కాల్వరీ ఎక్కిపోతుండగా, మౌనంగా నిలబడిఉన్న వాళ్ళ జోహార్లకే హృదయం కరిగిపోతే, ఐరిష్‌నగరంలో ఆయనకు స్వాగతమిచ్చే అనురాగం పైకి ఉబికి వచ్చినప్పుడు, ఆయన పవిత్రహృదయం ఇంకా ఎంతగా ఆనందం పొంది ఉంటుంది ! వాళ్ళాయనకు చూపించే ప్రేమానురాగాలు తప్త కాంచనంలాంటివి. అనేక కఠినాగ్ని పరీక్షలకు నిలిచి బలిష్టమై పవిత్రమైన అనురాగం వారిది !

సాయంకాలం గృహోన్ముఖులౌతున్న జనసమూహంగుండా మేం ప్రయాణంచేస్తున్నప్పుడు, నా సాగ్జను మిత్రుడేమీ మాట్లాడకుండ మౌనంగా బండిలో కూర్చున్నాడు. మేం ప్రయాణం చేస్తున్నప్పుడు, ఆ జనసమూహం మాట్లాడుకొనే మాటలు మాచెవుల్లో పడుతున్నయ్. ఎవరినోట విన్నా, ఆ బ్రహ్మాండమైన ఊరేగింపును గురించిన ప్రశంసా వాక్యాలే ! మేం మెల్లగా ఎక్కిపోతున్న కొండపై మా ముందప్పుడే కలుసుకొన్న రెండు ముఠాలు చూపించి, "నీ వది విన్నావా?" అని హఠాత్తుగా సాగ్జను మిత్రుడు ప్రశ్నించాడు.

మొదటి ముఠాలో ఒక అరడజనుమంది వృద్ధమాతలున్నారు. వాళ్ళ కన్నివిధాలా సరిపోయిన దుస్తులు ధరించిఉన్నారు. వాళ్ళనెత్తిపై ధరించిన తెల్లటోపీలుచూస్తే, కతోలిక్ బ్రిట్టనీకి సంబంధించిన కెల్టు సోదరీ మణులు గుర్తుకు వచ్చారు. వడి దుడుకుల్లేకుండా నెమ్మదిగా ప్రశాంతంగా పోయే వాళ్ళనడకల్ని, త్వరత్వరగా తేలిక అడుగులు వెసుకొంటూ వెళ్ళే రెండోముఠా అతిక్రమించి పోయింది. ఈ రెండో ముఠాలో తండ్రి తల్లి, నల్గురు పిల్లలూ ఉన్నారు. అందరికన్నా చిన్న పిల్లవయస్సు ఆరు సంవత్సరాలుంటై. ఆమె తెల్లని దుస్తులు ధరించింది. చేతిలో ఒక బుట్టవుంది.

వీళ్ళ అభివందన వచనాలే గాఢసమాధిలోఉన్న నా సాగ్జను మిత్రుణ్ణి మేల్కొల్పినై. "బలే ! నీవు నిజంగా చాలా అదృష్టవంతురాలివి. మరియమాత పాదాలు కందిపోకుండా నడిచిరావడానికి మార్గ

మంతా పూలతో నింపివేస్తున్నావు." అని, మొదటి గుంపులోని ఒక వృద్ధమాత ఆ చిన్నపిల్లనుచూచి పలికింది.

"ఆమె ప్రియకుమారుడైన జేసును చూచినట్లుగానే మనం ఆమెనుగూడా చూడగల్గితే!" అని రెండో వృద్ధమాత స్పష్టాస్పష్టంగా స్వగతంగా పల్కింది. "ఓ హెూ హెూ! బలేదానివిలే! నీబోటి వాళ్ళకు ప్రీతికలిగించడం నిజంగా చాలా కష్టం! నీవు జేసును చూడ్లేదూ? ఆయనముందు మరియమాత నడిచిపోతున్న సంగతి నీకు తెలియదూ? లేకపోతే ఆమె ఇంకా ఎక్కడుంటుందను కొన్నావ్? ఇంకా నీకు తనివి తీరలేదన్నమాట!" అని మొదటి వృద్ధమాత మంచి ఛలోక్తిగా సమాధానం చెప్పింది.

మేం వాళ్ళదగ్గరికి పోయేటప్పటికి అందరూ పైకి చూచారు. మేం వాళ్ళకు చెప్పిన అభివందనాలకు వెంటనే సమాధానంగా, భిడియంతో, తొక్కుపల్కుల్తో "జేసుప్రభువు నిన్నాశీర్వదించుగాక!" అని చిన్నపిల్లతో జలకణాలుగా ప్రారంభించిన ప్రత్యభివందనాలు, ఒక మహా ప్రవాహమై, తుట్టతుదకు అందరికన్నా వృద్ధురాలైన మాతృదేవి దగ్గరికిపోయి ఆగినై. "జేసునాధుని ఆశీర్వాదం మీకు ఫలించుగాక!" అని చిట్టచివరగా ఆ వృద్ధమాత పలికిన అభివందన వచనాలు మధుర మధురంగా మా హృదయాల్లో చాలా దూరం వరకూ ప్రతిధ్వనించినై.

మేం, వాళ్ళను జేసుకూ, దేవమాతకూ వదలి చాలా దూరంలో మైదానంలో అస్తమయ సూర్యకిరణాల్లో మునిగి ఉన్న మా ఇంటిమొగం పట్టాం.

"ఈ ప్రజ నిజంగా జేసు సమక్షంలో నివసిస్తున్నారు. పవిత్రో ద్రేకాల్తో, ముద్దుల మూటగట్టే ఆ చిన్నపిల్ల వదనారవిందం చూసావా? ఆమె దారితప్పివచ్చిన దేవదూత మాదిరిగా ఉంది" అని నా సొగ్గను మిత్రుడు తన మధుర స్మృతిని నాకు విశదం చేసాడు.

"ఔను! ఆమె ఉన్న వాతావరణం మంచిది." అని నేను సమాధానంగా చెప్పాను.

"అందులో ఏ మాత్రం సందేహంలేదు. నే నీ నాడు చూచిన ఆ దైవభక్తి విశ్వాసాలు నాకొక నిగూఢ రహస్యాన్ని వెల్లడించినై. నిష్కళంకమైన ప్రేమ, భయాన్నెట్లు తృణీకరిస్తుందో ఏనాడూ తెలుసుకోలేనంత స్పష్టంగా నే నీ నాడు తెలుసుకొన్నా. గాఢమైన విశ్వాసంతో తమ జీవితాల్ని అంకితంచేసిన వీరికి నిజంగా జేసునాథుడు తండ్రి. ప్రియతముడు. స్వర్గంలో ఒక మూల ఒదిగి కూర్చొని తన ప్రజలమధ్య సంచరిస్తున్న జేసునాథుణ్ణి నేత్రానందంగా దర్శిస్తున్నట్టుగా అనిపించిందీరోజు. ఆహా ఐరిష్‌జాతి ఎట్టి దొడ్డజాతి! దాని ఉత్తమ జీవితము ఇతరులకు ఆశ్చర్యమును కలిగింపక మానదు. జేసుస్వామీ! వాళ్ళ నాశీర్వదించు!" అని అతడన్నాడు.

నేను "ఆమెన్" అన్నా.

తొమ్మిదవ ప్రకరణము

# ఐర్లండు కన్యాస్త్రీలు



కన్యాస్త్రీల ఋషి జీవితాలు తిరుసభ పవిత్రత్వానికి ప్రబల తార్కాణాలు. వారు ఎట్టి విపత్కర పరిస్థితులనైనను ఎదుర్కొందురే కాని, పవిత్రమార్గమునుండి వైదొలగిపోరు. తమ పవిత్రతా పరిరక్షణార్థము తమ ప్రాణములనుసహా ఒడ్డుటకు వెనుదీయని మఠకన్యకల మహత్తర త్యాగజీవితములు సత్యతిరుసభ పావనత్వమునకు ప్రబల తార్కాణములు. " ఓ మరియమాతా! నీ ప్రేమపుత్రికల్లో నీ అత్యద్భుత రూపాన్ని మేము దర్శిస్తున్నాం. వాళ్ళ హృదయాలు నిష్కళంకాలు, వాళ్ళ మనస్సులు స్వచ్ఛకాంతిమంతాలు" అని ప్రపంచ విఖ్యాతిగడించిన 'ఆబ్రిడీవెరి' (Aubrey Devere) వాళ్ళను ప్రశంసించాడు. స్వర్గరాజ్ఞియైన మరియమాత కన్యాస్త్రీలు వీళ్ళు. వీళ్ళు జేసుస్వామికి ప్రేమాస్పదమైన పుత్రికలు. వీళ్ళ పవిత్ర మఠాలద్వారా మానవజాతి పరిపూర్ణత్వాన్ని పొందుతుంది. మానవజాతి హృదయాలూ, జీవితాలూ వీళ్ళ గుడారాల్లో వెలిగే దీపకళికలవల్ల మరింత తేజోవంతాలైతయ్. వీళ్ళు ఐహిక సుఖాలన్నీ పరిత్యజించి జేసునాథుడి సూక్తుల్లో ఆయన మార్గాన్నే అనుసరిస్తారు. విశ్వాసం, అనురాగం అనే రెండు కళ్ళాల్ని చేతుల్లో పట్టుకొని వీళ్ళు తమ జీవితాన్ని నడుపుకు పోతారు. అత్యద్భుతమైన కథోలిక్ విశ్వాసానికి ఈ మరియమాత ప్రియపుత్రికలు ప్రత్యక్ష తార్కాణాలు. వీళ్ళు జేసునాథుని సన్నిహితానుచరిణులు. సాత్త్వికహృదయలు, దరిద్రానికూడా వెరవని దృఢసంకల్పలు.

దేవునికీ, మానవుడికీ దాసురాండ్రైన వీళ్ళ హృదయాల్లో స్వార్థమనేది కించిత్తుకూడా లేదు. కష్టాల్తో, విషాదాల్తో, దారిద్రంతో క్రుంగి కూలారిన మానవజాతి శ్రేయస్సుకు వీళ్ళు తమ జీవితాల్ని హృదయపూర్వకంగా అంకితంజేసి అవ్యాజానురాగంతో, శక్తిసామర్థ్యాలనూ, కాలాన్నీ త్యాగంచేస్తున్నారు.

"నజరెత్" గృహమునుబోలిన మఠాల్లో తర్ఫీదుపొంది జేసు ప్రభువు మాతైన మరియమాత నాదర్శంగా తమ జీవితాన్ని సరిదిద్దుకోని ఇహలోకాన్ని చూస్తూ, పరలోకాన్నితలుస్తూ వీళ్ళు తమ జీవితాలు గడుపుతున్నారు. పవిత్రమార్గాల్లో శిక్షణబొంది "నిన్ను నీవు ప్రేమించుకొనేటట్లుగానే, నీ ఇరుగు పొరుగు వాళ్ళను ప్రేమించు!" అని చెప్పిన జేసుప్రభువు అనుచర్లుగా అర్హతను సంపాదించుకోడానికి వాళ్లు ప్రతిదినం ప్రయత్నిస్తున్నారు. ఈ జేసు సుభాషితానికి పరవశులై జేసునాధుడి ప్రియులైన వీళ్ళు దానగుణంతో దరిద్రతా, విధేయతా, విరక్తత్వమూ అనే ఆ ధర్మత్రయాన్ని లక్ష్యంగా పెట్టుకొని దేవుడికీ, మానవుడికీ సేవచేయడానికి సిద్ధంగా ఉన్నారు.

వాళ్ళ దరిద్రతాదర్శం వాళ్ళను దరిద్రులకూ, అవసరమైన వాళ్ళకూ ఎల్లప్పుడూ సన్నిహితులుగా ఉంచుతుంది. వాళ్ళ పరిశుద్ధతాదర్శం వాళ్ళను ఎల్లప్పుడూ జేసు తిరుహృదయానికీ, మరియమాత పవిత్రహృదయానికీ సన్నిహితాలుగా ఉండేటట్లు చేస్తుంది.

వాళ్ళ విధేయతాదర్శం వాళ్ళను సర్వశక్తి సమర్థుడైన భగవంతుడి కెల్లప్పుడూ సన్నిహితులుగా ఉండేటట్లు చేస్తుంది.

'సెయింట్ బ్రిజిడ్' కాలంనుంచీ, ఐరిష్‌గృహాల్లోనుంచి నందలాదిగా ప్రతి తరంలోనూ కన్యలు జేసునాధుడికి సేవచేస్తూ ఆయన కోసరమే, మఠంలో తమ జీవితాలు అంకితం చేయడానికి, వాళ్ళ హృదయాల్లో జేసునాధుడి పిలుపు వినబడగానే బైలుదేరి వస్తున్నారు.

ఉన్నతాదర్శాల్తో, ఉదారప్రవర్తనతో కూడిన జేసు సైన్యమయిన ఈ కన్యాస్త్రీలు ఐర్లండును ఆకాశపథంలోకి ఎత్తగల్గారంటే అది దృఢవిశ్వాసముగల ఐరిష్ మాతల పావనజీవితాల, కతోలికు వాతావరణంతో నిండిన గృహజీవితాల పర్యవసానమే,

ఈ ఉన్నతాదర్శాలు కల్గిన కన్యాస్త్రీలు చురుకైన తమ వ్రేళ్ళతో, క్రమశిక్షణ పొందిన మనస్సుల్తో, మానవుడికి జేసునాధుడు పంపిన సందేశాన్ని అందరూ చదవకలిగేటట్లు దివ్యజ్యోతులు వెద

జల్లే పవిత్ర హృదయాల్తో, ప్రశాంతంగా ప్రతి దినం కృషి చేస్తారు. ప్రేమ వారికి రక్ష! "ప్రతి వాణ్ణీ ప్రేమించు. దయామయుడైన భగవంతుణ్ణి ప్రేమించు. అప్పుడంతా సక్రమంగా జరిగిపోతుంది". ఇవి, అజితుడై ఉండే ఏకైక రాజైన ఆ జేసునాధుడి సన్నిధికి పోబోతూ మరణోన్ముఖురాలైన మఠ స్థాపకురాలు తన జ్ఞానబిడ్డలతో చిట్ట చివరగా పల్కిన మాటలు.

వారి జీవితాల్తో సంపర్కం కల్గిన ప్రతి జీవితం వారి జీవిత ప్రభావాల్ని అనుభవింపక తప్పదు. ఉదాహరణకి, కన్యాస్త్రీల సభలో కన్యాస్త్రీలకు దాని స్థాపకురాలు పల్కిన సుభాషితాల్లో ఎంత ప్రత్యక్ష ధర్మసంపద ఉన్నదో చూడండి!

"ప్రశాంతంగా మాట్లాడు. పెద్దోల్ల గౌరవించు; తక్కువ స్థానాన్నే కోరుకో; నీకిచ్చిన వాటిల్లో ఎందుకూ పనికిరాదన్న దాన్నే స్వీకరించు; అడక్క ముందే అభిప్రాయం చెప్పొద్దు; ఊహల్లో కూడా ఎవర్నీ పరీక్షించవద్దు; తీర్మానించవద్దు; ఎప్పుడూ వ్యతిరేకించవద్దు; క్లుప్తంగా ఎప్పుడూ జవాబు చెప్పవద్దు; నీతో అంగీకరించలేని వాళ్ళ మీద ప్రత్యేక శ్రద్ధ చూపించు; ప్రతి రోజూ నీ వాహారం తీసుకొనేటప్పుడు ఇంద్రియ నిగ్రహాన్ని పాటించు;"

ఈ సుభాషితాన్ని సర్వదా అంగీకరించిన ఒక మహాకవి నిజంగా ఈ విధంగా వ్రాయవచ్చు. "ఆమె మనస్సు ఒక కాంతి ప్రవాహం, ఆమె హృదయం ఒక అనురాగ సరస్సు."

ఆమె ఎల్లప్పుడూ సంతోషంగానే ఉంటుంది. ఆ దేశంలో వున్న ప్రతి మఠంలోని కన్యాస్త్రీలల్లో కనపడే ఆనందోత్సాహాలే వాళ్ళ సంతోషానికి ప్రబల తార్కాణాలు. "మేం మఠంలో ప్రవేశించి కన్యాస్త్రీల ఉడుపులు వేసికొన్నప్పుడు, మా హృదయాలనూ, మంద హాసాల్నీ తీసి దూరంగా ఉంచామనకొన్నారా?" అని మేధావంతురాలైన ఒక మఠ స్థాపకురాలు "కన్యాస్త్రీ జీవితం నిస్సారమైంది" అని చిత్రించిన ఒక మనిషికి ఘాటుగా సమాధానం చెప్పింది.

వాళ్ళ కృషి ఫలితాలు దీన్లో ఉన్న సత్యాన్ని ఋజువుచేస్తయ్. ఇంతకు ముందు ఎందుకూ పనికిరాకుండా ఉన్న ఆ బీదల వసతిగృహం ఆనంద హృదయులైన కన్యాస్త్రీలు, తమ దర్శనంలో మధురంగా, యోగ్యంగా చేసారు. వాళ్ళ కంఠస్వరాలు, నిరాశాంధకారాన్ని పార దోలి, బికారి జీవి హృదయాన్ని ఒక క్రొత్త ధైర్యంతో నింపివేస్తయ్. నివాసయోగ్యంగా ఉన్న ఆ పాకాలన్నీ ఈ కన్యాస్త్రీలు అడుగు పెట్టిన వెంటనే వసతిగృహా లౌతయ్. ఆమె పవిత్ర హస్తస్పర్శతో, అలసి పోయిన ఈ ప్రపంచ నేత్రాలు తేజోవంతాలై ప్రకాశిస్తై. అలసి పోయిన ఆ నేత్రాలు, మరణకాలంలో మూతబడేంతవరకూ, తమతో పాటు జీవిస్తూ, తమకోసం దివ్యమైన ఉదార బుద్ధితో శ్రమిస్తూ ఉన్న ఆమెపై కృతజ్ఞతతో, ఆమె వైపే చూస్తుంటయ్.

ఉపాధ్యాయురాండ్రుగా వాళ్లు పరిశుద్ధతకు, నెమ్మదికీ, పవిత్రతకు, త్యాగానికీ ఆదర్శమూర్తులు. వేయి సంవత్సరాలకు పైగా వాళ్లు ఐరిష్ స్త్రీ జాతినంతా తర్ఫీదు చేస్తున్నారు. ఐరిష్ స్త్రీల హృదయాల్ని ఉన్నత భావాల్తో నింపుతున్నారంటే, ఏమీ ఆశ్చర్యకరమైన విషయంకాదు. పిల్లలమనస్సుల్ని దిద్దితీర్చడానికి వాళ్ళకు వాళ్లేసాటి. దీన్నందరూ అంగీకరించారు. గుర్తించారు. "నీ ఒక్కకుమార్తెనూ కన్యాస్త్రీలపాఠ శాల్లో ప్రవేశపెట్టడాని కెందుకట్లా ఉత్సాహపడుతున్నావ్?" అని ఒక ప్రొటెస్టాంటు పెద్దమనిషిని ఈ రచయిత అడిగితే, అతడు చెప్పిన సమా ధాన మిది. "నేను ఇంగ్లీషు పాదరీకుమారుణ్ణి. ఇంగ్లండులో ఉన్న ఒక పెద్దపాఠశాల్లో విద్య నభ్యసించా. నా భార్య అమెరికాలో ఒక సుప్రసిద్ధ కళాశాల్లో చదివింది. మే మిద్దరం కలసి ఒక నిశ్చయానికి వచ్చాం. ఆ నిశ్చయమేమిటంటే, మా బిడ్డ చదువు సంధ్యల్ని కతోలిక కన్యాస్త్రీ వద్ద తప్ప మరెవరి వద్దా నేర్పించగూడదనుకొన్నాం."

నారితప్పిపోయిన స్త్రీ తానుచేసిన పాపాలకు పశ్చాత్తప్తురాలై, ఎప్పుడు భగవంతుణ్ణి పాప పరిహారార్థం సమీపిస్తుందో, నిజమైన మాతృదేవి మాదిరిగా తిరుసభ, నిష్కళంకమైన తన బిడ్డలను కల్గిన

మతాన్ని కప్పుకొని ఆమెను పంపుతుంది. ఇక్కడ ఆమెకు మాతృవాత్సల్యంతో సోదరీ ప్రేమతో, స్వాగతం లభిస్తుందని తిరుసభకు తెలుసు. ప్రతి హృదయం జేసుతో సౌభ్రాతృత్వాంకిత మైందని కన్యాస్త్రీకి తెలుసు.

జీవితాన్ని సంరక్షించడం కన్యాస్త్రీ ముఖ్యధర్మం. ఆమె తర్ఫీదు కాలం పూర్తైన వెంటనే, తన జీవిత కృషి కుపక్రమిస్తుంది. అంటే స్వార్థాన్ని వదలి ఏకాంతానికి పోవడ మన్నమాట. కాని ఒక్కొక్కప్పుడు వాళ్ళకృషి ప్రపంచదృష్టిలో పడుతుంది. అప్పుడు ప్రపంచం తన రక్తారుణ కాంతుల్ని వాళ్ళపై ప్రసరిస్తుంది. వాళ్ళల్లో ఉన్న అనన్యమైన గుణాలికి మన ఈ ప్రాచీన మూర్ఖప్రపంచం తన మ మూలు ప్రకారం ఆశ్చర్యపడుతుంది. ఆ కాంతి ప్రసరణం ఏమైనప్పటికీ ఈ కన్యాస్త్రీల్ని సంభ్రమ చకితురాండ్రగా చేయదు. తమ ఏలికైన ఆ జేసునాథుని దివ్య కాంతినే సమారాధిస్తూ ఆయన కంఠ స్వరాన్ని మాత్రమే వింటూ, వీళ్ళు తమ కృషిలో ప్రశాంతగా నిమగ్నులై పోతారు.

అన్ని యుద్ధభూముల్లో వాళ్ళు రోజూ, గాయపడ్డ వాళ్ళకి చికిత్స చేస్తూ, చచ్చిపోయే వాళ్ళకి శాంతిని ప్రసాదిస్తూ, వైద్యశాలల్లో పని చేస్తున్నారు. వాళ్ళ ధైర్య సాహసగాథల్తో ప్రపంచం మారు మ్రోగి పోతున్నది. అనన్య సాధారణమైన వాళ్ళ సాహసాలకు కొందరు వాళ్ళను గౌరవిస్తున్నారు. ప్రపంచ మంతా ఆశ్చర్యంతో వాళ్ళ కృషిని పరికిస్తున్నది.

ఇదినాడు ప్రపంచానికి ఆశ్చర్యం కలిగించే క్రొత్త విషయం కాదు. ఫ్రాంకో ప్రష్యన్ యుద్ధంలో, టిప్పెరీ (Tipperary) కన్యాస్త్రీ చేసిన పనిచూడు! గాయపడ్డ వాళ్ళకు చికిత్స చేస్తూ, ఆమె చాలా మంది పడుకొని ఉన్నచోట, ఒక పెద్దబాంబు పడటం చూసింది. వెంటనే అక్కడికి పరుగెత్తుకుపోయి, పొగలు గ్రక్కుతున్న ఆ బాంబును, మురికి కాకుండా ముందర కట్టుకొనే వస్త్రంలో పెట్టుకొని ఒక సురక్షితమైన ప్రదేశానికి దాన్ని తీసుక వెళ్ళింది. తర్వాత దాన్ని దూరంగా విసిరేసి, నేలమీద పడుకొంది. కొద్దిక్షణాల్లోనె ఆ బాంబు బ్రహ్మాండమైన ధ్వని చేస్తూ బద్దలైంది. ఆమె ఏ మాత్రం గాయపడ

కుండా, అత్యద్భుతంగా ప్రమాదం నుంచి తప్పించుకొంది. సైన్యం మొత్తం ఆమె ధైర్యానికి మెచ్చుకోని గొప్పగా కొనియాడింది. సర్వ సైన్యాధిపతి ఆమెకు సైనిక వందనం అర్పించి ఘనంగా శ్లాఘించిన తర్వాత, ఆమె నల్లని గౌనుమీద తాను స్వయంగా గౌరవ పతాకాన్ని అలంకరించారు. వందనం చేస్తున్న సైనికుల ప్రశంసా వచనాలు ప్రతిశబ్దిస్తుంటే, ఆమె అవనత వదనంగా నిలబడి ఉంది. అప్పుడామె ఆ సర్వ సైన్యాధిపతి వైపు తిరిగి, నిగర్వంగా "సర్వసైన్యాధిపతీ! ఇక నాతో పని తీరిపోయింది కదా? ఎందుకంటే, నాకోసం ఎదురుచూసే గాయపడ్డ సైనికులకు త్వరగా పోయి చికిత్స చేయాలి", అని పలికింది. జేసు దర్శనం వల్ల లభించిన ప్రశాంతత వాళ్ళ కెప్పుడూ ఉంటుంది.

అమెరికా అంతర్యుద్ధ సమయంలో, రెండు పక్షాల సైన్యంలో గాయపడ్డవాళ్ళకి ఐరిష్ కన్యాస్త్రీలు పరిచర్యలు చేసారు. "టెన్నసీ" సైన్యానికి పరిచర్య చేసిన దేవదూత అని ఒక ఐరిష్ కన్యాస్త్రీ నేటికీ కీర్తి ప్రతిష్ఠల్తో విరాజిల్లుతుంది. అమెరికాలోని ఒక మహానగరంలో ఆమె గౌరవార్థం నిర్మించిన ఒక పెద్ద వైద్యశాల ఇప్పటికీ ఉంది.

క్రిమియా యుద్ధంలో మన సైనికులికి చికిత్స చేసిన 'సిస్టర్సు'కు అధికారిణిగా ఒక ఐరిష్ కన్యాస్త్రీ ఉన్నది వాళ్ళు సంకోచించేది వాళ్ళ విధి నిర్వహణ విషయంలో కాదు. విధి నిర్వహణ మంటే మృత్యువు నాహ్వానించడ మన్న మాట! చాలా మంది కన్యాస్త్రీలు తమ విధి నిర్వహణలో, ప్రాణాల్ని బలిపెట్టి, బాలక్లావా (Balaclava) పర్వతం పక్కనున్న సమాధుల్లో శాశ్వతంగా నిద్రించారు. వాళ్ళంత మహోదాత్తంగా ప్రవర్తించారు. మన సైన్యాలు 'సౌతాంప్టన్'కు తిరిగి వచ్చినప్పుడు, తనతో బాటు సైన్యాలకు ముందుగా నడిచి, మన జాతి వాళ్ళ కిచ్చిన ఘనస్వాగతంలో పాలు పంచుకోమని సర్వసైన్యాధికారి వాళ్ళను ప్రార్థించాడు.

వాళ్ళ కిటువంటి ప్రచారం సుతరాం గిట్టదు. వాళ్ళు తాము హృదయ పూర్వకంగా ప్రేమించిన మఠాలకు తిరిగి వెళ్లి, అక్కడ

ఎవరికీ తెలియకుండా, అసహాయులకూ, అనాథులకూ, దరిద్రులకూ సేవ చేసే దాకా, వాళ్ళ మనస్సులకేమాత్రం ఆనందం గాని, సంతృప్తి గాని లభింపదు.

ఇప్పుడు చెలరేగుతున్న మహా సంగ్రామంలో (1914-1918) ఈ కన్యాస్త్రీల అత్యద్భుత ధైర్య సాహసాలకు, బైటి ప్రపంచమంతా ఆశ్చర్యంగా నిరీక్షిస్తున్నది. యుద్ధభూమిలో వాళ్ళు చేసిన సేవ అనన్య దుర్లభం. ఇప్పుడు వాళ్ళ జీవితాలు నిస్సారవంతాలని అంటానికెవ్వడూ సాహసించడు. మన కన్యాస్త్రీల హృదయాల్లో సహజంగా ఉన్న ధీరోదాత్తమైన త్యాగం, ఆచరణయుతమైన పవిత్రతా, మొదలైన సుగుణాల్నీ, యుద్ధం, కేవలం బైటి ప్రపంచానికి వెల్లడిచేసే అవకాశం కల్పించింది. అంతే. శాంతి యుతంగా చిరకాలం నుంచీ వాళ్ళు చేసిన ఈ అనన్యమైన కృషినీ, చివరికి కథోలికుల్లో గూడా ఎంత మంది గుర్తించారు? ఉదహారణకు ఐర్లండు పశ్చిమంలో ఎక్కువ జనాభా గల జిల్లాల్లో వాళ్ళు చేసిన సేవను తీసుకో. అక్కడ ప్రజలకు కల్గిన దుర్భర స్థితిని పోగొట్టడానికి రాజనీతి ధురంధర్లూ, ఉన్నతోద్యోగులూ చాలా కాలం సత మతమైనారు. చిట్ట చివరికి వాళ్ళకేమీ పాలుబోక నిరాశ జెంది, అక్కడున్న ప్రజలంతా మరెక్కడికైనా వలస బోవటం తప్ప, ఆ ఉపద్రవాన్ని నివారించే ఉపాయం లేదని తేల్చివేశారు. నల్లని దుస్తులు ధరించిన కొందరు కన్యాస్త్రీలు, కథోలిక్కు విశ్వాసం సహాయంగా, ఆ ప్రదేశాలకు పోయారు. ప్రతి వాళ్ళూ, వారి కృషివల్ల లేశం గూడా ప్రయోజనం కలగదని జ్యోతిషం చెప్పారు. "అది భగవంతుడి పని! భగవంతుడు తప్పకుండా తన ప్రజలికి సహాయం చేయాలి" అన్నదే ఆ కన్యాస్త్రీల నాయకురాలి గంభీరమైన సమాధానం. వాళ్ళ కృషికి దేవుడు సహాయం చేసాడు. అక్కడున్న వాళ్లందరికీ పని గల్పించే ఒక పెద్ద ఉన్ని యంత్రాగారం నేడక్కడుంది. ఈ కన్యాస్త్రీలు అక్కడున్న వాళ్ళతో సహకరించి, వాళ్ళకు సర్వవిధాలా సహాయం చేసారు. వాళ్ళ కృషి ఫలితంగానే, ఒకప్పుడు దుర్భర దారిద్ర్యావస్థలో, దైన్యంలో మునిగి ఉన్న అక్కడి ప్రజానీకం, నేడు సర్వసమృద్ధితో, మందహాసవదనంగా ఉంది.

కన్యాస్త్రీలలో ఎల్లప్పుడూ అటువంటి ఉత్సాహం ఉంటుంది. మన సహోదరీమణు లంతా, ఒక విశాలమైన హృదయంతో, రెండే రెండు చేతుల్తో పుట్టినవాళ్లే. ఐనప్పటికీ నిర్భయంగా దారిద్ర్యాన్నీ, వక్రతా గుణాన్నీ, భయంకరమైన ప్రతిఘటల్నీ, ఎదుర్కొని కష్టా లన్నింటినీ జయించారు.

యోఘల్ (Youghal) దరిద్రంతో క్రుంగి కూలారిపోతున్నది. జేసుప్రభువు కన్యాస్త్రీలు ఇక్కడికి వచ్చి, ఒక లేసుఫ్యాక్టరీని ప్రారంభించారు. కొద్ది కాలంలో ఆ యంత్రాగారం సంవత్సరానికి 2 వేల పౌండ్ల జీతాలు చెల్లించగల శక్తి కలిగిం దయింది. ఆ యంత్రాగారం బాగా అభివృద్ధికి వచ్చిన తర్వాత, అక్కడ శ్రామికు లందర్నీ పిలిచి, సహకార పద్ధతి మీద పని చేసుకొండని వాళ్ళకు దా న్నప్పగించారు.

ఈ విధంగానే వాళ్ళు చాలా నగరాల్లో చేసారు. ఎందుకంటే, మరియమాత ప్రియ పుత్రికలైన ఈ కన్యాస్త్రీలు ధన వ్యామోహితులు కారు. వాళ్ళు ఆ భగవంతుడి వద్ద తమ సంపాదనంతా నివేపిస్తారు. వాళ్ళెప్పుడూ తమ పవిత్ర మరియమాత పాదపీఠం దగ్గరగా, జేసుప్రభు వెదుట, ఏకాంతంగా కూర్చొని మధురానందాన్ని పొందుతుంటారు.

వాళ్ళది అని చెప్పబడే వస్తు వొక్కటే. అదేమిటంటే, ఇహలోకానికి సంబంధించిన పన్లు తీరిన వెంటనే, వాళ్ళు శయనించిన సమాధిపై వాళ్ళపేర్లు లిఖింపబడి పాతిపెట్టబడ్డ ఆ సామాన్యమైన కొయ్య శ్లీవ. వాళ్ళ కోసంగా వా ళ్లడిగే దేమీ లేదు. ప్రతిదినం మొదటి రెండు గంటల కాలం, పూజబలికీ, ధ్యానానికి జేసు ప్రభువుతో ఐక్య మవడానికీ వాళ్ళు వినియోగిస్తారు. తర్వాత మేల్కొని ఉండే కాల మంతా ప్రజల సహాయార్థం వినియోగిస్తారు.

ఐర్లండు నెత్తురు చిమ్మే తనహస్తాల్లో, తన గాయాల్ని మాన్పుకోడానికి ప్రయత్నించిన ఆ కఠిన శిక్షాబద్ధమైన రోజుల్లో రోగాల్తో, కరువుకాటకాల్తో, ఆమె సంతానం నామరూపాలు లేకుండా నాశనమై పోతున్నప్పుడు, ఐర్లండు గర్వింప దగ్గ ధీరోదాత్తలైన ఈ పుత్రికా

రత్నాలు, తమమాతృదేశ సంరక్షణకోసం ముందుకు దూకారు. తిండి లేక మలమల మాడిపోయే వాళ్ళ ఆకలిమంటలు తీర్చారు. రోగాల్లో చిక్కి శల్యావశిష్టులైన వాళ్లకు చికిత్సచేసి బ్రతికించారు. మరణించేవాళ్ల ప్రక్కజేరి వాళ్ళ హృదయాల్లో ప్రశాంతిని స్థాపించారు. మరణించిన వాళ్ళను భూస్థాపితం చేశారు.

ఆరోగ్యంగా ఉన్నప్పుడూ, అనారోగ్యంగా ఉన్నప్పుడూ జేసు కోరికలే, స్పృహాలే వాళ్లకోరికలు స్పృహాలూ. చిరకాలం జేసుసేవలో తనజీవితాన్ని గడిపి, నయంగాని పెద్దజబ్బుతో ఒక కన్యాస్త్రీ ఏమీ లేని ఒక గదిమూల్లో, ఐర్లండులో నేడు కృశిస్తుంది. ప్రతి సంవత్సరం ఆమె గదికున్న చిన్న గవాక్షానికిబైట ఒక ఐరిష్‌గులాబి వికసించి, పచ్చిక మైదానం గుండా పూ పొదరిండ్ల నుంచి వచ్చే మందవాయువులికి కదిలి ఆ కిటికీ అద్దానికి కొట్టుకొంటూ, తన సౌరభాల్ని వెదజల్లు తుంటుంది. కానీ ఆమె ఇదేమి చూడదు ఆమె కండ్లు తినేయబడి, సంవత్సరం సంవత్సరానికి ఆమె పూర్తిగా అంధురాలై అక్కడ దుర్భరబాధ ననుభవిస్తూంది. ఆమె శరీరం బాధాగ్ని జ్వాలామయం. ఆమె అప్పుడప్పుడు కొద్ది క్షణాలు మాత్రమే నిద్రించగలదు. సంవత్సరాలు మెల్లగా గడిచిపోతుంటే, ప్రతిరోజు పగలూ రాత్రీ గంటలు లెక్కబెడుతూ ఉంటుంది. మానని రోగ మున్నా, భరింపరాని వేదనతో బాధపడుతున్నా, అంధత్వం ఏర్పడ్డా, ఆమె హృదయం నిశ్చలంగా దైవవిశ్వాస లగ్నమైయ్యే ఉంది. ఆమె బాధకు సంబంధించిన గొణుగు డేమాత్రం ఆమె మనస్సులోకి రాదు. ఆమె పెదవుల్నుండి ఫిర్యాదుకు సంబంధించిన అక్షరం ముక్కైనా బైటికిరాదు. మృత్యువు విజయాన్నిచ్చేంతవరకూ, మోయవలసిన స్లీవను జేసుస్వామి తన హస్తాల్లో ఆమె గుండెలపై పెట్టి అదుముతున్నట్లుగా ఆమె తలచు కొంటుంది.

అటువంటి ఇహలోక త్యాగం ధీరోదాత్త మైంది. మరియమాత అంధ పుత్రికైన ఈ ఐరిష్ యువతి దైవ విశ్వాసంలో, త్యాగంలో ఇంకా ఉన్నత స్థానా న్నాక్రమిస్తుంది. ఆమె ఇహలోక సౌఖ్య విరక్తి మూలంగా బాధా సహిష్ణురాలు కావడమే కాకుండా, దేవుడి దగ్గరికి ఆత్మలన్నిటినీ సమీకరించడానికి సాధనంగా, ఆమె సంతోష పూర్వక

మైన ఉదార గుణంతో దానికి విలువ కడుతున్నది. తన యేకాంత గదిలో సంవత్సరాల తరబడిగా మంచములో నున్న ఆమె పాపుల కోసం తన బాధల్ని దేవునికి సమర్పిస్తుంది. ప్రేమ బాధను జయిస్తుంది. "ప్రతిక్షణం, నా బాధలు ఒక ఆత్మను రక్షించ నీయ్! ఓ! నా జేసుప్రభూ! ప్రతిక్షణం ఒక ఆత్మను"— అని ఆమె అహర్నిశలూ జేసును ప్రార్థించింది. నిజంగా ఇది ఆదర్శ ప్రాయమైన త్యాగం! విశ్వాసం! ఈ రకమైన ధీరోదాత్తులైన వాళ్ళచేత తర్ఫీదు పొందిన ఐర్లండు సంతానమెంత అదృష్టమైంది! వాళ్ళ జాతిని ఉచ్ఛస్థితికి తీసుకపోయి, భగవంతుడికి సన్నిహితంగా ఉంచుతారు.

పట్టణాల రొద తప్పించుకోని దూరంగా ఉన్న ఒక ఐరిష్ మైదానంలో ఒక చిన్న మఠం ఉంది. షానన్‌లో కలవడానికి వంపు తిరిగి పోయేముందు, ఆ మఠాన్ని చూడ్డానికా అన్నట్లు, ఒక చిన్న కాలువ దాని కెదురుగా వంకలు తిరుగుతూ ప్రవహిస్తున్నది ఆ చుట్టుప్రక్కల ఉన్న వాళ్ళంతా సమావేశమయ్యే ప్రధాన స్థానం ఆ మఠం. తరతరాల్నుండీ ఆ మఠంలోని కన్యాస్త్రీలు ప్రజల హృదయాల్ని ఆకర్షించారు. అక్కడ ప్రజలు బాల్యంలో, ఇక్కడ కన్యాస్త్రీలు స్థాపించిన పాఠశాలకు విద్యాభ్యాసం కోసం పరుగెత్తుకు వచ్చారు. విద్యార్థి దశ దాటిపోయింది. మళ్ళీ వాళ్ళంతా మరియ మాత ప్రియసంతానంగా ఈ మఠంలో దైవ ప్రార్థల్ని చేయడానికి వచ్చారు. తర్వాత మళ్ళీ పత్నులై, ఇక్కడున్న కన్యాస్త్రీల సలహాల కోసం, మనశ్శాంతికోసం, వీళ్ళ చుట్టూ పరివేష్టించారు.

పెద్ద పెద్ద వృక్ష సమూహచ్ఛాయల్లో, బాగా వికసించిన వివిధ కుసుమాలుకల్గిన ఉద్యానం ఒకటి ఆ మఠం అవతలగా ఉంది. ఆ మఠానికి సంబంధించిన కన్యాస్త్రీలు భూస్థాపితంచేయబడిన సమాధులపై తెల్లని స్లీవ లున్నయ్. ఆ సమాధి శయ్యలు పూలతో అలకరింపబడ్డయ్. వృక్షచ్ఛాయల్లో ఉన్న ఆ సమాధులకు, ఈ పూలతోటకూ మధ్యగా ఒక చిన్న బాట ఉంది. కానీ ఇప్పుడక్కడక్కడ పూలచేత అలంకరింప బడని ఒక ప్రదేశం ఉంది అక్కడ ఘూలి ఘూసరిత భూభాగం విషాదంచేత గుడుసుళ్ళు తిరుగుతుంది. ఆమఠంలో అరవైసంవత్సరాల బాటు

నిరంతర సేవచేసి, మోంతానన్ని చూరగొన్న ఒక ఆత్మ భూస్థాపితము చేయ బడిన సమాధి ప్రదేశమది. ఆమె సోదరీమణు లామె మాతృ కళేబ రాన్ని ఆవృక్షచ్ఛాయల్లోకి తీసుక వెళ్ళారు. అటువంటి మరణం అన న్యదుర్లభం కావడాన, వాళ్ళ హృదయాల మీద మాత్రం నీడలు ప్రసరించలేదు.

ఐర్లండులో ప్రతి చోటా అటువంటి ఆత్మలు, అటువంటి మఠాలూ, కో కొల్లలుగా ఉన్నయ్. అవే ఐర్లడ్ ప్రధాన శక్తులు.

వాళ్ళొక ఐర్లండులోనే కృషిచేయలేదు. అనురాగ ప్రోత్సాహా లైన ఈ తిరుసభ పావురాళ్ళు ఆత్మల కోసం ఆదుర్దగా ఎగిరి భూ భ్ర మణం చేస్సినె. సెయింటు పాట్రిక్ అర్హ సంతానమైన వీళ్ళు తమతో బాటు దైవవిశ్వాస కరదీపికను దేశ దేశాలకూ తీసుకపోయి, జాతుల్లో ఆవరించిన గాఢతమస్సును పారద్రోలడానికి ప్రయత్నిం చారు. వాళ్ళ నే రకమైన కష్టం అడ్డగించలేకపోయింది. ఒక పక్షం రోజులు వచ్చిక మైదానాల్లో బండమీద ప్రయాణంచేసి, పశ్చిమా రణ్యాలలో ఉండి, ఐర్లండుకు "మా కిక్కడ ఆశీర్వదించిన దేవ వర ప్రసాద సాధనంతో జేసు ప్రభువు దర్శనం కావడం వల్లా, ఆయన కోసం, కొన్ని ఆత్మల్ని మేం సంరక్షించే మహదవకాశం లభించడం వల్లా, చాలా సంతోషంగా ఉన్నాం" అని వ్రాసి పంపిన ఆ కన్యాస్త్రీ సమూహాన్ని ఒక్కసారి చూడు! ఆ వీరవనితల హృదంతరాల్లో ప్రజ్వ లించే ప్రేమాగ్ని జ్వాలను, నీరు గూడా గడ్డకట్టుకొని పోయేటట్లుగా చేసే శీతల వాతావరణం ఏమీ చేయలేకపోయింది.

ఆన్డెస్ (Andes) పర్వత శిఖరాగ్రాల మీదగా నీరు గడ్డకట్టు కొనిపోయిన యూకన్ (Yukon)నది ప్రక్కగా ఆ కన్యాస్త్రీలు ప్రయా ణం చేసారు. హిమాలయ పర్వత చ్ఛాయల్లో, చైనాలో కుటిల మార్గం గల నదుల ప్రక్కగా, ఆఫ్రికా అరణ్యాల్లోగుండా, ఆస్ట్రేలియా మైదానాల్లో, మహా వేగంతో ప్రవహించే న్యూజిలాండు నదులవెంట, ఈ వీరవనితలు సంచరించి వాళ్ళ సత్ప్రభువైన జేసునాధుడి మాదిరిగా సహాయంచేస్తూ కృషి చేసారు. జేసునాధుడి కన్యలైన వీళ్ళు జేసునాధుడి

వల్ల సంక్రమించిన బలంతో, ధైర్యవంతుల గుండెల్ని కూడా చెదర గొట్టిన అపాయాల్ని నిర్భయంగా ఎదిరించారు. వీళ్ళ కిటువంటి మహిమాన్వితమైన శక్తి ఉండటానికీ, ఇంత అత్యున్నత స్థానాన్ని పొందడానికీ కారణం, వాళ్ళల్లో మానవ ప్రకృతి తత్త్వం లోపించడం కాదు. వాళ్ళు మానవ ప్రకృతిని జయించ గల్గడమే!

మొలకై (Molokai) నదిరేవులో ఉన్న ఆ పడవలోని ఆ బాల కన్యాస్త్రీని చూడు! ఆమె కుష్ఠురోగ పీడితుల సేవకోసం తన జీవితాన్ని గడపటానికి సాహసించి వచ్చింది. ఆ పడవ నదీతీరానికి రావడంతోటే తన కోసం తొంగి చూస్తూ ముక్కులు పోయి చెవులు పోయి, పెదవులు పోయి, శరీరమంతా తినేసిన కుష్ఠురోగంతో నిలబడి ఉన్న ఆ కుష్ఠురోగుల సమూహాన్ని చూచేటప్పటికి, ఆ భయంకర దృశ్యాని కామె తట్టుకోలేక పోయింది. అట్లాగే పడవలో కన్నీళ్లు కారుస్తూ స్తంభించి పోయింది. కాని వెంటనే ఆమె ప్రకృతిసిద్ధమైన ఉత్సాహాన్ని పొంది, తన కోసం నిరీక్షిస్తున్న వాళ్ళ దగ్గరికి దృఢ నిశ్చయంతో పోయింది. ఈనాడామె ధైర్యంతో వాళ్ళ కోసం కృషి చేస్తున్నది.

ఈ కన్యాస్త్రీలు తమ అనురాగ, కరుణ, త్యాగ గుణాల్తో బహిష్కృతులు, దరిద్రులూ, వ్యాధిగ్రస్తులూ విశ్రమించడానికి కనువుగా భూఖండాన్ని అనేక వసతి గృహాల్తో అలంకరించారు. వాళ్ళ విశాల హృదయానికి బలహీనులందరినీ గాఢంగా హత్తుకొన్నారు. వాళ్ళు పిన్నలకు మాతృ స్వరూపిణులు! పెద్దలకు ప్రియ పుత్రికలు! దోషులకు సోదరీ మణులు! జీవిత మార్గం మొదట్లో నిస్సహాయ స్థితిలో దారీతెన్నూ తోచకుండా దైన్యంగా నిలబడ్డ అనాథుల్ని సంరక్షిస్తూన్న ఆ కన్యాస్త్రీలను మనమిక్కడ చూస్తున్నాం. అక్కడ! బ్రతుకుబాట చివర, కాలాన్ని శాశ్వతత్వంలో కలపడానికి ఎదురు చూస్తూన్న వృద్ధుని శయ్యను, చేతుల్తో నిమురుతూన్న వాళ్ళను చూస్తున్నాం.

ఐర్లండు తన అన్ని గొప్పదనాల్తో బాటు, వీరవనితలైన ఈ కన్యాస్త్రీలనుగూడా గణిస్తుంది. వాళ్ళకి ప్రతిదేశంలో గౌరవ పూర్వక

మైన స్వాగతం లభిస్తున్నది. అది నిజమే! వాళ్ళకి భూఖండమంతా స్వగృహమే! మానవజాతి సమస్తమూ భ్రాతృ సమూహమే!.



10 వ అధ్యాయము

# దివ్యమహిమ ప్రేషితాన్విత గురుత్వము

వటికన్ (Vatican) పర్వతంపై శిలువ వేయబడిన సెయింట్ పీటరు నుంచీ, వటికన్‌పై కతోలిక్కు ప్రధాన మతాచార్యుడు బంధితుడై ఉన్న నేటి వరకూ విచ్ఛిన్నం కాకుండా పరస్పరంగా అభివృద్ధి చెందుతూ వచ్చిన గురు పట్టాభిషేకం, మానవ జాతిని మేల్కొల్పి, సన్మార్గాన నడిపించే దైవశక్తిని కలిగి ఉంది

భయమే ఎరుగని ఆ దైవ సైన్యం, తరగని ఉత్సాహాతి శక్తుల్తో శతాబ్దాలనుంచీ ప్రతి భూభాగానికి మానవుడి కోసం దైవ సందేశాన్ని మోసుక పోతున్నారు. ఆ సందేశం, విగ్రహారాధన చేసే మతాన్ని, అనాగరికతను పార ద్రోలింది. విష పూరితమైన భౌతిక వాదాన్ని నిర్మూలించింది మానవ హృదయ క్షేత్రాల్లో విజ్ఞానబీజాల్ని నాటింది ప్రేమ, స్వేచ్ఛలను నెలకొల్పింది.

ఈ దైవ సైన్యం చేసిన కృషిని ఎవరైనా వ్రాయాలంటే, వాళ్ళు మానవ జాతి చరిత్రనే వ్రాయాలి ఎందుకంటే, సృష్టి సమస్యలన్నింటినీ విపులీకరించేటట్లుగా దేవుడి మృదుల హస్తాల్తో వ్రాయబడ్డ మానవ చరిత్రమే, ఈ సైన్య ప్రవర్తన చరిత్ర. జేసు పిలుపుకు ప్రాణ మిత్రుల్నీ, స్వగృహాన్నీ స్వదేశాన్నీ అవసరమైతే స్వప్రాణాల్నీ త్యాగంచేసే కతోలిక్కు గురువుల వీరోచిత కృత్యాలూ, మహోన్నత స్థాయిని అర్థం చేసుకోగల దర్శన మున్న విశాల హృదయులే ఈ చరిత్ర నిర్మాణానికి కర్తలు

మత బోధక సంఘ మంటేనే వీర హృదయ మన్న మాట జేసునాథుడి ఆహ్వాన మంటే మాటలు కాదు! కష్ట సమయాల్లో ప్రాణ బంధాల్ని తెగదెంచుకోని ముందుకు దూకవలసిన సిపాయికి వచ్చే పిలుపువంటిదా ఆహ్వానం. "నన్ననుసరించు" అంటే సహజంగా మానవహృదయానికి ప్రియమైన వాటిని పరిత్యాగం చేయుట మన్న మాట! ఆ ఆహ్వానాన్నందుకొనే వ్యక్తి తప్పకుండా విశిష్టుడై ఉండాలి.

అతడు సైన్యంలో చేరాడంటే "నిన్ను నీవు నిరాకరించుకో! నీ శిలువను స్వీకరించు" అన్న జేసు ప్రభువు పలుకు లాతని చెవుల్లో ప్రతి ధ్వనిస్తాయ్. అహాన్ని చంపుకోటానికి, తన ప్రవర్తనను పవిత్రం చేసుకోడానికి, బలిష్టం చేసుకోడానికి అతడికి చాలా సంవత్సరాలు పడతై. అతడికి వచ్చిన ఆహ్వానం దేవుడి వద్ద నుంచి అన్నది గుర్తిస్తాడు. ముఖ్యంగా ఐహిక వాంఛ లన్నింటినీ నిగ్రహించి, శాస్త్రీయమైన నిరంతరాభ్యాసంతో అతని ప్రవర్తన, సమస్త సుగుణాల్తో మహిమాన్వితమై సర్వతో ముఖాభివృద్ధిని పొందు తుంది. "తన్ను తాను జయించ గల్గిన వాడు, ఒక మహా నగరాన్ని జయించిన వాడికన్నా గొప్పవాడు" అన్న సుభాషితం మాదిరిగా అన్ని విజయాల కన్నా కష్టమైన ఆత్మ విజయాన్ని అతడు ప్రప్రథమంగా సాధించాలి.

అతడి శిక్షణా నంతరం అతడొక ఉన్నత పదవిని పొందుతాడు. అట్టి పదవి అతడిని దేవుడికీ, మానవుడికీ మధ్య అపర క్రీస్తువనివలె చేస్తుంది మతాచార్యుడు తన విషయా న్నేమాత్రం లక్ష్యపెట్టకుండా ఎదురు చూస్తూన్న ప్రపంచ సంరక్షకుడైన జేసు వద్దకు ఆత్మల్ని పంపడానికి తన జీవితాన్ని అంకితం చేస్తాడు. ప్రపంచ జీవితాని కాతడు సంరక్షకుడు. దేవ వరప్రసాద సాధనల నిర్వహణంలో అత డీ లోకంలో దేవుడి సృష్టికి కేంద్ర స్థానం. కడరా భోజన సమయంలో బల్లపై ప్రథమంగా ఉంచబడ్డ ఆ 'జీవితాప్పము' (Bread of life) గురువు వలన పంచిపెట్టబడుతున్నది. గురుపట్టాభిషిక్తుడైన అతడు, పుట్టిన బిడ్డకు జ్ఞానస్నాన మిచ్చి జీవితకాలం దాన్ని కాపాడి సక్రమ మార్గంలో ప్రవర్తింప చేస్తాడు. మరణ సమయంలో, దాన్ని సృష్టించిన ఆ జేసునాథుడి వద్దకు పోయే తిరుగు ప్రయాణంలో దా న్నవశ్యంగా, సురక్షితంగా పంపి వేస్తాడు.

"నీవు సత్ఫలితాన్ని పొందుతావని నిన్ను నేను ఎన్నుకొన్నా. పోయి జాతు లన్నిటికీ బోధించు!" అన్నది వాళ్ళకి దైవాదేశం. తిరుసభ చరిత్ర, ప్రపంచం మొత్తంలో గురు పట్టాభిషేకం ఎంత మహత్తరంగా ఆ యాజ్ఞను నెరవేర్చిందీ, స్పష్టం చేస్తుంది. ఆగ్రహాను గ్రహాలకి గానీ, దూషణ భూషణలకి గానీ లక్ష్యపెట్టకుండా, జేసునా

ఘుడి మెప్పు మాత్రమే దృష్టిలో పెట్టుకొని, వాళ్లు మానవ నాగరిక తలో నిరంతర ప్రయాణం సాగిస్తున్నారు. 'యూకన్' పై, భయంకర నిశ్శబ్దం తాండవించే మంచు ప్రదేశమైన 'అలాస్కా'లో వాళ్ళు, బంగారం కోసం తాపత్రయ పడే వాళ్ళ ఎదుట అనేక సంవత్సరాలు కృషి చేసారు. ఉత్తర అమెరికాకు, కెనడాకు వాళ్ళు త్రోవను చూపిరి. భయంకరులైన ఇండియన్లతో, సాహసించి పరిచయం కల్పించుకొన్న ప్రథమశ్వేత జాతివారు వాళ్ళు. ప్రాణా లరచేతుల్లో పెట్టుకొని ఉన్న వాళ్లను మనం (అమెజాన్) గహనారణ్యాల్లో, మహోన్నతాలైన ఉత్తర అమెరికా మైదానాల్లో చూడగలుగుతాం. మన ఆనుసిక పరిశోధకు లకు శతాబ్దాలకు ముందు వాళ్లు(ఐరిషీయ గురువులు) ఆఫ్రికా అభ్యుద యాన్ని కాంక్షించి ఆ ఖండ గహనారణ్యాలలో జొచ్చారు. సిరియా, చైనా, జపాను మొదల్కొని పసిఫిక్ దీవులవరకు మొత్తం ఆసియా ఖండాన్ని గాలించారు.

గతంలో, గురువు ప్రపంచ మానవుల దృష్టిలో పడకుండా తన విధ్యుక్తధర్మాన్ని నిర్వర్తించాడు. కాని, ఇంతకుముందు గురువులు నిర్వర్తించుచుండిన ప్రజాసేవను, లెక్కచేయని ప్రపంచాన్ని ఈ నాడు ప్రపంచాన్ని ముంచెత్తిన యుద్ధోపద్రవములలో వారు చూపిన స్వార్థ త్యాగ సాహసాలు వారి ఆదర్శాలలో ఉన్న గొప్పదనాన్ని గుర్తించే టట్లు చేసినై. సత్యగౌరవములను తన ప్రవర్తనకు మానవుడు ఆధారము లుగా జేసుకొని ప్రవర్తించుటవలన కష్టసమయాల్లో మానవ హృదంత రాల్లో నిగూఢంగా ఉన్న ఉదాత్తస్వభావం ప్రకాశిస్తుంది. దురాభిప్రా యాలూ, ద్వేషాసూయలూ మటుమాయమైపోతై అటువంటి క్లిష్టసమ యాల్లో అందరూ స్పష్టంగా దర్శనంచేసుకొనేటట్లుగా జీవితప్రకాశంలో సత్యం, తన నగ్నస్వరూపంలో సాక్షాత్కరిస్తుంది. మానవుడి ఉన్నతా దర్శం, అతణ్ణి కుటుంబ జంబాలపటలం నుంచి ఉద్ధరించ లేదు అని ఎంత తెరచాటు నాటకంగా సుభాషించినా, అటువంటివాళ్ళ కిక స్థానం ఉండదు.

ఈ నాడు మతం మళ్లీ స్వస్థానాన్ని పొందింది. ఇక పరిహాసా స్పదం కాబోదు. మహోన్నత మైన స్వార్థ రహిత వీరత్వాన్ని

పొందడానికీ, మానవుడి మహోత్కృష్ట సాహసానికీ అది పునాది రాయి అన్న సంగతి అందరూ గుర్తించారు. ప్రపంచం అన్ని మూలల్లో మానవులు దేవునిపక్ష మవలంబించారు. క్రైస్తవు లందరూ అధినేత, ప్రభువైన జేసునాథుడికి ప్రణమిల్లారు. మానవుడు, మరణం సాక్షాత్కరించి నప్పుడు మూఢత్వాన్ని వదలి పెట్టి, సహాయం కోసం సృష్టికర్తకు సహజమైన హృదయానుభవంతో అర్థిస్తాడు. దేవుని సత్యమంతటికీ సంరక్షకురాలూ, ఆయన అద్భుత పవిత్ర దేవ వరప్రసాద సాధనాల్ని అందరికీ అందిచ్చేదీ అయిన పవిత్రమైన తిరుసభ సంతానం విషయంలో, ఈ పరిస్థితి అక్షరాలా నిజం.

ప్రపంచ మీనాడు జేసుస్లీవను ధరించిన కతోలిక్కు మతాచార్యుడి వీరత్వాన్ని గుర్తించి అమోఘంగా శ్లాఘిస్తున్నది. ఈ సత్యాన్ని గుర్తించాలంటే ఒక్కక్షణం మా ప్రాణమిత్రమైన ఫ్రాన్సును చూడు!

తాము దేవుని చేత సృష్టింపబడ్డ మట్టి బొమ్మ లనే సంగతి మరచిపోయి, పరమ మూర్ఖులైన మనుష్యులు కొందరు, ఫ్రాన్సు దేశాన్ని కబళిద్దామనే దురాశతో ప్రారంభించిన యుద్ధం యొక్క భౌతిక దావాగ్ని జ్వాలలు ఫ్రాన్సు దేశంలో నాల్గుమూలలా వ్యాపించినై. గాఢంగా కదలిన ఆ ఫ్రాన్సు, కతోలిక్కు సాంప్రదాయాల వల్ల ఏర్పడ్డ మహిమతో మేల్కొన్నది. ఇతర్లచేత గుర్తింప బడని ధైర్యంతో, సాహసంతో, నిషేధాలకూ, కారాగార నిర్బంధాలకూ, శిక్షలకూ, దారిద్ర్యానికీ చలించకుండా పూర్వం జేసునాథుడి పతాక గౌరవాన్ని కాపాడిన వీరయోధులు, ఫ్రాన్సు కతోలిక్కు గురువులు! ఆ గురువుల ఉపదేశాలు ప్రశంసనీయాలు. ఈనాడు ఫ్రాన్సు ఇటువంటి క్లిష్ట పరిస్థితుల్లో హృదయ పూర్వకంగా దేవుని పక్షం ఆయన స్థాపించిన తిరుసభ పక్షం అవలంబించిన జాతిగా సన్నద్ధమైంది. ఫ్రాన్సు బలంలో ఉన్న రహస్యమిది మా విశ్వాసానికి వ్యతిరేకులైన వాళ్ళు కూడా దీన్ని గుర్తిస్తారు. ఒక ఫ్రెంచి ప్రొటెస్టాంటు లేఖిన్నుంచి వచ్చిన ఈ క్రింది మాటలు గమనిస్తే ఆ విషయం తెలుతుంది.

" 1914లో ఫ్రాన్సుపై దండెత్తిన శత్రువుని ఎవరూ ఊహించలేని విధంగా ఎదిరించి పోరాడిన ఫ్రాన్సు బలంలోని ఆంతర్యాన్ని విప్పు

లీకరించి వ్రాయబడ్డలచుకొన్న మానసిక తత్త్వ శాస్త్రవేత్తయైన చరిత్ర కారుడు, వీళ్ళలో పొంగివచ్చిన మత విశ్వాసం, తాను కనుగొన్న కారణాల్లో ప్రప్రథమ కారణంగా గుర్తించాడు. ఈ విధంగా ఫ్రాన్సు, జాగృతిని పొందడానికి గల విశేషాల్లో వీరోచితమైన ప్రవర్తనతో సంచరించిన కతోలిక్కు గురువుల సాక్షాత్కారం ఒకటి. తమ పవిత్ర ధర్మ నిర్వహణకోసం కాల్చబడి, నెత్తురు చార్లతో ఉన్న అంగీలతో వీరులుగా భూపతనంచెంది, వీళ్ళు గురువులుగానే మరణించా రన్నది ప్రత్యేకించి చెప్పే అవసర మేమాత్రం లేదు."

జేసునాథుడి దగ్గరికిపోయిన, పురుష సింహాలులూ, సాహసులూ ఐన మా సోదరులూ, తండ్రులగు ఆ కతోలిక్కు గురువుల్లో గల బలానికి కారణాన్ని తెలపడానికి కతోలిక్కులైన మాకు, ఏ మానసిక శాస్త్ర తత్త్వవేత్త ఐన చరిత్ర కారుడూ అవసరమూ లేదు. తన్ను విశ్వసించి, అనుసరించే వాళ్ళందర్నీ అనుగ్రహిస్తానని జేసునాథుడు వాగ్దానం చేసిన ఆ సంపూర్ణ మానవత్వాన్ని వాళ్ళు కలిగి ఉన్నారు అన్న విషయం మా కందరికీ తెలుసు.

ఆల్బర్టు రాజుకు కుడిభుజంగా నిలబడి బెల్జియం దేశాన్ని, అచంచలమైన దేశభక్తితో, పవిత్ర హృదయంతో ముందు నడిపిస్తున్న గొప్ప కతోలిక్కు గురువైన కార్డినల్ మేర్సియేర్ (Cardinal Mercier) ను, ప్రపంచమంతా నేడు ఘనంగా శ్లాఘిస్తున్నది. బాధా పీడితమైన బెల్జియంలో ఒక మహోన్నత విగ్రహంగా నిలబడి, తన తీక్ష్ణమైన వాక్చాతుర్యంతో ప్రపంచాన్ని ఊపివేస్తున్న ఈ కతోలిక్కు ఆచార్యుణ్ణి చూస్తుంటే మా హృదయాలు ఎట్లా పులకించి పోతున్నయ్! ఓహో! గాఢ విశ్వాస మహిమమే అంత అద్భుతంగా పలికిస్తుంది! ఆయన దేశం నరక యాతల్ననుభవిస్తూంటే, ఇంకా అక్కడ గృహాలన్నీ తగలబడ్తూంటే అక్కడి భూభాగమంతా రక్తసిక్తమై జుగుప్సాకరంగా ఉంటుంటే, ఆయన చెవుల్లో భయంకరమైన యుద్ధ గర్జన్లు ప్రతిధ్వనిస్తుంటే, అతడు ప్రశాంతంగా, ఆత్మవిశ్వాసంతో నిలబడి జేసునాథుడికీ, మరియమాతకూ, ఉపద్రవ విముక్తి కోసమై నిరీక్షిస్తున్నాడు.

నిజంగా మనస్సాక్షికి మించిన కవచ మేదీ లేదు! ధూళి ధూసరితమై, అంధమై యున్న ఈ లోకంలో, ఆహ్వానించే జేసుస్వామి పవిత్ర మృదుల హస్తాన్ని చూడ గల్గడం కన్నా వేరే దర్శన శక్తి లేదు! కతోలిక్కు గురువీ రెండు శక్తుల్నీ కలిగి ఉన్నాడు. శాశ్వతం అన్న త్రాసులో ప్రస్తుత మున్న కాలములో ఉపద్రవా లన్నిటినీ తూచి చూడ గల శక్తిని అవి ప్రసాదిస్తయ్ కందకాల్లో ఉన్న కతోలిక్కు గురువులు శతాబ్దాల నుంచీ వాళ్ళ సోదరు లేం చేసారో అదే చేస్తున్నారు. వాళ్ళ మాదిరిగానె, లక్ష్య సాధనం కోసం మృత్యువు కూడా అడ్డ లేని అచంచల సాహసాన్ని, తామూ కల్గిఉన్నామని నిరూపిస్తున్నారు. వాళ్ళ ఆత్మల కోసమే ఆలోచిస్తున్నారు. "అన్ని జాతులకీ బోధించు" అని వాళ్ళ సైనికాధికారి జేసువు ఆదేశించాడు. ఎక్కడైతే మానవులు వీళ్ళని కావాలంటారో వాళ్ళక్కడ కనపడతారు. వాళ్ళెప్పుడూ త్యాగ శక్తిచేతనే ప్రోత్సహింపబడతారు. బడిగానీ, గుడిగానీ, లేకపోతే, సర్వనాశనకారిణైన యుద్ధభూమి కానీయండి వాళ్ళకొకటే! వాళ్ళందరూ వీరులు! జేసునాధుడి పవిత్ర హస్తచ్ఛాయల్లో వాళ్ళెక్కడైనా పయనం సాగిస్తారు! మానవుల దర్లో ఉన్నత స్థానాన్ని పొందుతూ దేవుని దగ్గరకి ఆత్మల్ని పంపుతూ, తమ్ము తెలుసు కున్న వాళ్ళందరి శాశ్వతాను రాగాల్ని చూరగొంటూ ఉన్న ఇటువంటి వీరులు ప్రతి జాతిలో ప్రతి తరంలోనూ కనబడుతూ ఉండాల్సిందే! హింసలు, వాళ్ళ సంఖ్యను ఎక్కువ చేసినై. మన తిరుసభకు గొప్పదనం చేకూర్చేటట్లు ప్రాణత్యాగంచేసిన వీరుల, వేదసాక్షుల స్తుతీయుల పేర్లకు నిరంతరంగా వాళ్ల పేర్లను కల్పుతూ, మృత్యువు వాళ్ళకు మరింతశక్తి చేకూర్చింది.

ఐర్లండు విషయంలో, ఇతర దేశాల కన్నా ఈ విషయం చాలా సత్యమైంది. ఇతర దేశాల్లో బాధాగ్ని జ్వాలలు క్షణికంగా చెలరేగుతే ఐర్లండులో దీర్ఘ కాలం చెలరేగి ప్రళయ తాండవం చేసినై. ఐనప్పటికీ చలించని ధైర్యంతో, సాటిలేని ఆత్మవిశ్వాసంతో ఐర్లండు దేవుడికీ ఆయన గురువులకీ విశ్వాసపాత్రంగా నిలిచింది. భయంకరమైన బాధల్ననుభవించి, ప్రపంచంలో ఎక్కడ కనీ వినీ ఎరుగని విధంగా కతోలిక్కు గురువు ఐర్లండు హృదయపీఠంలో స్థానాన్ని పొందగలిగాడు.

ఐర్లండు, సురక్షితంగా జేసు తిరుహృదయానికీ, మరియ మాతకూ కట్టుబడి ఉంది. దేవునికి తర్వాత ఐర్లండు ఋణపడ్డ వీరాగ్ర గణ్యుడైన పుత్రుడొకడున్నాడు. ఆయన్ని, ఆమె సంతానమంతాఅను రాగ గౌరవాల్లో సోగార్త్ అరూన్ (Soggarth Aroon) అని పిలుస్తారు.

ఆయన్లో ఉన్న పూర్ణమైన దివ్యత్వ వైభవాన్ని బాగా గుర్తించి, ఆయనకు గౌరవంగా పెట్టిన పేరు 'సొగార్త్ అరూన్'.

భూలోకంలో సాటిలేని గాఢాను రాగాన్ని తెలియజేసే ప్రేమకు పర్యాయపదం 'అరూన్'!

స్వార్థ రహితంగా, నిరంతరం గొర్రెమందను కాసే కాపలావాడి మాదిరిగా 'సొగార్త్ అరూన్' ప్రజల కెల్లప్పుడూ విశ్వాస పూరితుడైన సంరక్షకుడుగా ఉన్నాడు.

ఐర్లండు, కాల్వరిలోని హింసనూ మృత్యువునూ గాని లేక లౌకిక సుఖములను కానీ ఏదో ఒకటి ఏర్పాటు చేసుకోనవలసి వచ్చినప్పుడు తన మతాచార్య సంతానం నాయకత్వం క్రింద స్లీవమార్గంలో ఆమె నిర్భయంగా తన పాదం మోపింది! ఆమె మతంకోసం ప్రాణత్యాగం చేసిన విషయాన్ని మనం చూసినప్పుడు, ఆమె యొక్క 'సొగార్త్' తోడేలు కింద జమకట్టబడి కనపడ్డ వెంటనే చట్టప్రకారం చంపబడవచ్చునన్న సంగతి మనం తెలుసుకొన్నాం. "ఐర్లండులో, ఒక్క కథోలిక్కు గురువును కూడా సజీవంగా ఉంచగూడదు" అన్నది అప్పటి ఆజ్ఞ. పెడరెక్కలు వెనక్కి విరిచికట్టి, తన ఎత్తైన శిఖరాల మీదనుంచి, అట్టడుగులో ఉన్న చత్రాతి బండలమీదికి వాళ్ళను పడద్రోసి చంపిన సంగతి ఆ సముద్రం దగ్గరున్న పర్వతం కళ్ళారా చూచింది. పూజబలి గుహల్లో బంధింపబడి, దట్టమైన పొగలో వాళ్ళంతా ఉక్కిరి బిక్కిరై మరణించారు. వాళ్ళను బానిస వ్యాపారస్తుల కమ్మి విదేశాలకు పంపిస్తే, మరణ పర్యంతం తమ యజమాన్ల కొరడా దెబ్బల్తో వాళ్ళు సేవచేసారు. దేశంలో ఒక మూలనుంచి మరో మూల వరకూ 'గురువు వృక్ష' చ్ఛాయల్లో వాళ్ళ మృత కళేబరాలు వ్రేలాడినై. కాబోయే సర్వనాశకులికి పందెంతో గురువు వెంట గురువు నిచ్చెన

ల్నెక్కి వస్తుంటే, ఐర్లండులో ప్రతి ఉరికంబం గజగజా వణికిపోయింది. కానీ, దేశాంతర గమనం, కారాగారాలు, హింస, మృత్యువూ ఇవేవీ ప్రయోజన కరాలు కాలేదు. ఐర్లండులో గురువు కనపడ్డమంటే, అతడికి చావు నిక్కమన్న మాట! తన కుమారుణ్ణి విదేశాలకు గురువుగా తయారు కావడానికి పంపించాడంటే, ఆ తండ్రికి మృత్యువు ఆసన్నమైందన్న మాటే! ఐనప్పటికీ! ఒకడు మరణిస్తే, అతడి స్థానంలో మరొకడు జన్మించాడు. అంతం లేని ఒక మహాప్రవాహం మాదిరిగా ఐర్లండు గృహాల్లోంచి బాలురంతా మెల్లగా యూరపుఖండంలోకి ప్రాకి ప్రేమకాంతుల్తో ప్రకాశవంతాలైన హృదయాల్తో వీరుల్లోకల్లా వీరుడైన మన జేసునాధుడి అడుగు జాడల్లో నడుస్తూ వీరత్వస్థాయిని పొందగల పంథాలో నిర్గమించారు. పరిశుద్ధతైలంతో అభిషేకింపబడినవాళ్ల చేతుల తడి ఆరకముందే, వాళ్ళు శుష్కించిపోయిన సోదర్ల దగ్గరికి పరుగెత్తు కొని దేవుని కోసం, ఐర్లండు కోసం చావడానికి సిద్ధమై, కాదు—చావడానికే వస్తారు. ప్రతికోనలో, ప్రతి కొండలో గురువు నివసించే గుహ ఉంది. ఐర్లండు ఆత్మను సంరక్షించిన మహావీర పరంపరను గూర్చి నిరాఘాటంగా పల్కుతున్న 'గురువు వృక్షం' కూడా అక్కడుంది.

వాళ్ళు, విశ్వాస దీపకళికను వెలిగించి, కాంతులు వెదజల్లేటట్లు కాపాడారు. ఐర్లండు దయాధర్మ భాస్కరుడి మీద ఎటువంటి కారు మేఘాలు కమ్మినప్పటికీ, ఆ గాఢాంధకారంలో ఆ విశ్వాస జ్యోతి దేదీప్య మానంగా వెలిగింది. ఆ జాతి క్రూర హింసాకాండ నెదిరించి అచంచలంగా నిలిచింది. మధురంగా నినదించే 'ఫిన్ ఫోయా' (FinFoa) పూజబలి ఘంటారావం విచ్ఛిన్నమై మౌనం దాల్చినప్పటికీ, సాగర్ కంఠం మాత్రం, నిర్మానుష్యమైన ఆ ప్రదేశంలో గంభీరంగా ధ్వనించి హింసకూ, ఉపవాసాలకూ, మృత్యువుకూ ఎదిరించ నిలబడగల ధైర్య విశ్వాసాల్తో ఐరిష్ వాళ్ళ హృదయాలను నింపింది. నిస్సహాయులైన ఆ ప్రజా సమూహానికి తోడ్పడ్తూ ప్రతి దినం ఆతడు నేయి మారు రూపాల్తో మృత్యువు నెదుర్కొన్నాడు. అతడి కాశ్రయ మివ్వడ మంటే మృత్యువు నాహ్వానించడమన్న మాటే! కానీ దరిద్రుడి పూరి

గుడిసే అతడికి శరణ్యమైంది. అదిరింపులూ బెదిరింపులూ గానీ, ధనాశ గానీ అతనిని జేసుసేవనుండి దూరస్తుణ్ని చేయలేక పోయినై.

వాళ్ళాహారంలేక ఉపవాసాలు చేస్తున్నారు. ఆయన స్వర్గం నుంచి వాళ్ళకు జీవితాహారాన్ని ప్రసాదించాడు.

నా అనేవాళ్ళు లేని బహిష్కృతులు వాళ్ళు! ఆయన వాళ్ళకు ఇల్లూ, జేసునాథుణ్ణీ అనుగ్రహించాడు.

తల దాచుకొంటానికి స్థలం లేక చలిలో, ఎండలో, వానలో, తుఫాన్లో చచ్చిపోతున్నారు. ఆయన వాళ్ళను తన మహిమాన్వితమైన ప్రేమతో కప్పి, సుఖం కలిగించాడు.

భగభగమండే అగ్నిజ్వాలల ధూమ పటలంలో గుండా రక్త దాహంతో ఎదురు చూస్తున్న ఉరి కంబాల్లో, ప్రళయమేఘాల క్రింద, ప్రతి కదలికలో మృత్యువు నెదుర్కొంటూ సాగార్త్ వాళ్ళ దగ్గరికి పాకి పోయాడు!

"ఓహో! భగవంతుడికి నా అభినందనాలు! సాగార్త్! నీవు వచ్చావూ!" అని హీన స్వరంతో కంపించి పోయే ఆ పెదవులు సంతృప్తి కరమైన నిట్టూర్పుతో గుసగుసలాడినై. అతని రాకతో మృత్యువు తన భయంకరత్వాన్ని కోల్పోయింది. కంపించి పోయే హృదయం నిశ్చలంగా నిలబడింది. జేసుతిరుహృదయంపైగల గాఢవిశ్వాసంతో, ఆయన స్వాగతంలోని నమ్మికతో ఆ హృదయం ఎగిరి గంతు లేసింది. అతడి కంఠధ్వని మృత్యుమేఘాన్ని విచ్ఛిన్నం చేసి, గృహోన్ముఖత్వానికి మంచి అవకాశాన్ని కల్పించింది. తాను ప్రేమించిన ఆ ఆకారాన్ని బహిష్కృతు డొక్కసారి చూడగానే, చచ్చిపోతున్న ఆ కళ్ళల్లో బాధ అంతరించి పోయింది. అతడి కళ్ళు విజయ గర్వంతో మిలమిలా మెరిసి పోయినై. అవస్థ అభ్యంగమునకై బలహీనమైన చేతులు చాచబడినవి. మరణావస్థలో ఇచ్చే సత్ప్రసాదము మూలమున జేసునాథుడు ప్రవేశించి, విశ్రమించగానే బలహీనమైన గుండె కూడా బలంతో కొట్టుకొంది. సాగార్త్, బాధపడే తక్కిన వాళ్ళ సహాయం కోసం వెళ్ళాడు. కానీ జేసునాథుడు అక్కణ్ణే ఉన్నాడు. చచ్చిపోయే ఆ

దేహం నుంచి వళ్ళు కొంకర్లు పోయే మంచును తుడిచివేసి పోయే చలి గాలిని ఆ ఆత్మ ఏం లక్ష్యపెట్టింది? మరణశయ్యను అలంకరించే ఆ ఆకలిమంటలకేం లక్ష్యపెట్టింది? వీటన్నిటినీ మతించక ఆయన దివ్య సాక్షాత్కారంలోని కాంతి, ప్రేమలకు తృప్తి చెంది, ఆ ఆత్మ, జేసునాథుడి దివ్య మహిమల్ని కొనియాడింది.

మరణోన్ముఖులై వారికి దివ్య సత్ప్రసాదం తీసుకొనిపోవడానిగ్గాను, వానతో తడిసి ముళ్ళ కంచెలు వెంబడిగా, ఎగుడు దిగుడు ప్రదేశాలగుండా ప్రాణభయం కూడా లేకుండా నిర్భయంగా వంగి, పారాడి పోతున్న ఆ సాగార్ పైగా భక్తి ప్రపత్తులతో అనుసరిస్తూ, అతడి ఏకాకి గమనాన్ని మహోత్సవంగా చేస్తూ ఉన్న దేవదూతల్ని ఆ ఆత్మ దర్శించింది.

అటువంటి రోజుల్లో, అటువంటి చర్యల్లో ఐర్లండును సాగార్తో బంధించివేసే ఆ అత్యద్భుతమైన ప్రేమ చిగురించింది. ఆ ప్రేమ మానవత్వంతో కూడిన ఆర్ద్రత కలిగింది ఆ ప్రేమ దైవప్రేమతో కూడినదిగాన చాల గాఢమైనది. సాగార్ మాటలు వినపడ్డ వెంటనే చనిపోయే ఆ నేత్రాలు ఒక్కసారి తెరుపుళ్ళుపడి అతనివైపు చూస్తాయ్, అంటే ఆశ్చర్యమేమీ లేదు. తన చేతుల్లో జేసునాథుణ్ణి ధరించి మోకరించి ఉన్న అతణ్ణి చూచిన వెంటనే మరణ వేదన్తో మూతలుపడ్డ పెదవులు విప్పారి "అరూన్, అరూన్, సాగార్ అరూన్" అని పలకరిస్తాయ్ అంటే ఆశ్చర్యమేమీ లేదు. ఈ విధంగా సాగార్ ఐర్లండు హృదయ కుహరంలోకి స్థిరనివాస మేర్పర్చుకోడానికి చొచ్చుకు పోయాడు.

అటువంటి నాయకుల వల్ల ఐరిష్ హృదయాల్లో ఉన్న గాఢ విశ్వాసాన్ని, అచంచల ధైర్య సాహసాల్ని, పోగొట్టడానికి దారుణ హింసలు కానీ, దుర్భర దారిద్ర్యం కానీ శక్తిమంతాలు కాలేకపోయినై. కతోలిక్కులందర్నీ హతమార్చడానికి వెతుక్కొంటూ వచ్చిన సైన్యాల బూట్ల చప్పుడు విని రహస్యపు గుహల్లో భయకంపితులై భయంకరంగా కొట్టుకొంటున్న తమ తల్లులగుండెలకు గాఢంగా

హత్తుకోబడి, ఎట్లాగో మృత్యువు వాత పడకుండా సంరక్షింపబడి పెరిగి పెద్దవాళ్ళైన వాళ్ళంతా తమ తల్లులు అంతగా పోరాడి మరణించి కాపాడిన, ఆ నిధి విలువను అంత తేలిగ్గా చూస్తారన్న దసంభవం. యౌవనంలో, సాగర్ కష్టాల్లో పాలుపంచుకోని పవిత్రమైనపూజబలి పాషాణం వద్ద ఐర్లండు దుఃఖాశ్రువుల్ని తుడిచివేసే టప్పుడు, అతడి పక్క మోకరించి ఉన్న వాళ్ళంతా అతడి మహోదారత్యాగ గుణాన్ని గుర్తించారు. అతడి ప్రేమాన్వితమైన స్వార్థత్యాగ స్వభావము వాళ్ల హృదయాల నాకర్షించి దానితో నింపివేసింది. సఫల మయ్యేదాకా వాళ్ళ హృదయాల్లో నుంచి అది వైదొలగి పోలేదు.

ఐర్లండు ప్రజల చరిత్రలో ప్రతి పుటా ఆశక్తి ఎంత ఫలప్రద మైందో,ఎంత మహత్తరంగా చెపుతుంది! కేంటి 'టైరోన్' (Tyrone)లో శిథిలమైపోయిన ఒక చిన్న గృహం దగ్గర రోడ్డువెంబడిగా మోకరించి దైవ ప్రార్థన చేస్తున్న ఆ ముసలివాణ్ణి గూర్చి చెప్పే పుట తెరిచి చదవండి! అక్కడి నేల, పొయ్యి మొత్తం పాచిపట్టిపోయింది. గోడ లుప్పురిసి పోతున్నయ్. ఎరిన్ దాన్ని తన హృదయానికి హత్తుకొనేవరకూ అది క్రమేపీ క్షీణించిపోవడం మొదలుపెట్టింది దుర్భర దారిద్ర్యంతో ఆ వృద్ధుడు జన్మించిన స్థల మిది! దాని స్థితి నేటి కిట్లా అయింది! గత కాలం లోని విషయా లొక్కొక్కటే ఆ వృద్ధుడు జ్ఞాపకం చేసుకొంటూంటే అతడి రెండు నేత్రాలు అశ్రుజలపూర్ణాలయినై. ఆకంచెల్లో అక్కడున్న పాఠశాలా ఉపాధ్యాయుని దగ్గర కూర్చొని ఆయన సుభాషితా లాలకించడానికి పాకిపోయేవాడు! అక్కడ పర్వతంపైన శాద్వల ప్రదేశంలో ఒక మొండిగోడ ఉంది దాని నీడలో ఇదివరకు పూజబలి అర్పింపబడేది. చిన్నతనంలో తన తల్లి దండ్రులతో కష్టపడి పనిచేసిన పొలం అక్కడ్నే ఉంది. అది ఎంత వ్యవసాయం చేసినా పండని నాపచేను కావడ చేత ఆఖరికి విసుగెత్తి వాళ్ళొకరోజు, ఇప్పు డాతడు కూర్చున్న చోటుగుండా విషాదంతో బైలుదేరి వెళ్ళిపోయారు! కొండ దిగువనుంచీ అక్కడి ప్రదేశమంతా కదుల్తున్నట్లుగా అదంతా నిన్ననే జరిగిపోయినట్లుగా అతడు స్పష్టంగా చూస్తున్నాడు. అరవై ఏళ్ళ వెనక జరిగిపోయిన సంగతులు అతడు నేడు చూస్తున్నాడు. అల్లరి చేస్తున్న

తన సంతానాన్ని ఓదార్చడానికి ప్రయత్నిస్తూ కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్న తన మాతృదేవిని అతడు చూస్తున్నాడు. అన్ని కష్టాల్లోనూ గంభీరంగా నిలబడివున్న ఆయన తండ్రి కళ్ళకు కట్టినట్లు కనపడ్తున్నాడు. చుట్టుపక్కలవాళ్ళు ఇచ్చిన వీడ్కోలు మాటలు అతడి చెవుల్లో ఇప్పుడు మారుమ్రోగుతున్నయ్. తాము పూర్వం అధిగమించిన మార్గం— తమ దేశంలో నిరాకరింపబడ్డ హక్కుల కోసం కొత్త భూభాగాన్ని చేరుకోవడం— ఆ నూతన వ్యక్తుల మధ్య నాడు ప్రారంభమైన కొత్త జీవితం— మొదలైన నాటి ప్రయాణానికి సంబంధించిన ప్రత్యంశం అతడికి బాగా జ్ఞాపకం ఉంది. అక్కడ మోకరించిన వృద్ధుడు తన గత జీవితంలోని సంవత్సరాలొక్కటొక్కటిగా తిరిగివేసి చూస్తున్నాడు. ఐరిష్ విశ్వాసంతో అనేక కష్టాలకులోనై చివరకు విజయం సంపాదించిన ఆ గత కాలాన్ని సమీక్ష చేస్తున్నాడు. అన్ని కష్టాల్లోనూ నాడు సాగార్త్ మాటలవల్లా, ఆచరణ వల్లా తన హృదయంలో తానూ ఒక గురువుకావాలనే దృఢకాంక్షతో వెలిగిన జ్యోతిని ప్రకాశవంతంగా తానూ నిలపగలిగినందుకు తన హృదయ పూర్వకమైన భక్తితో దైవ స్తోత్రం చెల్లిస్తున్నాడు. "చాలా పర్యాయాలు, చాలా సార్లు ఆ పచ్చిక మైదానంలో నా దంతిక విసరి పారేశాను. ఒక వరికుప్ప వెనుక మోకరించి నన్నొక గురువుగా చేయవలసిందని మరియు మాతనూ, జేసునూ ప్రార్థించాను" ఇదీ అతడి చరిత్ర.

దుర్భర దారిద్ర్యంలో క్రుంగి కూలారిన అతడి స్తోత్రాన్ని భగవంతుడెట్లా ఆలకించాడో మొత్తం ప్రపంచానికే తెలుసు. అక్కడ వరిపొలంలో సేద్యం చేసుకొంటూన్న ఆ పిల్లవాడు దైవ విశ్వాసంతో తనకు వచ్చిన కష్టాలన్నిటిని ఎదుర్కొని తన మనోవాంఛను సఫలీకృతం చేసుకొన్నాడు. మళ్ళీ ఇప్పుడు అర్ధశతాబ్ది తర్వాత తాను పూర్వం ఏపొలంలో ఉండి నిస్సహాయ స్థితిలో దైవప్రార్థల్ను చేశాడో ఆ పొలానికే వచ్చాడు. అక్కడ పర్వతం దగ్గరున్న ఆ చిన్ని గృహం ముందు మోకరించి నేడు దైవస్తోత్రం చెల్లిస్తున్నాడు. తమవాళ్ళు దత్తత పోయిన ఆ దేశంలో అతడు గొప్పనాయకుడు. అతడు న్యూయార్కు అతిమేత్రాణులు జాన్ హూగ్సు.

గణించటానికి వీల్లేని త్యాగాలవల్ల పవిత్రమైన జీవితాలు కల్గిన అసంఖ్యాకులలో ఈ గొప్ప కతోలిక్కు ప్రధాన గురువు ఎందునా తీసిపోడు. విశ్వాసులంతా బ్రహ్మాండమైన చర్చిలో ఐర్లండులో ఈనాడు ప్రార్థల్ను చేయడానికి కారణం, వర్షంలో తడిసి, ఆహారంలేక ఉపవసించి, ఇల్లూ వాకిలీ లేక అల్లాడి దైవ విశ్వాసం చావకుండా ఉండటానికీ, ఐర్లండు కలకాలం ఆ విశ్వాసాన్ని పౌత్రికధనంగా కాపాడు కోడానికీ, తమ జీవితాలు వీరోచితంగా త్యాగం చేసిన సాగార్త్‌లే.

కొండపై శిలాఫలకము మీద పూజబలులు అర్పించిన సాగార్త్, గతించి పోయాడు, కానీ అతడి తర్వాత వచ్చిన వాళ్ళందర్లో అతడి ఉత్సాహం జ్వలిస్తునే ఉంది. ఐర్లండు ఆత్మను స్వర్గానికెత్తుతూ ఒక కలితోక్క విశ్వాసం మాత్రమే ప్రసాదించగల అలౌకికమైన దృఢత్వాన్ని అనుగ్రహిస్తూ ఆ ప్రాచీన విశ్వాసం నేటికీ దశదిశలా తనరీ సురభిళాలు వెదజల్లుతూ అట్లాగే నిలచిఉంది.

జీవము గల విశ్వాసముతో ప్రజ్వరిల్లుచున్న ఐర్లండు ఐర్లండు గానే ఉండుటకు ఆమె యొక్క గురువే కారణము. ఆమెవీరు లందరి కన్నా మహా వీరాగ్రగణ్యుడై, సాటిలేని ధైర్యంతో, ప్రేమతో, మానవత్వంతో విరాజిల్లుతూ సాగార్త్ నిలబడి ఉన్నాడు. అతడు ఐర్లండుకూ, తిరుసభకు మణి కిరీటం! శాశ్వతత్వ రహస్యాన్ని తనలో ఉంచుకోని ఒక బ్రహ్మాండమైన వ్యక్తిగా నేడు సాగార్త్ ఉన్నాడు.



## 11 వ. అ ధ్యా య ము

# ఐర్లండు మాతృ దేవీమణులు

'మధురమైన పూజబలి' సమయంలో జేసునాథుణ్ణి సందర్శించి, గాఢానురాగంతో, గౌరవ ప్రపత్తుల్తో 'జేసునాథుడు నా ప్రియ తముడు, నా ప్రాణ మిత్రుడు' అని సంబోధిస్తూ ఐరిష్ జాతి చూపిన అచంచల మైన సాహసాన్ని మనం గుర్తించాం.

శతాబ్దాల నుంచీ వాళ్ళల్లో చలించకుండా వస్తూన్న నమ్మ కాన్ని తెలుసుకొన్నాం. జేసు కోసం వాళ్ళు ప్రతి చోటా దేవాల యాలు, మఠాలు నిర్మించారన్నది మనకు తెలుసు. ఐరిష్ హృదయం మెంత ఉత్సాహ పూరితమైందీ మనకు పరిచయమైంది.

సహస్రాధికంగా యున్న గురుమఠ విద్యార్థులకు విద్యాగరువ, తగిన వసతులు ఏర్పరచి వాళ్లకు మంచి తర్బీదు యిప్పించి మహోపా కారం చేస్తూన్న ఐర్లండు గురుమఠము లన్నింటిలోకి అత్యుత్తమంగా పేరెన్నికగన్న బలిష్టమైన 'మెనూత్' (Maynooth) ఆ దేశానికి బొడ్డు రాయిగా వుంది. దాని విశాల ద్వారాలగుండా ప్రతి సంవత్సరం దేశ నాల్గు మూలల్నుంచీ నిరంతరము ఇతర దేశాలకు వెళ్తుంటారు. ఇతర దేశీయు లందరికీ ఉపదేశంచేసి పవిత్రులుగా తయారుచేసే 'ఆల్ హా లోస్' గురు విద్యాలయము, శిక్షణ పొందే తన గురు సంపత్తితో తూర్పు సముద్రం వేపు అఱ్ఱులుచాచి చూస్తూంది!

'డెర్రీ' లో అర్చ్బి. కొలంబన్ మఠం మొదలు, 'కార్క్' లో అర్చ్బి. కొల్మన్ మఠం వరకూ గల మధ్యప్రదేశంలో, జేసునాథుడి అనుగ్రహాన్ని పొంది, తమ ప్రభువు కృషిని నిరంతరాభ్యుదయ పథం లోకి తీసుకొని పోవటమే ఏకైక జీవితాశయంగా, ఆయన చుట్టూ మోకరించివున్న పవిత్రాత్మల్తో నిండివున్న ప్రాసాదాలు యెక్కడ బడితే అక్కడ చాలావున్నాయ్.

ఐర్లండులో చిరకాలం నుంచీ వస్తున్న గురువుల్ని కన్యాస్త్రీల్ని చూస్తే ప్రపంచం ఆశ్చర్యపోతుంది. ప్రపంచాన్నంతా కదిలించే శక్తిని

చూచి భ్రమిస్తుంది. వీళ్ళందరినీ సమకూర్చి, తగ్గని ప్రోత్సాహాతి శయంతో ప్రపంచం మూల మూలకీ జేసునాథుడి దివ్య సందేశాన్ని వినిపించటానికి ఐర్లండు పంపుతున్నదంటే, జనం ముక్కు మీద వేలేసు కొని చూస్తుంది!

ఈ ఆశ్చర్యం సహజమైందే. ఎందుకంటే దేవుని పిలుపు ననుస రించి ఆయనకే జీవితాన్నంకితం చేయడానికి దేవుడు యెన్నుకొన్న ఐర్లండు ప్రజల సంఖ్య చూస్తే ఆయన యిచ్చిన బహుమానానికి గల కారణం తెలిసియుండకపోతే ఆ విషయం మనకు గూడా ఆశ్చర్యం కలిగిస్తుంది.

ఆకప్పుల వైపూ, చిన్నచున్న ఆ గోపురాల వైపూ, ఆ శిఖ రాగ్రాల వైపూ మనం చూస్తుంటే వాటి క్రింద గుండా నడచి పోయిన దూర దేశాలకు వెళ్ళిన సైన్యం - గురువులు - జ్ఞాపకం వస్తుంది. బాగా తన్మయత్వం చెందిన మనస్సుకు ఆ కనబడే బురుజు గోడలూ, సాహసోపేతమైన ఆ సైన్యమే గాకుండా దానిని దాటి ఎంతో దూరంగా ఆలోచన సాగుతుంది. ఆ బురుజు గోడల కాధార భూతులు, ఆ సైన్యాన్ని నిజంగా తర్ఫీదు చేసిన ఆ మహత్తర శక్తి సంపన్నుల్నీ గుర్తిస్తుంది. పాఠశాలల్లో, వైద్య శాలల్లో ఉన్న ఆ పవిత్రమైన కన్యాస్త్రీకి, సోదరుడికీ, దైవపీఠం దగ్గరయున్న ప్రతి గురువుకూ వెనక సన్నని కంఠ స్వరాల్తో, మనోహరమైన వద నాల్తో జేసు తర్వాత అందరికీ అత్యుత్సాహాన్ని కల్పించిన ఆధార భూతురాండ్రైన మాతృదేవీ మణులు (Mothers) ఉన్నారు.

ఈ మాతృదేవీ మణులు నిరాడంబరమైన, ప్రశాంతమైన జీవి తాల్ని గడుపుతారు. పూర్వం దేవుడు ఎన్నుకొన్న జనం మాదిరిగా వాళ్ళు మందలు మేపుకొంటూ నిష్కాపట్యంగా, నిరంతర కృషిచేత, నిరాడంబరంగా జీవితాలు గడుపుతున్నారు. జేసునాథుడి త్రాసులో ఐహిక సుఖాలు తూచి, వాటన్నింటినీ నిర్లక్ష్యం చేసి భక్తి విశ్వా సాల్తో వాళ్ళు జేసుని సేవిస్తున్నారు.

నవనాగరికతా రథ చక్రాల క్రింద పడి వాళ్ళ ఆత్మలు నలిగి పోలేదు. ఐహిక సౌఖ్యాల కోసం తహతహలాడే వాళ్ళతో కలిసి

మెలిసి తిరిగి నందువల్ల వాళ్ళ ఆత్మగౌరవం యేమాత్రం నశించి పోలేదు. ప్రశాంతంగా దైవ ధ్యానం చేస్తూ నిర్విరామమైన కృషితో వాళ్లు తమ జీవితాలు గడుపుతున్నారు. శాశ్వతత్వం కోసం నిశ్చలంగా ఎదురు చూస్తూన్నందు వల్ల వాళ్ళకు లభించే మనః ప్రశాంతితో, 'ప్రపంచంలో సర్వం నశించి పోయేదే' అన్న పరమ సత్యాన్ని గుర్తించిన వాళ్ళకు లభించే సుస్పష్టాలైన భావన్లతో, జేసునాథుడి సన్నిహితత్వంవల్ల దినదినాభి వృద్ధి చెందిన బలంతో, మరియమాత పైగల అనురాగం వలన సంభవించిన సాధుత్వంతో, జేసునాథుడి యిష్టానుసారం ఆయన కంకితం చేసిన జీవితాల్తో, వాళ్లు ప్రతిరోజూ గాఢంగా వాంఛిస్తున్న కోర్కెలు తీర్చగల సర్వశక్తి సంపన్నుడైన జేసునాథుడి వద్దకు వాళ్ళ మరణానంతరం తప్పకుండా పోతారు. వాళ్ళ మరణానికి యీ శుష్క ప్రపంచం యేమాత్రం లక్ష్య పెట్టదు. కాని, దేవుడు వాళ్ళకు, తన లోకానికి రావడానికి, ఘన స్వాగతమిస్తున్న ఆసమయంలో దేవదూతలు వాళ్ళకై పలికే సంతోష పూర్వకమైన స్వాగత గీతాల్తో స్వర్గం ప్రతిధ్వనించిపోతుంది.

జేసునాథుడిపై ఆసక్తి కలగడానికి ప్రధాన కారకులు, ఆయన సైన్యాన్ని జాగ్రత్తగా చూస్తుండ వలసిందిగా జేసునాథుడి చేత నియమింప బడ్డ సంరక్షకులూ ఐన ఐర్లండు మాతృదేవీ మణుల్ని గూర్చి తెలుసుకోడానికి మన కిక్కడ మంచి అవకాశం లభించింది. మానవుడు తన మాతృదేవి బడిలో నేర్చుకొన్న పాఠాలు, ఆమె మనస్సు కెక్కించిన నియమాలూ, అతడి హృదయం లోకి ఆమె ప్రవేశపెట్టిన ధైర్యగుణం, అతడి జీవితాంతం వఱకూ తమ ప్రభావాన్ని ప్రసరింపజేస్తాయ్. భగవన్నిర్మితమై, మైనం మాదిరి మెత్తగా ఉన్న నవ్యాత్మల్ని అనురాగంతో తన చేతుల్లోకి తీసుకొని ఆమె చాలా గొప్పగా మలచి వేస్తుంది.

ఐరిష్ మాతృదేవి ఎంత కష్టమైనప్పటికీ సహించి, అత్యుత్సాహంతో ఆత్మల్ని సంరక్షించే విధానంలో జేసునాథుడితో పాటు ఆమె అన్ని విధాలా సహకరిస్తుంది. నీ వామెను యెక్కడ జూచినా దేవుడి కృషిలో నిమగ్నురాలై యుంటుంది. తన బిడ్డల ఆత్మలు చెడిపోకుండా

కాపాడుటకై దేవుడు తన వశము చేసి యున్నాడని భావించుచూ, ఆమె తన జీవితాన్నైన పణమొడ్డి వాటిని కాపాడుతుంది. ఆమెకు ఐహిక వాంఛలు తృణప్రాయాలు. ఆమె హృదయంలో నిరంతరం దైవ స్తోత్ర గీతాలు మధురంగా నినదిస్తాయ్.

ఆమె మాట్లాడే ప్రతి మాటలో దైవ ప్రశంసలే విన్పిస్తయ్. ఆమె కలుసుకున్న ప్రతి వ్యక్తికీ దైవాశీర్వాదాలు చెప్పుతూ ప్రశాంతంగా కాలం వెళ్లబుచ్చుతుంది.

'బనాక్తిలాత్' — నీ కా దైవాశీర్వాదం -'దేవునికి వేయి స్తోత్రాలు' అన్న మాటలు ఆమెకేం ప్రమాదం సంభవించినా ఆమె హృదయం లోంచి వెలువడుతై. 'దేవుడు నిన్ను రక్షించు గాక!' 'నీ మరణ కాలంలో గొఱ్ఱెపిల్లయైన జేసునాధుడు నీతోనుండు గాక!' అని ఆమె మనం కలుసు కున్నప్పుడంటే, 'నీకు నా అభివందనాలు!' అని మన మనే మాటలకు యెంతో భేదముంది.

పవిత్ర గ్రంథాల్లో చిత్రించ బడ్డ ఆ వీర వనితకు యీామె ప్రతిబింబం. ఆమె భర్త హృదయం ఆమెను విశ్వసించింది. ఆమె జీవితాంతం వఱకూ ఆయనకు మంచినే సమకూరుస్తుంది. చెడు నేమాత్రం కలుగ నీయదు 'ఆమె అవసరమైన వాళ్లకూ, దరిద్రులకూ తన చల్లని చేతు లందించి, యెట్లా సాయం చేసిందో మనం చూశాం. 'క్షమాధర్మం ఆమె నాలుకపై' యెట్లా నాట్యమాడు తున్నదో మనం గమనించాం.

తనమీాద ఆధార పడ్డ వాళ్లకోసం ఆమె ప్రతిదినం చేసేపనుల్లో ఆమె చేతులెంత వేగంగా పని చేస్తయో జాగ్రత్తగా గమనించు. 'తన గృహమార్గాల్ని ఆమె జాగ్రత్తగా పరిశీలించింది. సోమరి పోతు రాలుగా యేనాడు తన ఆహారాన్ని స్వీకరించ లేదు,' రాత్రిళ్లు ఆమె నిప్పుల కుంపటిముందు కూర్చున్నపుడు చూడు. ఆమె వ్రేళ్లు రాట్నాన్ని త్రిప్పుతున్నయ్. "ఆమె సంతానం ఆమెను ముక్త కంఠంతో 'నీవు ధన్యురాలవు' అని ప్రశంసించారు. ఆమె భర్త ఆమెనూ శ్లాఘించాడు అన్నదానికి మనం ఆశ్చర్య పడవలసిన అవసరం లేదు. ఎందు

కంటే జేసు ప్రభువును ప్రేమించిన స్త్రీ శ్లాఘనీయురాలు. ఆమె కృషి ఆమెను గుడి కవాటాల్లోనే ప్రశంసిస్తుంది."

అటువంటి మాతృదేవీ మణుల సంతానం చిన్నతనంలోనే గుడికిపోయే మార్గాన్ని నేర్చుకుంటారు. తనతో తనబిడ్డను దేవాలయమునకు తీసికొనిపోయి పద్నాలుగు స్థలాల పటాలను చూపిస్తున్న తల్లినిచూడ్డ మొకటి; పోంసుపిలాతుని సభాభవనంలో స్లీవను జేసుభుజం మీద వేసుకొన్నది మొదలుకొని మరియమాత దుఃఖిస్తుండగా ఒంటరిగా జరిగిన అంత్యక్రియల వఱకూ సంభవించిన సంగతంతా హృదయమునుంచి పొంగి పొరలే గాఢానురాగంతో ఆ బిడ్డకామె పూసగ్రుచ్చినట్లు చెప్పడం వినట మొకటీ మనం యెన్నడూ మరిచి పోగూడని దైవ విశ్వాసానికి, పవిత్రతకూ సంబంధించిన గుణపాఠ మన్నమాట! ఎక్కడ చూచినా మనకు గాఢదైవ విశ్వాసం, పవిత్రతా గోచరించటానికి యీ తర్ఫీదే కారణం! గురువులూ కన్యకామణులు యెక్కడ చూచినా గోచరిస్తారంటే యీ తర్ఫీదే కారణం!!

భగవంతుడు వీళ్లకగమ్య గోచరుడు కాడు. లేకపోతే ఏదో అడపా తడపా తమకు తోచినప్పుడల్లా ఉబుసుపోక మాట్లాడుకొనే వ్యక్తికాడు. ఆయన వాళ్లకు క్షేమ ప్రదాతైన సృష్టికర్త! వాళ్లు గాఢంగా ప్రేమించిన ప్రియమిత్రుడు! తల్లిదండ్రులు బిడ్డను కాపాడినట్లుగా వాళ్లను కనురెప్పల్లో దాచుకొని కాపాడే మహానుభావుడు! ఆయన వాళ్లపై అనురాగంతో స్వర్గాన్నుంచి అవతరించి వాళ్ల మధ్యలో నివసిస్తూన్న అత్యంత సన్నిహితుడు! దేవాలయములో సింహాసనంమీద కూర్చొని వాళ్ల మనవుల నాలకించే ప్రభువు.

కాల్వరీ బెత్లేహేముల జేసునాథుడు వాళ్ల ప్రాణస్నేహితుడు వాళ్లకుటుంబములో పవిత్రమైన వ్యక్తుడుగ భావిస్తారను విషయమును, స్వామి పుట్టిన పండుగరోజు ప్రొద్దున్నే గవాక్షాని కెదురుగా మోకరించి భక్తి ప్రపత్తులతో దైవస్తోత్రాలు చెల్లించే వాళ్లనుచూచి గుర్తించేవానికి తెలుస్తుంది. వాళ్లజీవితంలో ఆయన యెడల వాళ్లు చరించు విధమును, స్లీవముందు అవనత వదనులై నిలబడివున్న వాళ్లను

చూచిన వానికి తెలుస్తుంది. సత్ప్రసాదమందున్న జేసునాథుని వాళ్లు గుర్తించి ఆయనతో సరాసరి సంభాషిస్తారు.

ఆడుకొంటూ బడికి పోతూన్న బిడ్డ గుడి దగ్గరకు వచ్చిందంటే ఆటా పాటా కట్టిపెట్టి, దైవ పీఠం దగ్గర ఒక క్షణకాలం మోకరించి రావటానికి లోపలికి త్వరగా పరుగు తీస్తుంది. పన్లోకి పోయేటప్పుడూ, పని నుండి తిరిగి వచ్చేటప్పుడూ శ్రామికులు గుడిలోకి పోయి తన ప్రియ మిత్రుడికి మోకరించి వస్తారు. యువకులూ, కన్యలూ తమ మాతృదేవి తమ కిచ్చిన శిక్షకు విశ్వాస పూర్వకంగా, గుట్టు చప్పుడు కాకుండా, దేవాలయాల్లోకి పోతారు.

ఐరిష్ మాతృదేవి దర్శనంచేత పవిత్రమైన ఆ గృహం వైపొక్క సారి సాయంకాలప్పూట చూడు! ఆ యిల్లు సముద్ర తరంగాల మధ్య వున్న 'కెర్రీ'లో వుండనీయండి, 'మీత్' పచ్చిక బయళ్లలో వుండనీయండి, ఆకాశన్నంటే శిఖరాల్లో వున్న 'విక్లో' పర్వతాల మధ్య వుండనీయండి, చేతిలో జపమాలను ధరించి నిరీక్షిస్తూ కూర్చున్న ఆ మాతృదేవి దగ్గరకు ఆ గృహంవారంతా వెళ్ళు తారు. చెప్పాలదుకాణంనుంచో, కొలిమిదగ్గర్నుంచో తండ్రి బయలుదేరి వస్తాడు.ఆమె చుట్టూవాళ్ళంతా మోకరిస్తారు. ఐర్లండు వాళ్ళ మాతృ దేవి యైన మరియ మాతకు ఆమె సాయంకాల జపమాల స్తోత్రం చెల్లిస్తుంది

జాతి జాతంతా జేసునాథుడి ముందు మోకరించి ఉండటం చూచి, వాళ్ళాయనకు చెల్లించే దైవ స్తోత్రములు విని రాత్రి వేళల్లో దైవదూతలు సంతోషంతో ఉప్పొంగి పోతారు. స్వర్గరాజ్ఞియైన మరియ మాతతో, ఐర్లండు, జపమాలద్వారా బంధింపబడింది.

ఓహో! వాళ్ళా గృహాన్ని యెట్లా ప్రేమిస్తారు! వాళ్ళకు ఆ మాట అతి పవిత్రమైంది. కుటుంబమంటే వాళ్ళకు రాజ్యమన్న మాట! జ్ఞానవివాహం చేసుకొన్నపుడు ఉచ్చరించిన ప్రమాణ వాక్యాల ననుసరించి మరణం వేరుపరచేంత వఱకూ, తల్లి ఆ రాజ్యాను

పరిపాలిస్తుంది. ఆ గృహం యే యెడారి ప్రదేశంలో వున్నా సరే, ఎంత దీనమైనా సరే, ఎంతో కష్టపరిస్థితులు ఏర్పడ్డ తప్ప వాళ్ళు దానిని వదలరు.

ఆమె పూర్వీకులకూ ఒకప్పు డామెకూ నివాస స్థానమైన స్వగృహ ద్వారాన్ని ఆఖరి సారిగా ప్రవేశించిన ఒక ఐరిష్ వృద్ధ మాతను నేను చూచిన జ్ఞాపకం వుంది. ఆ యింటి కప్పంతా కూలి పోయింది. కిటికీలు బద్ధలై యున్నయ్. అవి అంధ నేత్రాల మాదిరిగా ఇది వఱకు సంసార సౌఖ్యమునకు కారణమై యిప్పుడు సమాధిని బోలి యున్న ఆ యింటినుండి దాని ముందు న్న మార్గం వేపు గుడ్డిగా చూస్తున్నయ్. ఆమె లోపల పొంగి వచ్చే ఉద్రేకాన్ని ఆప బట్టలేక కళ్ల వెంబడి నీరు కారుస్తూ ఆ నేల మీద కూలబడి పోయింది. ఆమె పరితాపంతో వణకిపోతూ ఆ ద్వారం దగ్గర నున్న రాతిగడపను మాటి మాటికీ ముద్దు పెట్టుకొంటుంది. ఆ శిలా గడప అతి పవిత్రమైంది. యెందుకంటే కొన్ని తరాల వాళ్ళు దానికి స్వాగతస్తోత్రాలు చెల్లించారు. ఆ ప్రదేశమంతా అసంఖ్యాక పాదాంకితం! 'జేసునాథుడు నిన్నాశీర్వదించుచున్నాడు' అని ఆ ప్రదేశానికి వచ్చిన ప్రతి వ్యక్తి పలికిన ప్రార్థన వల్ల ఆ ప్రదేశమంతా పునీతమైంది! పాపం ఆమె దుఃఖ నిమగ్నురాలు! ఆమె ఎన్ని సంవత్సరాలు తరచుగా సంతోషంతో ఆ గడపకు స్తోత్రాలు చెల్లించింది! ఇప్పుడా గడప ఆమె కన్నీటిధారల్తో తడిసి పోయింది. శిథిలమై పోయిన గృహాని కామె వీడ్కోలు చెప్పుతుండగా దానికి పైగా నిలబడి యున్న తన చిరకాల మిత్రుల్ని మళ్ళీ ఒక్కసారి చూచింది. ఆమె గతించిపోయిన తన స్నేహితుల్ని ఒక్కసారిగా జ్ఞాపకం చేసుకొన్నది. "ఇక్కడున్న వాళ్లందర్నీ భగవంతుడు రక్షించుగాక!" అని ఎప్పుడో పల్కిన ప్రియమైన మాటలామెచెవుల్లో యిప్పుడు ప్రతి ధ్వనిస్తున్నయ్. ఆమె హృదయాన్నా పల్కులు కదిలించి వేసినై.

స్వగృహం పై వున్న యీ గాఢానురాగమే ఐర్లండు కష్టాలన్నింటికీ ప్రధాన కారణం. నిర్వాసితులైన వాళ్ళకే గాకుండా, దేశంలో వుండి నిరీక్షిస్తూన్న మాతృదేవీమణుల కూడా నిరంతరం హృదయానికి బాధకలిగింది యీ స్వగృహాభిమానమే. దైవ సేవకు తమ్ము

దా మంకితము చేసికొని నిరంతర కృషి చేస్తూన్న వారల మాతృదేవీ మణులు, నజరేతు గ్రామంలో తన గృహంలో ఏకాకి జీవనం గడుపుతూన్న మరియమ్మ గారిని జ్ఞాపకం తెస్తారు. భగవంతుడు వాళ్ళకిచ్చిన సంతాన నిధిని తమ అనురాగ జీవితాల్లో భద్రంగా దాచి సంరక్షిస్తున్నారు. తమ జీవిత ప్రకాశాన్నుంచీ విడిపోవడమన్న విషయం తెలిసినప్పటికీ వాళ్లు జేసు నాథుడి పిలుపుకు ఆ నిధిని హృదయపూర్వకంగా ఆయన కోసం యిచ్చివేస్తారు. మరియ మాత, తన ప్రియ కుమారుడు వెళ్ళిపోయిన తర్వాత నిశ్శబ్దమైన నజరేతు గృహంలో తిరుగాడుచు గతించి పోయిన రోజుల్లాగా మళ్లీ జీవిస్తూ, పునః సమైక్యత కోసం తహ తహ లాడినట్టుగా 'మెనూత్' సైన్యానికి--గురువులకు--మాతృదేవీ మణులైన వీరవనితలు గూడా జీవిస్తున్నారు. క్రీస్తునాథుని ద్రాక్ష తోటలో పనిచేయుటకు 'ఆల్ హాల్లోస్' అను మఠము నుండి వెళ్ళిన పవిత్రాత్ములకూ, ఋషితుల్యులైన ఐరిష్ కన్యా స్త్రీలకూ వాళ్లు వీరవనిత లైన మాతలు. మరియ మాతకు మాదిరిగా, వాళ్లు ప్రేమించిన వాళ్లతో పునః సమైక్యత పొందడ మనేది వాళ్ళు మృత్యు కవాటాలు దాటిపోతేనే లభిస్తుంది.

తమ సంతానాన్ని జేసునాథుడి కృపికర్పించిన మాతలే గాకుండా, జీవిత సంఘటనల ద్వారా తమ సంతానాన్నుంచి వేరు చేయబడి యింట్లో అలసి కూర్చొని వాళ్ళ పాదాల ధ్వని యేమైనా వినిపిస్తుందేమోనని నిరీక్షిస్తుండే మాతలూ ఉన్నారు వాళ్ళు భయంకరంగా ఘోషించే అనంత సముద్రాల ద్వారా దూరమై పోయినప్పటికీ, వాళ్ళ హృదయాలు మాత్రం దూరంకాలేదు. భూలోకంలో ప్రతి దేశంనుంచీ హృదయాన్నీ హృదయాన్నీ బంధించి వేసె ప్రేమానురాగ వార్తలు కాంతి వేగంతో అక్కడికి ప్రసరిస్తున్నాయ్. మంచు పింజరముల మాదిరిగా ఆ సందేశాలు సముద్రాలు దాటి, ఐర్లండులో కోకొల్లలుగా ప్రతిదినం వచ్చి పడుతున్నాయ్! పొలాల మీదుగా, బురద నేలమీదుగా ఆవార్త లెగిరి పర్వతాల గుండా ప్రయాణం చేసి, తమ కోసం వేచియున్న వాళ్ళ హస్తాల్లోకి వచ్చి దూకుతున్నాయ్. ఈ మంచు తెర లెక్కణ్ణుంచి వస్తున్నాయ్? 'ఎరిన్' సంతానం నుంచి ప్రేమను దాని చిహ్నాల్ని మోసుకొని అవి 'ప్రపంచ తరంగాల'

మీదుగా వస్తున్నాయ్. ఇల్లూ వాకిళ్ళూ వదలి దేశదేశాలకు చెల్లా చెదరైపోయిన సంతానం వద్దనుంచి ఉత్తరాలు, తమ కోసం నిరీక్షిస్తుండే మాతల దగ్గరకి రివ్వుమని వచ్చి వ్రాలుతై. నిజమైన ప్రేమ వాళ్ళ పనుల్లో బైటపడుతుంది. ఇటువంటి విశేషం -ప్రేమ- నిర్వాసితులైన వాళ్ళలో కొరతపడి యుండ లేదు. ఎందుకంటే, వాళ్ళు యిరువై సంవత్సరాల కాలంలో, కొన్ని మిలియన్ల పౌన్లధనాన్ని తమ యిండ్లకు పంపించగలిగారు. వాళ్ళకు సముద్రం మీదుగా సంతోషవార్తకు బదులుగా దుఃఖసమాచారము వచ్చిపడితే, వాళ్ళ కున్న అంచంచల విశ్వాసం వల్ల ఓర్పుతో సహిస్తారు. కష్టాలు సంభవిస్తే, వాళ్ళ కున్న గాఢ విశ్వాసం వల్ల వానిని ఓర్పుతో సహిస్తారు.

ఉదాహరణకు నాకు తెలిసిన ఒక సంఘటన చెప్తాను. ఒకామెకు ఒక్కడే కొడుకు. అతడిపై ఆమె పంచప్రాణాలు పెట్టుకొని వుంది. ఆ పుత్రుడు అమెరికాలో వున్నాడు. ఈమె మాత్రం ఐర్లండులోనే వుంది. ఆమె కొండంత ఆశపెట్టుకొన్న ఆ ఏకైక పుత్రుడూ అమెరికాలో ప్రమాదానికి గురియై చనిపోయాడు. ఆమె కా విషాదవార్త తెలియ జేయడానికి యెవరికీ ధైర్యం చాల్లేదు. మరుసటి ఆదివారం నాడు ఆ ఐరిష్ మాత పూజబలి అయిన తర్వాత గుడిలో జేసునాధుడి యెదుట మోకరించి యుండగా, ఆలోచనా పాలోచనా లేకుండా ఒకామె ఆమె దగ్గరికి పోయి "నీ కొడుకు చనిపోయి నందుకు నేను విచార పడుచున్నాను" అని అన్నది.

"ఓ! ఓ! అతడు చావలేదు. అతను సురక్షితంగానే యున్నాడు" అని ఆ మాత పలికింది.

"అతడు చనిపొయ్యాడు: ఒక పెద్ద దూలం పడి అతన్ని నలిపి వేసింది". కానీ వాళ్ళు నీకీ విషయం తెలియనీయ దలచుకో లేదు". అని, ఆ అమాయకురాలు మళ్ళీ ఆమెకు నొక్కి చెప్పింది.

ఆ మాత దిగుల్తో పక్కవాళ్ళ వైపు చూసింది. ఆ తెలివితక్కువ స్త్రీ చెప్పిన మాటల్ని వాళ్ళు నిర్ధారించారు. ఆమెకు నెత్తిన పిడుగు

పడ్డల్లి అలన ఇనపచువ్వ పట్టుకోని దీనంగా విలపించ సాగింది. ఆమె, మొదటిసారి పొంగివచ్చే దుఃఖాన్ని అపుకొన్న తర్వాత, ఆమెలో ధైర్యం వచ్చింది. జేసునాధుడి వైపు కళ్ళెత్తి, "ఓ! జేసుప్రభూ! అమెరికాలో సిన్ను తెలియని వాళ్ళతో ఉన్నప్పటి కన్నా, అతడు, నీతో సుఖంగా సురక్షితంగా ఉన్నాడు" అని కూడా పలికింది.

బురద నేలతో చుట్టుముట్టి, చల్లని నీడ లిచ్చే వృక్ష సముదాయం క్రింద, తెల్లని గోడల్తో ఉన్న యిండ్లతో, ఐర్లండు మధ్య మైదానంలో ఒక గ్రామం ఉంది. ఈ గృహాల్లో ఒక దాంట్లో మార్గ దర్శకమైన ఐరిష్ మాత ఒకామె నివసిస్తున్నది. ఆమె ఆత్మాభిమానం కల్గిన స్త్రీ. ఉన్నదాంతో సంతృప్తిచెందే స్వభావం కలది. ప్రాపంచక దృష్టితో చూస్తే ఆమె జీవితం ఒంటర్ది కష్టమైంది. ఆమె ఎల్లప్పుడూ నెమ్మదిగా ప్రశాంతంగా ఉంటుంది. కిటికీమీద వంగి నిలబడున్న ఆమె, తనకోసం వచ్చిన సానుభూతిపరుణ్ణి చూచి మన ప్రభువు చాలా మంచి వాడు. నేను బాధ లనుభవించాలని ఆయన కోరిక. ఆయన పవిత్రా భీష్టానికి సుస్వాగతం!" అని, తనకు వచ్చిన పక్షవాతానికి సమాధానంగా చెపుతున్నది. ఆమె సంతాన మంతా 'దైవానుగ్రహం వల్ల అమెరికాలో సురక్షితంగానే ఉన్నారు. వాళ్ళు, చాలా సార్లు ఆమె నక్కడికి రమ్మనంటూ చాలా ఉత్తరాలు వ్రాశారు. కానీ ఆమె అక్కడికి పోవడానికి నిరాకరిస్తుంది. ఆమె జ్ఞానస్నానం పొందిన దేవాలయ నీడల్లోనే' తాను భూస్థాపితము చేయ బడాలని "ఐర్లండు నుంచే స్వర్గానికి పోవాలనీ" ఆమె కోరిక. ఆమె వాళ్ళందరి ఫొటోల్ని గోడలకి తగిలించింది. వాటి ముందు ప్రతిరోజూ దినమంతా కూర్చొని చేతిలో జపమాల ధరించి అట్టే పైకి జూస్తూ "వాళ్ళకు జపము అవసరము! చర్చి కవాటాల్ని ఏనాడూ గుడిమొగ మెరుగని వాళ్ళ మధ్య వాళ్ళు జీవిస్తున్నారు" అని పలుకుతుంది.

ఆ పవిత్రాత్మ జపాలు, ఆమె ప్రియ పుత్రుల్ని చెడు నుంచి రక్షించే ఎటువంటి కవచాలు! తన్ను చూట్టానికి వచ్చిన వాళ్ళకు స్వాగతం పల్కుతూ, మందహాస వదనంతో దైవ విశ్వాసానికీ, దైవ స్తోత్రాలకీ కేంద్రమైన ఆ ఐర్లండు భూమిలో, తన స్వగృహంలో కూర్చొని నేటికీ ఉంది.

కాచిన కొలంది మంచి బంగారమునకు
వన్నె హెచ్చెడి విధమున ఎన్నియేని
కష్టములబడి విజయమ్ము గాంచి మిగుల,
సర్వలోకేశ్వరుని మనసార నమ్మి
హృదయముల ప్రేమ నిండార, తృప్తచిత్తు
లైన పరమ పవిత్ర మహాత్ము లౌర
కలరు నేటికి ఐర్లండు గడ్డమీద.

ఐరిష్ మాత! భూలోకంలో అజ్ఞాతులై ఉన్న అనేక మంది పావన పురుషుల్లోకి ఆమె అగ్రగణ్యురాలు. తన నాల్గు గోడల మధ్య మహారాణిగా ఉంటూ జేసునాథుడి అడుగు జాడల్లో ప్రవర్తిస్తుంది. మార్గం చూపించమని జేసునాథుడు తనకు ప్రసాదించిన బిడ్డలకు సరైన మార్గం శాసిస్తు రాజ్యం చేసే జేసు ప్రేమికురా లామె! పవిత్రతతో, అనురాగంతో తన క్రిందివారల్ని తనవద్ద కాకర్షించుకొనే జేసునాథుడి సామంతురా లామె! నిరంతర కృషి చేత అలసి పాత జప మాలను ధరించిన ఆమె చేతులు, తాను కలుసుకొన్న ప్రతి ఆత్మనూ పట్టుకొని మంచిని చేయించగల్గిన హస్తము లవి. నిద్రించే బిడ్డలకోసం నిరంతరంగా ప్రార్థించిన ఆమె పెదవులు శాంతి చిహ్నాలు! ఆమె కను బొమలపై శాశ్వతమైన సాధుత్వం, సర్వేశ్వరేచ్ఛానువర్తనం పీఠం వేసినై భగవంతుడి మైత్రిలో సురక్షితమైన హృదయాన్ని తెలియ జేసే గాఢవిశ్వాస కాంతుల్తో ఆమె నేత్రాలు ప్రకాశించుతున్నయ్

ఓ! ఐరిష్ మాతలారా! మీరు జేసునాథుణ్ణి తెలుసుకొన్నారు! ఆయన తప్ప మీ కేమీ తెలియదు! ఆయన కాకుండా మీకు లభించిన విజయాలను మీరు లెక్కలోకి తీసుకోరు. శాశ్వతత్వ ధ్యానం చేత లభించిన విశాలమైన దృక్పథంతో మీరు ప్రపంచాన్ని చూస్తున్నారు.

వేదసాక్షికి గల ఓర్పువంటి ఓర్పుగల వారు మీరు! జేసునాథుడి బలంతో మిక్కిలి బలిష్టులు! మీ దర్శన మాత్రం చేతనే మానవుల మనస్సులు దైవం వైపు తిరుగతై! ఓ! ఐరిష్ మాతలారా! మీరు మాకు గల దైవ విశ్వాసానికి సజీవ నిదర్శనాలు!

తాము గాఢంగా ప్రేమించిన వాళ్ళ పక్షాన చెల్లించే దైవ స్తోత్రాల్తో, ఐర్లండు నంతా ప్రతిధ్వనింప చేస్తున్న ఐరిష్ మాతల కంఠాలు, నేను ఐర్లండు నొకసారి తలచుకొని మళ్ళీ వింటున్నా. కొండలూ, కోనలూ, మైదానాలు దాటి ఆ ఐరిష్ మాతలు జేసు నాథుడి దివ్య సందేశాన్ని దేశదేశాల కందించేంతవరకూ ఐర్లండు భవిష్యత్తు సురక్షితమే అన్నది నాకు తెలుసు. వాళ్ళు పవిత్రులు అంటే, ఆశ్చర్య మేమీ లేదు. దరిద్రతో భగవంతుడి ఇచ్ఛకు సర్వ కాల సర్వావస్థలందూ కట్టుబడి ఉండడంకన్నా పవిత్రత ఏముంది? ఋషి తుల్యులైన ఓ! ఐరిష్ మాతలారా! మీరు బాగా గుర్తించి, గాఢంగా ప్రేమించిన ఆ జేసునాథుడి తిరుహృదయాన్ని మా కోసం, మీరు ప్రార్థించండి!



## 12 అధ్యాయం

# మతం కోసం చంపబడ్డ ఐర్లండు చరిత్ర

ప్రపంచచరిత్రలో, మతం కోసం చంపబడ్డ ఐర్లండుగాథ మహా భయానకమైంది. మహోన్నతమైంది. చిరకాలం దారుణమైన వేద హింస జరిగినందువల్ల అది భయానకమైంది. అందరి హృదయాల్లో దైవవిశ్వాసబలిమి రాజ్యం చేసినందువల్ల అది మహోన్నతమైంది. ఐరిష్ చరిత్రకు సంబంధించిన ఈ పుటల్లో సరిసమానంగా తులతూగ కల్గిన తిరుసభ చరిత్రపుటలే లేవు. అనాదినుంచీ క్రైస్తవ చరిత్ర చాలా దారుణమైన హింస లనుభవించినది. కానీ, పురుషులూ, స్త్రీలూ, బాలురూ, మొత్తం జాతంతా నిస్సందేహంగా స్లీవ వేయ బడడానికి కాల్వరీ నెక్కడం ఇంతకు మునుపెన్నడూ చూల్లేదు ఇంతకు ముందు మతంకోసం, ప్రాణాలు ఇంతగా బలివ్వడమన్నది చూల్లేదు సాధువులూ, పండితులూ నివసించే ఆ ద్వీపం, కష్టాగ్నిజ్వాల లీదాల్సివచ్చింది. ఆ ద్వీపం మతంకోసం ప్రాణత్యాగం చేసిన భూఖండమైంది.

ఈ హత్యానేరం, అమానుషత్వం, ఇంగ్లీషువాళ్ళపై పెట్టకుండా, అధికారంలో ఉన్న వాళ్ళపైనా, వాళ్ళ తొత్తులపైనా మోపాలి. విజ్ఞానంలో సోదరదేశాలు కలుసుకొన్నప్పుడు వాటిమధ్య స్నేహం పెంపొందుతుంది, అన్న యాదార్థ్యాన్ని చరిత్ర పదే పదే ఋజువు చేస్తున్నది. దురదృష్టవశాత్తు ఇంగ్లీషుజాతికి ఐర్లండు విషయం అసలే తెలియకుండానైనా ఉండాలి లేకపోతే అది చెడ్డదేశమన్న అపోహతోనైనా తెలిసిఉండాలి. ఈ నాటికూడా ఈ విషయం ముమ్మాటికీ సత్యమైందే

మేము, ఐర్లండు మతంకోసం ప్రాణాలు బలిచ్చిన చరిత్రను చెప్పడం, కలహాన్ని రేగొట్టడానిక్కాదు. (భగవంతుడు కలహం లేకుండా జేయుగాక!) అన్ని కష్టాల్ని జయించడానికి కారణమైన ఆ ఐరిష్ జాతిలో ఉన్న అచంచల దైవ విశ్వాసాన్ని చూపించడానికీ జేసునాథుణ్ణి అనుకరించినందువల్ల, జేసుమాదిరిగా తమ్మెంత క్రూరంగా బాధించిన దుర్మార్గులపట్ల ఆమె చూపించిన ఆ క్షమాస్వభావాన్ని తెలియచేయడానికి మాత్రమే ఆమె హత్యా చరిత్రను మీ కంది

స్తున్నా. పాపం ఐర్లండు బాధల్లో మునిగి, కొరడాదెబ్బల్తో శరీర మంతా రక్తమయమై, కళ్ళుపోయి, మాటిమాటికీ అలిసిపోయి కిందకు వాలిపోయిన తన తలనెత్తుతూ, ఆ కిరాతకుని హృదయం కొంచెం దయార్ద్ర మైనట్లుగా తోస్తే, స్నేహంతో వాడికి తన చేయి చాస్తూ స్లీవ వేయబడ్డ తమ ప్రభువైన జేసునాధుడి మార్గం అనుసరిస్తూ ప్రపంచానికి మహోన్నతమైన క్రైస్తవ ఉదార స్వభావాన్ని అందిస్తూ, ఆమె ఐహిక సుఖాలన్నిటినీ అధిగమించింది. లోకసంబంధమైన వికవేమును త్రోసివేసింది.

దైవ విశ్వాసాన్ని కల్గిదాన్ని వ్యాప్తి జేసి, విగ్రహారాధన చేసే మూఢ మతాలన్నిటినీ పారద్రోలి, నాగరికతా సంస్కృతుల్ని చేకూర్చి, ఐర్లండు ఒక వెయ్యి సంవత్సరాలకు పైగా యూరపు ఖండానికి మహత్తర సేవ చేసింది. అజ్ఞాన మతము చేత గాక విరమించుకొన్న చోట, పతిత మతావలంబకులు హింసను ప్రారంభించారు. ఆ దేశంలో ఉన్న దైవ విశ్వాస కాంతుల్ని రూపు మాపడానికి నిష్కారణ ద్వేష తరంగా లొక దానిపైన ఇంకోటిగా ఆగకుండా వచ్చి పడ్డాయ్ ఐర్లండు ఇన్ని అష్టకష్టాలకు లోనుగావటానికి కారణం, ఆమె ప్రాచీన సంప్రదాయానికి అంటిపెట్టుకొని ఉండడమే. గురువు తోడేలు జాతికి సంబంధించిన మృగం, ఆయన్ని నాశనం చేయాలన్నారు "ఐర్లండులో గురువుల్లేక పోతే దాని కిన్ని కష్టాలు వచ్చి ఉండేవి కావు". అని ఒక సైన్యాధికారి ప్రకటించాడు. 1641 లో ఇంగ్లండు పార్లమెంటులోని సభ్యులంతా, 'ఐర్లండులో కతోలిక్కు మతాన్నే మాత్రం సహించరు. ఒక్క ఐర్లండులోనే కాదు, బ్రిటిష్ చక్రవర్తి ఏలుబడి క్రిందున్న ఏ దేశంలోనూ కతోలిక్కు మతాన్నంగీక రించరు'. అని ఏక గ్రీవంగా తీర్మానించారు. ప్రతి దేవాలయము ధ్వంసం చేయబడింది. ప్రతి బలి పీఠం నాశనం చేయబడింది. ప్రతి గుడారం పాడుచేయ బడింది. ఐరిష్ జాతి హృదయాల్లో ఉన్న ఆ దైవ విశ్వాసాన్ని మాత్రం వాళ్ళేమీ చేయలేక పోయారు. కతోలిక్కుగా ఉండడ మంటే, దేశ ద్రోహిగా తిరుగుబాటు దారుడగా ఉండడమన్న మాట. ఈ అపనింద నుంచి తప్పించు కోవాలంటే, దైవ విశ్వాసాన్ని వదలుకోవడ మన్న మాట. 'ఇంతకన్నా వారినుండి కోరేదేమీ లేదు'. విశ్వాసమును వదలడము

ఐర్లండు చేయదు. దైవాన్నీ, తిరుసభను అనుసరించడమా? లేకపోతే భయపడి, పిరికిపందలై శత్రువులకు దాసోహ మనడమా? అన్న ప్రశ్న వచ్చినప్పుడు, ఐర్లండు తన ఆచారా న్ననుసరించడాని కేమాత్రం వెన కాడ లేదు. సంస్కారులైన ట్యూడర్ల నుంచి వస్తూన్న బాధల్లో ఆమె నిర్భయంగా ప్రవేశించింది ఆ బాధ 18వ శతాబ్దంలో కాల్వరీ శిఖరా గ్రం అందుకు నేవరకూ క్రమక్రమంగా పెరిగిపోయింది. ఐర్లండు శిక్షా శాసనాల్తో బంధింప బడ్డది.

భగవంతుణ్ణి ప్రార్థిస్తామన్న నేరానికి మొత్తం జాతి నంతా సమూలంగా నశనం చేయడానికి పూనుకొన్న కిరాతకుల దారుణ చర్యల్ని, అ చరిత్ర మనకు తెలియ జేస్తుంది. దాన్ని చదవడం చాలా విషాదకరమైన విషయం.

ట్యూడర్ దూతలు దేశాన్ని తగలపెట్టి, చంపి సర్వనాశనం చేసారు. ప్రజల కాధారాలైన పంటల్ని, పశువుల్ని దోచుకుపోయారు. వాళ్ళు మిగిల్చింది శవాలు, బూడిదా మాత్రమే. రక్తదాహం గొన్న కిరాతకులు సుక్షేత్రాల్ని వశం చేసుకొన్నారు. తింటానికి తిండీ, తల దాచుకోడానికి కొంపా, దున్నుకోడానికి భూమీ లేక ఐరిష్‌జాతి అల్లాడి ఆకులు మేసింది. తాము, ఐరిష్ వాళ్ళూ, కతోలిక్కులూ కావడం వల్ల, తమను మెడ పట్టుకొని బైటికి గెంటేసి, ఎవళ్ళోకూడా తెలియని కొత్తవాళ్ళు, తమ గృహాల్ని ఆక్రమించుకొని ఉండడం, ఐరిష్ ప్రజలు కళ్లారా చూచారు. "మా సైనికదళం, అన్నివస్తువుల్నీ స్వాధీనం చేసుకొని, 7,000 మందిని అన్నమో అని అల్లాడేటట్లు చేసింది." అని సర్ W. కోల్ తెలియ చేస్తున్నారు. ఎలిజబెత్ కాలంలో విధ్వంసం చేసేదాకా, ఒరనుంచిపైకి తీసినకత్తి మళ్లీ ఒరలోకి పోలేదు. తొట్టెలో పడుకొన్న పసిపిల్లాదిగా అందర్నీ నరికేసి, కనపడ్డ పసిపిల్లనల్లా గొంతు పిసికి చంపేసానని మహా ఘనకార్యంగా చెప్పుకుంటూ తిరుగుతున్న ఆ హంతకుడి బారి పడకుండా తప్పించుకొని పోవడానికి, శవతుల్యము లైన కొందరి ఛాయలు మాత్రం చలిచప్పుడు గాకుండా మహారణ్యాల్లోకి ప్రాకిపోయినై.

కానీ, స్టూఆర్టుల కాలంలో, క్రామ్‌వెల్ కాలంలో ఐరిష్‌జాతి ఇంకా ఘోర ఉపద్రవాలకి లోనుగావల్సి వచ్చింది. రోమునగరం

అగ్నిజ్వాలల్లో తగలబడి పోతున్నప్పుడు, ఆ మంటలమధ్య నిలబడి సంతోషంతో ఆడుతూ పాడుతూ ఉన్న నీరోచక్రవర్తి కాలము నాటి భయంకర దృశ్యాన్ని ఐరిష్ వాళ్లొకసారి గుర్తు తెచ్చుకొన్నారు. క్రామ్‌వెల్ పెట్టిన అగ్నిముందు రోముమంటలు కేవలం ఒక అగ్నికణం లాంటివి. క్రామ్‌వెల్ రగిల్చిన అగ్నిజ్వాలలు ఐర్లండును భస్మీపటలం చేస్తినె. ఐర్లండు భగభగా మండిపోతున్నప్పుడు ఆ దుష్టులు మహా సంతోషంతో చిందులు త్రొక్కుతూ కీర్తల్ను పాడారు.

చావగా మిగిలిన ప్రజలు ధర్మంగాని, కరుణగానిలేని పరమ కిరాతకుల చేతుల్లోపడి ఉరికంబాలు కౌగలించుకొన్నారు. ఆకల్తో మలమల మాడుతున్నవారిని గూడా ఏమాత్రం జాలిచూపకుండా ఆ దారుణ రాక్షస సమూహం, వాళ్లను వేటాడింది. ఆనాటి భయంకర సంఘటల్ను ప్రపంచ చరిత్రలో ఏనాడూ మనం విని ఎరుగం. పాపం ఆ ఐరిష్‌వాళ్ళల్లో కొంతమంది చావుతప్పి కన్ను లొట్టపోయిన సామెతగా 'కానాట్' (Connaught) ఎడారి ప్రదేశాలకు పారిపోయారు.

ఐరిష్ జాతినే నిషేధించారు. కతోలిక్కుప్రభువుల, మహానీయుల 'ప్రాణ మాన ధనాల్ని దక్కనీయం' అని ప్రకటించారు. వాళ్ళందర్నీ 'కానాట్'కు తరిమేసారు. 'కానాట్'లో దుర్భర జీవితాన్ని గడపటం కన్నా, కొందరు చావునే కోరారు. మరి కొందరు ద్వీపాంతర వాస శిక్షను ఆకాంక్షించారు. షానన్‌కు తూర్పున కనపడ్డ ప్రతి కతోలిక్కుకూ మరణమే శిక్షన్నారు. వాళ్ళ ఉద్దేశం, మొత్తం ఐరిష్ జాతిని నామరూపాలు లేకుండా నాశనం చేయడమే అయి ఉన్నట్లు గోచరించింది. కొందరి ఉద్యోగుల్లో, సైనికుల్లో ఉన్న మానవత్వం, ఆ కఠిన శాసనోల్లంఘునమును చేయించింది. వాళ్ళు రహస్యంగా కొంతమంది అనాథులపై జాలిదలచారు. లేకపోతే నిజంగా ఏనాడో ఐరిష్ మసైపోయి ఉండేది.

నివసించే జనం లేక మొత్తం పట్నాలు పట్నాలే నిర్జన స్థలాలైపోయినై, వ్యవసాయం చేసే వాళ్ళు లేక సుక్షేత్రాలన్నీ వట్టి బీడు భూములుగా మారిపోయినై. ఐరిషియులు గాల్వేనుండి తరిమివేయబడిన తర్వాత, అందమైన గాల్వే నౌకాశ్రయం రూపారిపోయింది.

గాల్వే నివాసులు గృహాలన్నీ లివర్పూల్ వ్యాపారస్థులికి దానం చేయబడ్డయ్. ఖాళీయైపోయిన ఇళ్ళబజార్లన్నీ ఋణదాతలకిచ్చి, పార్లమెంటు తన ఋణాల్ని తీర్చుకుంది. ఉదాహరణకి కావాలంటే ఈ విషయం గమనించండి! క్లాన్రైన్ ఆర్థర్ కు, వెక్సెఫర్డులో 200 ఇళ్ళిచ్చి తన బాకీ రద్దు చేసుకుంది.

అగ్ని, కత్తి, కాటకం మహావేగంతో ఐరిషీయుల్ని చంపినై. కానీ నాశక సమూహం తలచినంత త్వరలో అవి నాశనం జేయలేదు. ఐర్లండు మరో భయంకర పరిస్థితి నెదుర్కొనవలసివచ్చింది. ఈ నాడు మీరు నమ్మకపోవచ్చు. కానీ అది పరమసత్యం. జాతిని నాశనంచేయడానికి బానిసవ్యాపారస్థుల్ని ఆహ్వానించారు. ఆఫ్రికా కీకారణ్యాల్లో జరిగిన దారుణాల్ని నిరాధారమైన ఐర్లండు మీదికి మరల్చారు. అందమైన యువతుల్ని, యువకుల్ని పట్టుకొన్నారు. బానిస వ్యాపారస్థులు బైలుదేరే ఓడ ఎక్కించారు. బానిసలుగా తమజీవితాలు నాశనం చేసుకోండని వాళ్ళందర్నీ పశ్చిమ ఇండియాలోని తోటల యజమాన్లకు అమ్మేసారు. ముప్పైమూడు సంవత్సరాలు ఈ రాక్షసులు ఐరిష్‌వాళ్ళ ప్రాణాల్తో చెర్లాటలాడారు. ఈ ముప్పైమూడు సంవత్సరాల్లో 20,000 మొదల్కొని 100,000 మంది వరకూ ఐరిష్‌వాళ్ళు పరమ కిరాతకుల ఘాతుక కృత్యాలకు బలైనారు.

కానీ, అన్ని ప్రయత్నాలు ఆఖరికి అతిదారుణ ప్రయత్నం కూడా విఫలమైపోయింది. ఒక జాతిని రూపుమాపడమనేది అసంభవమైన విషయమన్న సత్యాన్ని ఆ హింసావాదులు గుర్తించారు. కతోలిక ఉత్సాహశక్తివల్ల ఐర్లండు బ్రతగ్గలిగింది. అభ్యుదయం చెందగల్గింది. అచంచలమైన కతోలిక విశ్వాసం వల్ల క్షీణించిపోయిన ఐర్లండుకు నూతనతేజం కలిగినవెంటనే, మరణానిక్కూడా భయపడకుండా తన ప్రజానివాసాల్ని వశపర్చుకొన్న ఆ క్రొత్తవ్యక్తులున్న చోటుకు కళ్ళకొనల్లో ప్రాణాలుపెట్టుకొని తడబడుతూ పోయారు. పానన్‌లో ఉరికంబాలు సిద్ధంగావుంచి, బల్లాలు చేతపట్టుకొని వేయి కండ్లతో ఆ పరమ కిరాతకులు కాపలాకాస్తున్నప్పటికి వాళ్ళ కళ్ళల్లో దుమ్ముకొట్టి దానిగుండానే ప్రయాణంచేస్తూ, మహారణ్యాల్లో

దాక్కుంటూ, అన్నపానాదులకూడా దూరమై వస్తువులంటూ తా మిదివరకు వదలివెళ్ళిన ప్రదేశాలను తిరిగి చేరుకున్నారు. వాళ్ళను హింసించిన ఆ పరమకిరాతకుల హృదయాలు మారి, మళ్ళీ తమ బ్రతుకును అంగీకరించేంతవరకు సంవత్సరాలకు సంవత్సరాలుగా, ఆ ఐరిష్‌వాళ్ళు తరగని ధైర్యవిశ్వాసాల్తో ఆ శుభసమయం కోసం వేచి యున్నారు. శాసనాలదృష్ట్యా వాళ్ళకు మనుగడలేదు. "కతోలికు మతస్థుడు యీరాజ్యంలో బ్రతకడానికి శాసనా లంగీకరించవ్. ప్రభుత్వం చూచి చూడనట్లుంటే నరేగాని, లేకపోతే వాడు గాలిపీల్చడాని కూడా వీల్లేదు" అని 1759 లో ఒక న్యాయాధికారి ఒక కతోలికు మతస్థుడికి తీర్పుచెప్పాడు. అటువంటి న్యాయాధికారికి నిజంగా వాతావరణంపై అధికారం చెలాయించి, దాన్ని తన అదుపుఆజ్ఞల్లో ఉంచుకోగల తాహాతే ఉన్నట్లైతే, ఎన్నడో ఐరిష్‌జాతికి సంఘమరణం సంభవించే దుస్థితే పట్టి ఉండేది.

దేశంలో పార్లమెంటును స్థాపించారు. కానీ, ఏ కతోలిక్కు మతస్థుడూ దాన్లో అడుగుపెట్టడానికి వీల్లేదు. ఆ పార్లమెంటును గురించి లెకి (Lecky) ఇట్లు చెప్పుచున్నాడు. "18 వ శతాబ్దం ప్రథమపాదంలో ఐరిష్ పార్లమెంటు నియోజకవర్గం చూపించినంత అసహనత్వం, అహంకారం, అమానుషం, ఇంకే నియోజకవర్గాలూ చూపించలేదు." ఆ పార్లమెంటు ఐరిష్ వాళ్ళు కన్నీళ్ళు కార్చేటట్లుగా శాసనాలు చేసింది. ప్రభుత్వోద్యోగాల్లో, సైన్యంలో, నావికా సైన్యంలో, తదితరమైన చిల్లర మల్లర ఉద్యోగాల్లోకూడా కతోలిక్కు మతస్థుడు ప్రవేశించడానికి వీల్లేకుండా చేసారు. ఐరిష్ వాళ్ళకు వారసత్వపు హక్కుల్లేవు. పాఠశాలల్లేవు. గుళ్ళులేవు. వాళ్ళను శాశ్వతకాలం దరిద్రులుగా చేయడానికని, వాళ్ళెవళ్ళూ చాలా కొద్ది పౌనుల ధనం తప్ప, అంతకుమించి ఎక్కువ కలిగి ఉండ రాదని శాసించారు. ఈ శాసనానికి చిన్న ఉదాహరణ యిస్తా. ఎవడైనా ఒక కతోలిక్కు 5 పౌనులకన్నా ఎక్కువ విలువచేసే గుఱ్ఱం మీద పోతున్నా డనుకోండి. అప్పు డతణ్ణి ప్రొటెస్టాంటొకడు చూట్టం తటస్థిస్తే, అతనికి ఐదుపౌన్ల రొఖ్ఖం ఇచ్చి అప్పటి కప్పుడే ఆ గుఱ్ఱాన్ని స్వాధీనం చేసుకుంటాడు. ఒక బీద కతోలిక్కు

మరణిస్తే అతణ్ణి ప్రతిష్ఠింప బడిన సమాధుల స్థలంలో భూస్థాపితము చేయడాని క్కూడ శాసనం అంగీకరించదు.

1829లో దాస్య విమోచన చట్టం ప్రవేశపెట్టేంత వరకు ఐర్లండు ప్రభుత్వంలో ఒక్క కతోలిక్కు మతస్తుకు కూడా ప్రవేశ లేదు. కతోలిక్కు మతం అభివృద్ధి చెందకుండా చేయడమే పార్లమెంటు ప్రధానాదర్శం. ఆ ఆదర్శసిద్ధి కోసమే శిక్షాస్మృతినికూడా మార్చారు.

"ఐరిష్‌వాళ్ళను సర్వవిధాలా అణగ్రదొక్కి వేయడానికి, వాళ్ళను నిష్టదరిద్రులుగా తయారు చేయడానికి, వాళ్ళల్లోఉన్న మానవత్వాన్ని రూపు మాపడానికీ, అనుకూలంగా తెలివి తేటల్తో కతోలిక్కులకు వ్యతిరేకంగా సృష్టించిన శాసన మిది" అని దీన్నిగూర్చి ఎడ్మండ్‌బర్క్ చెప్పాడు.

చేపలుపట్టుకొనే వృత్తి మొదల్కొని అన్నిరకాల పరిశ్రమల్నీ అణగ ద్రొక్కేసారు. దానివల్ల నిరంతరం ఉపోష్యా లుండవలసిన గతి పట్టింది. ప్రతివారం పశువులనుంచి రక్తంకార్చి గంజితో కాచుకొని, దానితో తమప్రాణాలను కాపాడుకొనే వాళ్ళన్న విషయాన్నిబట్టి, ఆ ఐరిష్ ప్రజలు ఎటువంటి హీనపరిస్థితుల్లో క్రుంగిపోవలసి వచ్చిందో విశదమౌతుంది.

వాళ్ళ నట్లా దుర్భర పరిస్థితుల్లోకిది.పి "ఐరిష్ సామాన్య ప్రజల మాదిరిగా దారిద్ర్య పరిస్థితికి దిగజారిన క్రైస్తవ జాతికానీ, నాగరికత జెందినవారలుకానీ మరెవ్వరైనా మొత్తం ప్రపంచంలో ఉన్నారా?" అని, ఆ హింసాపూరితులలో నొకడు అడగవచ్చు.

"శక్తిసామర్థ్యాలు కలిగి ఇంట్లూ వాకిట్లూ లేక తిరుగువారలందర్నీ, బైటా జైళ్లలో పనిచేసేటట్లు చేయండి!" అని అదేవ్యక్తి ప్రొటెస్టంటు బిషప్ 'బెర్క్లే' (Berkley) సలహాఇచ్చాడు. ఈసలహాఎప్పుడ్డి? ఐరిష్‌వాళ్ళను కొంప గోడూలేని బికారిజీవులుగా తయారుచేసిన తర్వాద్ది!

ఆ పరమ ఘాతకుల హింసాగ్ని నుంచి క్షామ మహాజ్వాలలు ప్రజ్వరిల్లినై. ఆ క్షామ మహాగ్ని జ్వాలల్లో స్ఫోటకం విలయ తాండవం చేసింది. ఐర్లండు దుఃఖసముద్రం పొంగి పొంగి ఘోష పెట్టింది. మొత్తం జనంలో ఆరువంతుల్లో 5/6 వంతులు అణగారి పోయారు. మృత్యువూ, నిశ్శబ్దం రాజ్యంచేసిన భూమి అది. నిర్జనమైన వీధుల్లో తోడేళ్ళు స్వైరవిహారం చేసి పూడ్చకుండా ఉన్న కళేబరాల్ని ఖండ ఖండాలుగా చీల్చివేసినై.

మరణం ఆ భూభాగంలో సాక్షాత్కరించిందా అన్నట్లు ఆజాతి కొట్టకొన ప్రాణాల్తో ఉండిపోయింది. వీధులన్నీ శవాల్తో నిండిపోయినై. చచ్చిపోయే వాళ్ళు చలిలో బాధకు తాళలేక తమ తుది ప్రాణాలు విడిచారు. సామాన్యుల మహాసభలో (House of Commons) ఒక ఇంగ్లీషు పార్లమెంటు సభ్యుడు, "బీదవాళ్ళు, గురువులు అన్నపానాలు లేక అలమటిస్తున్నారు విచారణలేదు. కర్మకాండలేదు. లెక్కపట్టీలేదు. రాజమార్గాలన్నీ ఎముకల ప్రోవుల్తో నిండి ఉన్నయ్ ఐర్లండు శ్మశాన భూమిగా ఉంది. అంతా బికార్లై పోయారు. అందరూ శుష్కించి ఉన్నారు. సుక్షేత్రాలు బంజరు భూములుగా ఉన్నయ్. కర్మాగారాల్లో స్ఫోటకం ప్రవేశించింది. నిరాశ, విషాదం, మృత్యువూ అక్కడ రాజ్యం చేస్తున్నయ్" అని అన్నాడు.

"వాళ్ళందర్నీ స్ఫోటకానికి అప్పజెప్పి, ప్రభుత్వం తనకేమీ పట్టనట్లుగా ఉంటున్న ఈ విధానం ఎంత దారుణమైందంటే, అక్కడ స్ఫోటకం వల్ల చచ్చిపోయే వాళ్ళను అట్లాగే ఉండేపక్షంలో తమ కేమీ హాని కలక్కుండా ఉంటే, ఒక ఏభై సంవత్సరాల వరకైనా సరే, వాళ్లకు మందూ మాకూ ఇప్పించకుండా ఉండేవాళ్లే. ఇందులో ఏమాత్రం సందేహం లేదు!" అని, అధికారంలో ఉన్న వాళ్ళ ఉపేక్షా భావాన్ని విమర్శిస్తూ ప్రొటెస్టంటు మంత్రి సిడ్నీస్మిత్ ఘాటుగా అన్నాడు.

ఈ విధంగా ఐర్లండును భౌతికంగా సర్వనాశనం చేస్తూ, అదే సమయాన మానసికంగా కూడా దాన్ని నాశనం చేయడానికి విశ్వ

ప్రయత్నాలు చేసారు. ఇందుకోసం గురువుల్ని చంపారు. దేవాలయాలు ధ్వంసం చేసారు. భిన్నమతస్థుల్ని వాళ్ళ స్థానంలో పెట్టారు. వీళ్ళను పోషించడానికి దేశంలో క్రొత్తపన్ను విధించారు. దరిద్రుల దగ్గర్నుంచీ గుంజి లాక్కున్నారు. డబ్బూ బలమూ ఉన్న అన్యమతస్థుడు ప్రజల్ని పీడించుకు తిన్నాడు. అన్నం లేక అల్లాడిపోతున్న వాళ్ళ మీదికి దండెత్తి వాళ్లు తమ మతాన్ని వదలి పెట్టుకొంటే కావలసినంత మంచి ఆహారం ఇస్తామని ఆశ కల్పించారు. బానిసవ్యాపారస్తుల చేతుల్లో చిక్కినప్పటికన్నా, ప్రాణాలు బలిగోరే ఈ పరమ కిరాతకుల ఘాతుక చర్యలకి ఐర్లండు గజ గజలాడి పోయింది.

ఈ భయంకర పరిస్థితుల ద్వారా, రక్తబలి ద్వారా, నిరంకుశత్వ విధానంద్వారా వాళ్ళ కతోలిక్కు విశ్వాసాన్ని నిర్మూలం చేయాలని ముఖ్యంగా తలచారు. ఇదివరకు మనం గమనించినట్లుగా, ఈ విషయం వాళ్ళ మాటల్లో, శాసనాల్లో స్పష్టమౌతున్నది. మన మతప్రచారకుల పట్ల వాళ్ళు ప్రవర్తించిన విధానం ఈ విషయాన్ని మరింతగా సుస్పష్టం చేస్తున్నది. దేశంలో ఎగబడి తిరుగుతూన్న సిపాయిమూక గురువుల్నీ, మేత్రాణుల్నీ వేటాడి చంపింది. డబ్బుతిన్న గూఢచార్లు దేశమంతా ఎగబ్రాకి గురువుల్ని వేటాడి నానా హింసలూ పెట్టారు. గురువులు వాళ్ళకక్కనపడ్తే చిత్రహింసలనుభవించాల్సిందే మేత్రాణుల తలకు 50 పౌన్లు, గురువు తలకు 30 పౌన్లు ఉపాధ్యాయుడి తలకు 10 పౌన్ల చొప్పున లభించినై. సైన్యాలెక్కడైనా షరతుల మీద లొంగిపోతే గురువుల్ని మాత్రం మినహాయించి సంధి చేసుకొనే వాళ్ళు. గురువుల్ని పట్టి వధించేసేవాళ్ళు. “జేసుసభ గురువులు సన్యాసులూ,— గురువులూ,— కన్యాస్త్రీలూ,— వీళ్ళలో ఎవరైనా ఎక్కడున్నదీ సమాచారం తెలియజేసిన వాళ్ళకు 20 పౌన్లు బహుమానం ఇస్తాం. వాళ్ళలో ఎవరికైనా ఆశ్రయమివ్వడం గానీ, దాచిపెట్టడం గానీ చేస్తే వాళ్ళ ప్రాణధనాల్ని ఉండనీయం.” అని ఒక ప్రకటన చేసారు.

‘గొఱ్ఱె కాపర్ని బంధించు! గొఱ్ఱెలన్నీ చెల్లా చెదరైపోతాయ్.’ ఇది ఆ కిరాతకుల ఆదర్శం. సైన్యాలను సుత్తెగా, హింసా మృత్యువూ

దాగలిగా గాని, ఆ గొర్రెకాపర్లను, గొర్రెమంద నుంచి విడదీయడానికి వాళ్లు చేసిన ప్రయత్నం విఫలమై పోవడమే కాకుండా, గొర్రెకాపరులు మంద కింకా సన్నిహితులైనారు. ఈ ప్రాణత్యాగం వల్ల మాతా శిశువుల కుండే పరస్పరానురాగం కన్నా, గాఢతరమైన, అభేద్యమైన అనురాగ బంధాల్తో గురువులూ ప్రజలూ సమైక్యమైపోయారు.

మృత్యువునెదుర్కొన వలసి వచ్చినను, గురువులు వాళ్ల విధిని వాళ్లు సక్రమంగా నిర్వహించారు. అనేక విధాలైన మారు రూపాల్తో వాళ్లు ప్రాణాపాయకరమైన సంఘటల్ని యెదుర్కొన్నారు. విద్యార్థులు ఐరోపాలోకి దొంగతనంగాపోయి, ఐర్లండు దేశం యొక్క నాశనానికి జాలిబొంది సానుభూతి చూపించిన జాతులు నిర్మించిన ఐరిష్ కాలేజీలలో ప్రవేశించారు. లువేయిన్, సాలమన్క, సెవిల్లె లిస్బన్, పారిస్, రోం నగరాల్లో యీ కాలేజి లున్నయ్. ఆ కాలేజీల్లోంచి లేపనము చేయబడిన తమ చేతుల పరిశుద్ధ తైలము ఆరనన్నా ఆరకముందే దేశభక్తులైన గురువులు, ఐర్లండు సత్యాన్ని కాపాడేటందు కొరకు హృదయ పూర్వకంగా మృత్యువు నెదుర్కొనేందు కూడా సంసిద్ధులై ఆ పర్వతపు చీకటి గుహాలో, కంచెనీడలో తమ శక్తిని ధార పోయడానికి తిరిగి వెళ్ళారు. వాళ్ళు తమ హృదయాలలో దేశ భక్తి, దైవభక్తి తాండవిస్తుండగా, మందహాస వదనాల్తో చావు నెదుర్కొన్నారు.

రెండు శతాబ్దాలకు పైగా ఐర్లండులో శాసనాల వల్ల క్రైస్తవ మతానికి కీలకమైన పూజబలి నిరాకరింప బడ్డప్పటికీ, ఆ పవిత్రమైన బలిసమర్పణం మాత్రం ఆగి పోలేదు. ఐర్లండు దేశం మొత్తం మీద పూజబలి జరుగుతునే యుంది తాము కనబడ్తే ప్రాణాలు దక్కవని తెలిసినప్పటికీ, భక్తి ప్రపత్తుల్తో మునిగిన జన సమూహం యెదుట, ఆ గాఢాంధ కార యుతమైన పూజబలి గుహాలో, పడిపోయిన చెట్టు బోదె పైనా ఆ పూజబలి శిలాఫలకంపైనా, చిన్న పూరి గుడిసెలో పూజబలి నిర్విరామంగా సాగిపోయింది.

పూజబలీ, సత్ప్రసాద దైవ బలము మూలమున ఆ భయంకరమైన, దారుణమైన శతాబ్దాలలో ఐరిష్ జాతి మన కలిగి, సెయింట్

పాట్రిక్ కాలంలో మాదిరిగా నిర్భయంగా కతోలిక్కుగా నిలబడ కలిగింది. ఆ దైవశక్తి ఉనికి వల్ల ఐరిష్ జాతి మరింత బలం కలిగింది మొట్ట మొదటగా ఆ తుఫాను వీచినప్పటికన్నా ఎక్కువ శక్తితో, ఎక్కువ నిశ్చయంతో, ఎక్కువ కతోలిక్కు తత్వంతో ఆ అగ్నిపరీక్షకు తట్టుకోని బైటపడ కలిగింది. జేసునాథుడు వాళ్ళ పక్షం వహించి పోరాడాడు. ఆయన వలన ఏర్పాటు బడిన మరియొక్క జాతి లాగా ఆయన సమక్షంలో మిక్కిలి శక్తి మంతులై, దివ్యసత్ప్రసాద మంద సము వాళ్ళు నమ్మిన ఓడగా, ఆయన స్థాపించిన తిరుసభ అగ్ని స్తంభంగా విశ్వసించి శత్రువుల కేమాత్రం జంక లేదు. మతం కోసం ప్రాణాలర్పించిన త్యాగధనుల పవిత్రారుణారుణరక్తం, ఐర్లండు భూమ్మీద మహా వేగంతో ఏరై ప్రవహించిన కొద్దీ, తిరుసభ మరింతగా బలపడింది.

1672వ సంవత్సరములో క్రామ్‌వెల్ పగ సాధించుకొన్నప్పుడు ఐర్లండులో ఉన్న 1,100,000 మంది మొత్తం జన సంఖ్యలో కతోలిక్కులు 800,000 మాత్రమే మిగిలారు. కొన్ని శతాబ్దాల వరకూ కఠిన చర్యలు జరప బడ్డయ్. తర్వాత మళ్ళీ జన్మ జన్మేపి కూడా లేవకుండా నేలమట్టం చేస్తామనుకున్న ఆ తిరుసభ, అంబర చుంబి శిఖరాగ్ర విలసితమై ఐర్లండును స్వర్గంతో కల్పుతూ శత్రు దుర్భేద్యమై, పటిష్టమైన సౌధంగా వెలసింది. 1834వ సంవత్సరంలో ఐర్లండులో ఉన్న 7,943,840 మంది జనాభాలో 6,427,718 మంది కతోలిక్కులున్నారు!

అటువంటి బ్రహ్మాండమైన అభివృద్ధి సత్యంగా మానవాతీతమైందే. ఎందుకంటే, సహజమైన ఏవిషయాన్ని పరిశీలించినా దానికి ప్రతికూలం గానే ఉంది. అవమాన పరచి, దరిద్రులుగా చేసి, సర్వ నాశనం చేయడాని కని సృష్టించిన దారుణ శాసనాల్లో కథోలిక్కులు బ్రతక వలసి వచ్చింది. 6,000,000 మందిలోనూ ఎక్కువ మంది, అంటే దాదాపుగా 5,000,000 మంది ఒకే గది ఉన్న ఇళ్ళలో నివసించారు. వాళ్ళెప్పటికైనా బైటికి గెంటపడవచ్చు. రోడ్డు మీది కీడ్వ బడకుండా ఉండటానికి గత్యంతరం 'అద్దెకట్టు'! అన్నదే. అద్దెకట్టితే ఇంటిలో నుండ వచ్చునన్న మాట.

అప్పుడు, ఏభై సంవత్సరాల క్రితం ఆహార ధాన్యాలు కోకొల్లలుగా ఉన్నప్పటికీ, ఐర్లండులో మహా క్షామం సంభవించి దేశమంతా ప్రళయాట్టహాస ధ్వనుల్తో ప్రతిధ్వనించి, శ్మశాన వాటిగ్గా తయారైన సంగతి మనకు తెలిసిన విషయమే. 6,000'000 మందిలో $\frac{5}{6}$ వంతు జనం నశించింది. క్రామ్‌వెల్ కాలంలో వలె 800,000 కతోలికులు మిగిలారు.

సంవత్సరాలు గడచిన కొలది తిరుసభ శత్రువులు కూడ అధికమై, కతోలికులు తమదే దేశీయ మతమని వాదించడానికి వారికి హక్కు గలదా అనే విషయాన్ని గూర్చి వివాదపడజొచ్చినారు. 1861లో ఐర్లాండు జనాభా 5,774,143 మంది. అందులో పదోవంతు ప్రొటెస్టాంటు మతాన్ని బలపరచారు. "ఐర్లండు చర్చి" అనుకొంటున్న వాళ్ళు సత్య విశ్వాసానికి అంగీకరించిన మతస్థుల్తో పాటు తామూ సమాన సంఖ్యలోనే ఉన్నామని రుజువు చేసుకునేందుకు జనాభా లెక్కలు తయారు చేయమన్నారు. జనాభా లెక్కలు తయారైనై. మళ్లీ భిన్నమతావలంబికులు దరీ దాపూ తోచక కృంగి పోయారు అది చర్చికి మరో ఘనమైన విజయం. క్షామం వల్ల తప్పించుకొని బైటపడ కల్గిన ఆ కతోలిక్కుల మూలంగా, కన్నీళ్ళతో, గర్భ దరిద్రంతో నిర్బంధాల్తో, మన తిరుసభ 4,490, 583 మంది విశ్వాస యుక్తులైన అనుయాయుల్తో ఉండేంత వరకూ బలపడింది.

కతోలిక్కు ఐర్లండును అణచి వేసిన వాళ్ళు చరిత్ర సత్యాల వల్ల జ్ఞానమును ఎప్పుడు నేర్చుకొంటారు? నిర్భయస్తులైన వాళ్ళ ముందు హింస ఓడిపోయింది. తమ గాఢ విశ్వాసంతో వాళ్లు మృత్యు కవాటాల గుండా నడచి పోయారు. ఎందుకంటే, వాళ్ళు నమ్మిన జేసునాధుడు, మందహాస వదనంతో వారికి ఆ ద్వారాల గుండా స్వాగత మిస్తూ సాక్షాత్కరించాడు. ఆ చీకటి రోజుల్లో ఐర్లండు ఆత్మను ఎవరూ తాకలేదు. ఆ ఆత్మ కేమాత్రం సంక్షోభము కలిగించ లేదు. ఐర్లండు హృదయం నిశ్చలంగా కొట్టుకొన్నది. ఐర్లండు గౌరవం కళంక దూషితం కాలేదు

బాధాపీడిత సంతాన రోదన ధ్వనుల్తో ఐర్లండు కోనలు ప్రతి ధ్వనించినై. ఆ సర్వనాశకుడి చేతి దీపం తగిలినంతనే ఐర్లండు

కొండలు మంటలు గ్రక్కి, పొగలు విరజిమ్మినా కానీ, విశ్వాస కాంతి దశ దిశలా ప్రకాశించింది. జేసునాథుడిలో గల పరిపూర్ణ మైన విశ్వాసంతో, క్షమతో అచంచలమైన మనస్సంకల్పముతో, ఆయన ఆజ్ఞాబద్ధులై నడిచారు.

వాళ్ల కష్టాలు, వాళ్లను సర్వ మానవ సౌభ్రాతృత్వం కల వాళ్ళగా తయారు చేసినై. వీరోచితమైన హృదయం- స్వేచ్ఛ కోసం గాఢమైన అనురాగం- పీడితుల పట్ల సహన స్వభావం- సానుభూతి ఇవి వాళ్ళ కలవడ్డ సుగుణాలు. ఐరిష్ విశ్వాస వృక్షం రక్తంతో కడగబడి జాతి కన్నీళ్ళతో తడపబడి, దారుణ హింసకూ, మృత్యు వుకూ లొంగకుండా అభివృద్ధి చెంది, ఈ నాటివరకూ దాని చల్లని నీడన ప్రపంచంలోని జాతులన్నీ చేరి హాయిగా విశ్రమించే టట్లు తన శాఖల్ని నాల్గు మూలలకీ వ్యాపింప చేసింది.

ఉత్సాహ పూరితమైన దేవుని ఎడల చూపబడిన భక్తిని బట్టి, ఇతర జాతి చరిత్రల్లో సగర్వంగా కొన్ని యుగాల్ని దైవ విశ్వాస యుగాలుగా ప్రత్యేకించి చిత్రిస్తారు. ఐర్లండు చరిత్రలో అటువంటి ప్రత్యేక యుగాలేవీ లేవు ఎందుకంటే, ఆ చరిత్రలో ప్రతి యుగం, హృదయ పూర్వకమైన గాఢ దైవ విశ్వాస యుతమైందే!

ఐరిషీయులు అనుమానం, నిరాశ అన్నే మేఘాలకు పైగా స్పష్ట మైన దైవ విశ్వాస పర్వత శిఖరాగ్రంపై అధిష్టించి, తమ శత్రువులు భిన్నమత పంకం లో కూరుకు పోయి బైటికి రాలేక గిజ గిజ తన్ను కొంటూంటే, భయంతో, సానుభూతితో వాళ్ళ వైపు చూచారు. మొత్తం జాతిని అనాగరికులుగా చేయడానికి శతథా ప్రయత్నించారు. దైవాన్ని దృఢంగా నమ్మిన ఏ జాతీ ఎన్నడూ నాశనం కాదు. ఉన్నతా దర్శాల్ని అనుసరించ లేక చతికిల పడిపోదు. అందుకనే ఐర్లండు నాశ నం కాకుండా దైవవిశ్వాసం వల్ల సంరక్షింప బడింది. కతోలిక్కు విశ్వాసానికి సంబంధించిన ఉన్నతా దర్శాలకు ఐరిషీయుడు బాగా కట్టుబడిపోయి, అత ణ్ణణచి వేయడానికి ప్రయత్నించిన దుష్ట శక్తులన్ని టినీ జయించి గర్వంతో నడవగల ఒక మహత్తర శక్తిని వాటిలో

గుర్తించాడు. ఆ ఆదర్శాలవల్ల అందర్నీ అతడు విశ్వసించ కల్గాడు. మానవా తీతమైన అపరాధక్షమాగుణాన్ని తన హృదయంలో ఉన్నత స్థాయిలో కాపాడ కల్గాడు.

ఈ ఆదర్శాలు జాతి నైతిక స్థితిని కాపాడినై. అవి జాతికి అగ్ని పరీక్షలు. అవసరం వచ్చినపుడు కార్యోన్ముఖులుగా చేయడానికి కుప కరించే ఆదర్శా లవి. తమస్సావరించి సర్వనాశనం చేయడానికి విజృం భించిన కష్టసముద్రాన్నీ, భయంకరమైన తుఫాన్నీ నిర్భయంగా ఎదు ర్కొని తమ కున్న దైవవిశ్వాసంతో విఘ్నాలన్నింటినీ జయించి ఐరిష్ జాతికి కీర్తిప్రతిష్టలు చేకూర్చింది, ఈ నైతిక బలసంపదే! కష్టం ఆవ రించి నపుడు, ఇజ్రాయేలు నివాసులంతా ఎటువంటి బలంతో దాన్ని దుర్కొన్నారో, అంతకన్నా ఎన్నోరెట్లు గొప్పదైన బలంతో ఐరిషీ యులు, నిరాశా, నిస్పృహల్ని జయించి, సియోన్ గీతాలు పాడు కొంటూ ముందుకు పోయారు.

వాళ్ళకు, ఐర్లండుపై ఆవరించిన ఆ నీలాకాశము, మతం కోసం ప్రాణాలు త్యజించిన త్యాగధనులు నివసించే ప్రదేశానికి పలచని తెరలాంటిది. విజయవంతమైన ఐర్లండు ప్రేమతో, గర్వంతో మరణిం చిన విశ్వాసులైన సంతానాన్ని ఆ తెరద్వారా చూస్తుంది. ఐర్లండును అజరామరణంగా చేసిన మహిమల్ని, కంఠాల్ని, స్మృతుల్ని మాపుచే యలేని తెరఅది. సర్వకాల సర్వావస్థలందూ గాఢంగా నమ్మి, ప్రేమిం చిన దైవాన్ని నిశితంగా స్పష్టంగా ఆ తెరద్వారా ఐర్లండు చూస్తుంది. జేసునాధుడి పానపాత్రములో భాగస్తులైనందువలన వచ్చినబలం ఐర్లం డుది! జేసునాధుడి స్లీవను తమ భుజస్కంధాలమీాద మోయడం వల్ల లభించిన గొప్పదనం ఐర్లండుది!



## 13 వ అధ్యాయం

# ఐరిష్ ఆదర్శాలు

తన విధిని సక్రమంగా నిర్వహించడమనేది ప్రతి మానవుడూ కోరుకొనేఉత్కృష్టమైన ఆదర్శం. ఈ ఆదర్శంలో మానవుడికి దేవునిపట్ల ఉన్న బాధ్యతా, మానవజాతి పట్లఉన్న బాధ్యతా, తన గమ్యస్థానాన్ని గూర్చిన నిస్సందేహమైన, స్పష్టమైన పరిపూర్ణమైన జ్ఞానం కూడుకొని ఉన్నాయ్. కానీ, ఈ ఆదర్శానికి దూరమై పోవడం మానవ సహజ లక్షణం. జాతుల చరిత్ర అంటే వదలిపెట్టబడిన, పాతిపెట్టబడిన ఆదర్శాల చరిత్రనే ప్రధానంగా చెపుతుంది. ఉన్నతాదర్శాల కోసం ప్రయత్నిస్తే, ఉత్తమ భావాలూ, ఉదార కర్మలూ సిద్ధిస్తయ్. వాటి వేపే అసలు చూడకుండా ఉంటే అధఃపతనమై పోవలసి వస్తుంది.

శతాబ్దాల నాటి గాథ, ఏ జాతికూడా తన ఉన్నతాదర్శాల్ని పూడ్చిపెట్టుకుంటే, గొప్పగా రాణించదన్న విషయాన్ని అక్షరాలా రుజువు చేస్తున్నది. మానవజాతి చరిత్ర పుటలు తిరగవేస్తూ పోతే, ఒకప్పుడు మహోన్నతస్థితి పొంది విస్మృతి పాలైనజాతులూ, ఒక నాడు అత్యున్నత స్థానా న్నాక్రమించుకొని, అధఃపతనమై పోయిన మానవ కళేబరాలూ మనకు సాక్షాత్కరిస్తయ్. ఎందుకంటే, మానవుడు, ఉచ్చస్థితికి తీసుకపోయే ఉన్నతాదర్శ లన్నింటినీ వదలి, దేవునిపాద సమీపం దగ్గరికి చేరలేకుండా, సామాన్యమైన ఐహిక వాంఛలకి లోబడి, అట్లా అధః పతనమైనాడు. ఏజాతి ఐహిక సౌఖ్యాల కోసమై తహతహ లాడి, కేవలం భౌతిక సుఖాన్నే వాంఛిస్తుందో, ఆ జాతి సర్వనాశనమై పోతుం దని చరిత్ర నిరూపిస్తుంది.

కొందరు చెప్పే నట్లుగా జాతులు శ్రమపడి మెల్లమెల్లగా అనాగరిక దశనుంచి బైటపడి అభ్యుదయ మార్గాన పురోగమించడం లేదు. పైగా ఆ జాతులు అంధప్రాయాలై, ఉన్నతాదర్శాల్ని పోగొట్టు కోడం మూలాన 'నానాటికి తీసికట్టు నాగంభొట్లూ' అన్నట్లు అధః పతనమై పోతున్నాయ్. గుహాలో నివసించే మానవుడు క్రమపరిణామం చెంది నాగరికుడు కావటం కాదది. దైవంచే ఉన్నత స్థానాన్నధిష్ఠించిన

మానవుడు పదభ్రష్టుడై అధః పతనం కావడం! ఇహలోకానికి బంధింప బడి, ఇహలోక సౌఖ్యాలకు వశమై, కళ్ళు మూతలుపడి, దారీ తెన్నూ తోచకుండా జాతులన్నీ అంధంగా శూన్యంలోకి ప్రయాణం చేస్తున్నయ్.

మానవ జాతి చరిత్ర నధ్యయనం చేసే వ్యక్తి, ఈ జాతి పతనావస్థలు నాటినుంచి నేటివరకూ, శృంఖలా బద్ధంగా జరుగు తూంటే ఆశ్చర్యంతో ఖిన్నుడై నిలబడి పోతాడు. అందరికీ- అన్ని జాతులకు- వర్తిస్తుందా అని అనిపించే ఈ శాసనానికి ప్రసిద్ధమైన మినహాయింపు- మనస్సున తట్టక మానదు. ఆ సూత్రానికి మినహా యింపు, ఐర్లండు ఒక్కటే. రాజ్యాలు నాశనమై పోయిన విషయాల్ని, నాగరికత ధ్వంసమైన విషయాల్నీ, నూతన ప్రపంచాన్ని కనిపెట్టిన సంగతుల్నీ, నూతన భాషల్ని సృజించిన విషయాన్ని, కొత్త నమ్మకాల్ని, నీచ దశను తీసుకొని వచ్చిన భయంకరమైన కాలాన్నీ గూర్చి చెప్పే శతాబ్దాలనాటి చరిత్ర పుటల్ని అతడు తిరగేస్తూంటే, ఐర్లండు, నాటినుంచి నేటివరకూ అధః పతనం కాకుండా, ఎటువంటి ప్రమాద పరిస్థితుల్లో గూడా బెదరి పోకుండా నమ్మకముతో నిశ్చ లంగా నిలబడిన పరమ సత్యాన్ని ఆ చరిత్రలో ప్రత్యేకంగా గుర్తి స్తాడు. తక్కిన జాతులన్నీ నిస్సహాయ స్థితిలో సర్వ నాశనమైపోతే, ఐర్లండు 1400 సంవత్సరాలు తన స్థానం నుంచి పడిపోకుండా దిన దినాభివృద్ధి చెందుతున్న విషయం అతడు తెలుసుకొంటాడు.

ఐర్లండుకు గల ఈ మహత్తర శక్తిలో ఉన్న రహస్యం, ఆ దేశం సెయింట్ పాట్రిక్ తన కిచ్చిన ఉన్నతాదర్శాల్ని తు. చ. తప్పకుండా వీరోచితంగా అనుసరించడంలో ఉన్నదని అతడు గుర్తి స్తాడు. ఆమె చరిత్రను సరిగా అర్థం చేసుకోవాలంటే, ఈ ఆదర్శా ల్నతడు క్షుణ్ణంగా అవగాహన చేసుకోవాలి. ఆ దేశానికి సెయింట్ పాట్రిక్ కథోలిక్కు విశ్వాసాన్ని ప్రసాదిస్తూ, ఈ ఉన్నతాదర్శ సిద్ధిని పొందడానికి ఆయన వాళ్ళకి ఒక స్పష్టమైన మార్గాన్ని అనుగ్రహించాడు.

ఈ ఉన్నతాదర్శపథం నుంచి తక్కిన జాతులన్నీ తిరుగు మొఖం పెట్టి, సందేహం, అవిశ్వాసం అన్న కారుమేఘాల చీకట్లలో

మునిగిపోయి, తమంతట తామే నిష్ప్రయోజనకరమైన మార్గాల్లో పడిపోయినై. పరమ సత్య ప్రకాశంలో సక్రమమైన ఆ మార్గంలో తప్పకుండా సరిగా ప్రయాణం చేసింది ఒక్క ఐర్లండు మాత్రమే!

భౌతికంగా, నైతికంగా తాము క్రొత్తపంథాను తొక్కుతున్నామని దుష్ప్రధానపడి, అంధ ప్రాయులై తక్కిన జాతుల వాళ్ళు, తమదే అభ్యుదయమార్గమని వాదించారు.

కానీ ఐర్లండు మాత్రం ఆ సన్మార్గాన్ని విడవకుండా సురక్షితంగా ప్రయాణం చేసి మహోన్నత స్థానాన్నందుకొంది. వీరత్వానికీ, మానవత్వానికీ అగ్ని పరీక్షలైన ఆ ఉన్నతాదర్శాల్నభినందిస్తూ, ఇహలోకంలో ఉండవలసిన ఉదార గుణాల కన్నా ఎక్కువ ఉదార గుణాలు కలిగి పధ్నాలుగు శతాబ్దాల కష్ట పరంపరల్ని అధిగమిస్తూ ఆ ఉన్నతాదర్శ సిద్ధికి హేతుభూతమైన విశ్వాసానికి ఐర్లండు కట్టుబడి ఉంది.

ఐర్లండు యొక్క ఉన్నతాదర్శాలన్నింటినీ నాశనం చేయడానికి దుర్భర హింసా ప్రయోగాలు జరిగినై. కానీ అవన్నీ నిష్ప్రయోజనాలైనై. ఆమె మార్గంలో ఒకటి వెంబడిగా ఇంకోటిగా సంవత్సరాల పర్యంతం ఎట్లా హింసా కాండలు చెలరేగినయ్యో, వాటన్నిటినీ ఎదుర్కొని ఎట్లా నిలబడ కలిగిందో, ఆమె 'ప్రాణత్యాగం' విషయంలో గమనించాం. దుర్భర దారిద్ర్యం, స్ఫోటకం దాదాపుగా ఆమె సంతానాన్నంతా నాశనం చేసినై కానీ ఆమె వాటి నన్నింటినీ జయించింది. దుర్భర దారిద్ర్యం, పట్టు విడువని బాధ సహజ.గ పతనావస్థకు తీసుక వస్తాయి. పశుత్వాన్ని రెచ్చగొడ్తాయి. ఎడతెగని హింస, బలహీన పరుస్తుంది. ఇవి రెండూ ఆమెపై శత్రువులు ప్రయోగించారు. ఐనప్పటికీ ఆమె ఇంకా ఉన్నత స్థానాన్నందుకొని మరింతగా బలపడింది. ఆమె దైవ విశ్వాసానికి కృతజ్ఞురాలై ఉండడమే దీనికి కారణం. ఆ ఉన్నతాదర్శాలవల్ల ఆమెకు శాశ్వతత్వం లభించింది. నానావిధాలైన హింసాకాండల్లోనూ ఆమె చలించకుండా అభ్యుదయ మార్గాన పురోగమించింది. ఆమె గౌరవ ప్రతిష్ఠలు మరింతగా ప్రకాశించినై.

ఈ సత్యాన్ని గుర్తించిన ఇంగ్లీషు ప్రొటెస్టాంటూ, రాజకీయ జ్ఞుడు ఐన బిరెల్ (Birell) ఈ విధంగా చెప్పాడు.

"ఐర్లండును గూర్చి చాలా సంవత్సరాలు పరిశీలించగా నా మనస్సులో ఏర్పడ్డ ప్రధాన భావం ఇది. ఇన్ని సంవత్సరాలుగా నానా హింసలకూ గురై, క్షామానికి ఆటపట్టయి, అనేక యుద్ధాలు జరిగి, స్వదేశ పరిశ్రమ లన్నీ దగ్ధపటలాలై, విప్లవం చెలరేగి, జనం ఘోరహత్యా కాండకు బలైపోయి నప్పటికీ, ఐర్లండులో ఇప్పటికీ 45 లక్షలకు పైచిలుగ్గా ఉన్న జనసంఖ్యలో ముప్పాతిక మూడు వంతులు తమ ప్రాచీన మతానికి అంటి పెట్టుకోని ఎట్లా ఉన్నా రన్నదే నాకు మిగిలిపోయిన ప్రశ్న. మొత్తం ప్రపంచ చరిత్రలో ఐర్లండు కున్న గాఢవిశ్వాసం అనన్యమైంది. ఎలిజబెత్ కాలం నుంచీ, విక్టోరియా కాలం వరకూ ఐర్లండులో కతోలిక్కుగా ఉండడ మంటే మృత్యువు కౌగిల్లో ఉండడ మన్న మాట. కతోలిక్కుల భూముల్ని దోచు కొన్నారు. నరకమా? కొన్నాక్టా? (Connachat) అన్న ఇరకాటంలో పడ్డారు. స్కాచ్ వాళ్ల అనుకూలంకోసం వాళ్ళు 'అల్స్టర్' నుంచి (Ulster) తరిమివేయ బడ్డారు. వీలు దొరికినప్పుడు వాళ్ళను చంపివేయడమో నిషేధించడమో చేసారు. ఐనప్పటికీ వాళ్ళు నాశనం కాలేదు. అన్య మతావలంబకులు కాలేదు. ఎలిజబెత్ నాటినుంచీ మనవరకూ ప్రొటె స్టాంటువాళ్ళు ప్రభుత్వం వలన అనేక మేలులను పొందకల్గారు. వాళ్ళకు నల్గురు ప్రొటెస్టాంటు అతి మేత్రాణు లున్నారు. ఇరవై ముప్పైమంది మేత్రాణు లుండినారు. ఎంతమంది ప్రధాన్లో, ఎంతమంది సాధారణ గురు వులో తెలియదు కానీ, వాళ్ళందరూ అద్దెకున్న వాళ్ళవల్ల వసూలైన పన్నులమీద పోషించ బడ్డారు. ఒక్కరుకూడా ఎంత బలవంతం చేసినా ఆ ప్రొటెస్టాంటు దేవాలయాల్లోకి అడుగుపెట్టలేదు" బెరిల్ను ఆశ్చర్య నిమగ్నునిగా చేసిన ఆ మహత్తరమైన విషయానిగ్గల ప్రధానకారణ మిది. ఐర్లండు చెక్కు చెదరకుండా, బెదరిపోకుండా నిర్భయంగా అచంచలమైన విశ్వాసంతో ఆ ఉన్న తాదర్శాల్ను, దైవ విశ్వాసాన్ని అనుకరించింది. ఐరిష్ జీవితానికి కీలక స్థానం, పరంలో ఉంది. దాని వేపే ఆమె నిరంత రం నిరీక్షిస్తున్నది. ఐర్లండు కవి, డివెరె (Devere) "నీ గానం పవిత్ర

మైంది! నీహృదయం మహోన్నత మైంది! ఆ మహిమ వల్ల నీకు సంక్రమించిన ప్రతిభ మనోజ్ఞమైంది!" అని ఆమెను కీర్తించాడు.

అందుకనే ఐర్లండు, అధఃపతనం కాకుండా నిలబడ కల్గింది.

"జేసుక్రీస్తు చరిత్ర ప్రారంభంలో, పుణ్యపురుషులు, త్యాగ మూర్తులూ సత్యంలో ఎంతపట్టుదల వహించారో అంతకన్నా ఎక్కువగా ఈ ద్వీపంలోని సామాన్య ప్రజలు అంధత్వంతో పట్టుదల వహించారు" అని ఒక లూథరన్ ఆర్చి బిషప్, ఆయనకే ప్రశంస్తున్న సంగతి తెలియకుండా, ఐరిష్ ప్రవర్తన్ని గురించి పై విధంగా శ్లాఘించాడు. వాళ్లకున్న పట్టుదల ఆ సత్యం కోసం, ఆ జేసునాథుడి కోసమే అన్న విషయాన్ని అతడు అంధత్వంలో గుర్తించలేక పోయాడు.

గర్భ దరిద్రుడుకూడా విశ్వసించడమే కాకుండా దాన్ని అర్థం కూడా చేసుకొన్నాడు. అన్నిటికన్నా బలవత్తరాలైన వాళ్ళ మతాభిప్రాయాలు వాళ్ళకీ బ్రహ్మాండమైన శక్తిని ప్రసాదించినై. వాళ్ళ నాయకులనుంచీ, చర్చిలనుంచీ, ఉపాధ్యాయులనుంచీ, పాఠశాలల్నుంచీ, ఇళ్ళనుంచీ, పొలాల్నుంచీ, ఆఖరికి వాళ్ళ భాషనుంచీ కూడా వాళ్లు ఎడబాటు చేయబడ్డారు. ఐనప్పటికీ వాళ్ళు మత సువర్ణ శృంఖలాబద్ధులై ఒకే ఒక మనిషిగా నిలబడి అభ్యుదయ మార్గాన పురోగమించగల్గారు. బురదతో నీళ్ళతో నిండిన వాళ్ళ చీకటి జైలుగదుల్లో విశ్వాస కాంతులు నిండి వాళ్ళను తేజోవంతులుగా చేసినై. రక్తారుణాంకిత పాదాల్నుంచి ఆ విశ్వాసము బాధను తొలగించింది. అలసిన హృదయాలకు విశ్రాంతి కల్పించింది. అలసి సొలసిపోయిన నేత్రాల కది జేసునాథుణ్ణి దర్శించగల శక్తిని ప్రసాదించింది. ఎముకలు గుల్ల గుల్లలుగా బాధ పడిన వాళ్ళను కాల్వరీ వద్దకు ప్రాకేటట్లు చేసింది.

శ్లాఘనీయమైన పవిత్రతతో కూడిన భాషనూ, సారస్వతాన్నీ అది జాతికి ప్రసాదించింది.

వాళ్ళ మాటల్లో, వ్రాతల్లో, ఇతర భాషల్లో, ఇతర రచనల్లో కనపడే అసభ్యపదజాలం మచ్చుకైనా కనపడదు. గేలిక్ (Gaelic) భాష, స్వభావంగానే కతోలిక్కు. కొన్ని సంవత్సరాలక్రితం ఐర్లండులో

ప్రజల్ని అన్య మతావలంబకులుగా చేయడానికి ఒక ప్రొటెస్టాంటు మిషనరీ కాలేజి స్థాపింపబడింది. అక్కడ అది గేలిక్ మాట్లాడేవాళ్ళకు మతప్రచారము చేసి వాళ్ళను ప్రొటెస్టాంటు మతంలో చేర్చడానికి అనువుగా విద్యార్థులకు గేలిక్ భాషను నేర్పడం మొదలు పెట్టింది. కాని దాని ఫలితంగా పాదిరీలుగా తయారగుచున్న విద్యార్థులలో ననేకులు కతోలిక్కు లైనారు. అప్పుడు ఆ భాషను నేర్పడం ఆపేసారు.

ఐరిష్ రచయితలు, స్వర్గాన్నుంచి భూలోకంలోకి తొంగి చూస్తూ తన కరుణార్ద్ర దృక్కుల్ని దీనులైన మానవులపై ప్రసరింప జేసే జేసునాథుణ్ణి గాఢంగా ప్రేమించి, వాళ్ళ హృదయాల్లో పొంగి పొరలిన భావసముదయాన్ని మనోహరంగా, రసవత్తరంగా, అద్భుతంగా సువర్ణాక్షరాల్లో నిబంధించారు. వాళ్ళ సూక్తులు దివ్య రత్నాలు. ఉదహారణకు వాళ్ళ 'తారా' ప్రశంస గీతాన్ని చదవండి.

మార్గ దర్శక మాత మా ప్రభు శక్తి!  
మా ప్రభు మహిమమ్ము మమ్ము రక్షించు!  
ప్రభుని చల్లని దృష్టి ప్రసరించు గాక!  
ప్రభు కర్ణములు మాదు పలు కాలకించు!  
దానాలు జేయుత ప్రభుని వచస్సు  
ప్రభు హస్తముల్ నాకు భద్రమ్ము లగుత!  
ప్రభు మార్గమే నన్ను పాలించు గాక!  
ప్రభు మూర్తి కవచమై రక్షించు గాక!

ఓ జేసు ప్రభువ! ఓహో! జేసు ప్రభువ!  
నాతోడనే యుండు! నాముందు నుండు!  
నా వెన్కనే యుండు! నాలోనె ఉండు!  
నా క్రిందనే ఉండు! నా పైనే ఉండు!  
అటువైపు నుండుమీ! ఇటువైపు నుండు!

నే పల్కు ప్రతి వ్యక్తి నెటి హృదయాన  
నను పిల్చు ప్రతివ్యక్తి నవ్వు మొగాన

నను జూచు ప్రతి వ్యక్తి నయన ద్వయాన
నను నాలకించు కర్ణయుగళితోన
నా జేసునాథుండు! నా జేసు ప్రభువు
నా పుణ్యముల పంట! నా తోడు జంట
నిండి ఉన్నాడదే! నిర్మల మూర్తి!

ఈ సుభాషిత రత్నాలు హృదయం, భావనా ఉత్తమాదర్శ సిద్ధికి గాఢంగా వాంఛించే ప్రజల హృదయాల్ని ప్రతిబింబింప చేస్తున్నయ్!

జాతీయ ప్రవర్తన మీద దీని ప్రభావాన్ని అంచనా వేయడం దుర్లభమైంది సర్వ సుగుణ భూయిష్ఠుడైన భగవంతుడితో సన్నిహితులై వీరోచితమైన సుగుణాల్ని అలవర్చుకోడం ఆ దేశంలో సర్వ సామాన్యమై పోయింది. వేల మంది తల్లి దండ్రులు తమ సంతానాన్ని హృదయ పూర్వకంగా భగవంతుడి సేవ కర్పించారు. ధనవంతులు తమ ఆస్థిపాస్తుల్ని ఆ సేవకే సమర్పించారు. వాళ్ళ ప్రేమ ఇరుగు పొరుగు వాళ్ళపై వెల్లువలై ప్రవహించింది. ఉన్నతాదర్శ సిద్ధికై వాళ్ళు చలించకుండా ఆ ఆదర్శాన్ని వీడకుండా గట్టిగా అంటి పెట్టుకొని ఉండడం చేతనే, అభ్యుదయం పేరుతో తక్కిన జాతులు నాశనమై పోయిన ఆ అనాగరిక భావావేశాలకు లొంగకుండా రక్షింప బడ్డారు.

వాళ్ళ ఉన్నతాదర్శ ప్రభావం వాళ్ళ ఆధ్యాత్మిక భావాలపై అద్భుతంగా పని చేసినట్లే భౌతిక విషయాల్లో గూడా పని చేసింది. ఇహానికి సంబంధించిన సమస్త విషయాల్నీ జాగ్రత్తగా పరిశీలిస్తూ ఐరిష్ వాళ్ళు వాటి కొఱకై సక్రమంగా పాటుబడ్డారు. శాస్త్ర పరిశోధనల్లో, కళల్లో, పరిశ్రమల్లో శక్తి సామర్థ్యాలు కలిగి అద్భుతమైన నాయకులుగా వాళ్ళు పేరు ప్రతిష్టలు సంపాదించారు. వాళ్ళ సన్యాసి మఠాలు వాళ్ళ కృషిని పవిత్రం చేసినై. ధర్మం, న్యాయం, నీతి, సర్వ మానవ సోదరత్వం వాళ్ళకు అవి ప్రసాదించినై. వాటితో మహిమకు పవిత్రాధారం ఏర్పడింది. శాస్త్రం, విషయ గ్రహణం నేర్పే మఠాలలో

వాణిజ్యానికీ, కళలకీ, నివాసాలైన కర్మాగారాల్లో అవి రచయితలకు పవిత్ర గ్రంథాలు ప్రసాదించినై. ప్రతి మఠం పరిశ్రమలకు పుట్టిల్లు; విజ్ఞాన నిధి; పవిత్రతకు పట్టుకొమ్మ.

పరిశ్రమలు దేశాన్ని నందన వనంగా మార్చి వేసినై అందరూ భౌతికంగా, మానసికంగా పరిశ్రమించే వాళ్ళే!

కళా జీవుల విషయానికి వస్తే వాళ్ళకు వాళ్ళే సాటి. వినాశకుల చేతుల్లో పడకుండా మిగిలిన, ఐరిష్ వాళ్ళ కొద్ది కళా ఖండాల్లో ఒకటైన 'ఆర్డగ్ పాత్రాన్ని' (Ardagh Chalice) గూర్చి మాట్లాడుతూ మిస్ 'స్టోక్సు' (Miss Stokes) ఈ విధంగా చెప్పింది.

"ఈ ఆర్డగ్ పాత్రము చెక్కడంలో, అచ్చు తీయడంలో, లోహాల్ని చక్కగా స్వేచ్ఛారూపంలో మలచ గల్గడంలో ఐరిష్ వాళ్ళకు గల అద్భుత మేధాశక్తికి సాక్షీ భూతంగా ఉంది. కళాసృష్టిలో వాళ్ళకున్న సునిశిత కౌశలాన్ని ఇది అక్షరాల నిరూపిస్తున్నది."

"ఐదో శతాబ్దం మొదల్కొని ఎనిమిదో శతాబ్దాంతం వరకూ లలిత కళలంటేనే ఏమైందీ తెలియని అజ్ఞాన దశలో ఐరోపా ఖండం ఉన్న రోజుల్లో, ఐర్లండు అలంకరణ కళలో అద్భుతంగా ఆరి తేరింది. తర్వాత యుగంలో ఐరిష్ సన్యాసు లాకళను ఐరోపా ఖండానికి నేర్పారు." అని ఆక్సుఫర్డు ప్రొఫెసర్ 'వెస్ట్‌వుడ్' తన అభిప్రాయాన్ని వెలి బుచ్చాడు.

ఐరోపా అంధకారంలో దీపకాంతుల్ని ప్రసరింప చేస్తూ భగవంతుడి పవిత్ర వాక్యాన్ని సంరక్షిస్తూ, వాళ్ళేఉన్న తాదర్శాలకోసం ఉన్నారో వాటిని ఆచరణలో పెడ్తూ, వేద గ్రంథ విషయంలో వాళ్ళ కళా నైపుణ్యాన్ని ప్రదర్శించారు.

ఆ ప్రొఫెసరే కెల్స్ (kells) పుస్తకాన్ని గూర్చి చెపుతూ ఇట్లా అన్నాడు.

"అది దేవదూతలచేత రచింపబడ్డ గ్రంథం మాదిరిగా ఉంది. ఐరిష్ గ్రంథాలల్లో పుటలు రత్నభస్మంతో లిఖింత బడ్డయ్. నాల్గు సువిశేషములు కల్గిన ఈ పుస్తకం ప్రపంచంలో కల్లా అత్యద్భుత మైంది అటువంటి కల్పల్నికి వాళ్ళకెటువంటి సునిశితమైన పరికరాలూ, నేత్రాలూ ఉన్నయ్యో? ఈ కళల్లో అర్ధశతాబ్దం నుంచీ కృషిచేస్తున్న నాకే అగమ్య గోచరంగా ఉంది"

సెయింట్ 'కొలంబ, విరచితమైన అద్భుత కళా ఖండాల్నుంచి అట్లాగ్గానే ఒక్క అక్షరం తయారు చేయడానికి ఒక ఆధునిక కళా వేత్త ఆర్నెల్ల పాటు శ్రమించి ఆఖరికి చేతగాక నిరుత్సాహుడై ఆ పని నుంచి విరమించాడు.

వాళ్ళ విజ్ఞాన తృష్ణ సర్వ స్పష్టమైన విషయమే! ప్రాథమిక యుగాల్లో విజ్ఞాన వేత్తలకూ సర్వసౌకర్యాలూ లభించినై.

"విజ్ఞునికి సర్వ సాధారణంగా పెట్టిన గొప్ప బిరుదు, 'ఒలాంబ్ (Ollamb) అని. వీళ్ళల్లో ప్రతివాడికీ, ఒక ఇరవై ఆవులూ వాటికి కావల్సిన మేత, వాళ్ళకు తిండీ, ఇరవై నాలుగు మంది సేవకులూ, రెండు వేటకుక్కలూ, ఆరుగుర్రాలూ ఇచ్చేవాళ్లు. కానీ ఆస్థానాన్ని పొందాలంటే విజ్ఞానంలో, పలుకులో, ఆచరణలో అతనికి నిష్కళంక మైన పవిత్ర ప్రవర్తన ఉందని అతడు నిరూపించుకోవాలి" అని ప్రొఫెసర్ 'కర్రి' (Curry) చెబుతున్నాడు.

ఈనాడు అటువంటి యోగ్యతలే కావాలని పట్టుబడ్తే ప్రపంచం ఎంత బాగుంటుంది!

ఇటువంటి విజ్ఞాన తృష్ణ, అభిమానం, ఇంతవరకూ నాశనం కాలేదు. పైగా ఎటువంటి బ్రహ్మాండమైన వ్యతిరేకతల్ని కూడా జయించి ఈ విజ్ఞాన తృష్ణ మహత్తరంగా పెంపొందింది. దేశంలో యుద్ధ మేఘాలు గర్జించినై. పరమ కిరాతకులు చర్చీలను, మఠాల్ని నిర్దాక్షిణ్యంగా నాశనం చేశారు. ఐరిష్ వాళ్లు తమ మీదికి దండెత్తిన వాళ్లను పరాజయుల్ని చేసి గొప్ప విజయంతో తమకు జేసునాథుడు అండగా నిలబడిన వెంటనే విచ్ఛిన్నమై పోయిన విజ్ఞాన సౌందర్యాన్ని పునః

ప్రతిష్ట చేయడానికి ప్రప్రథమంగా శ్రద్ధ తీసుకొన్నారు. ఉదాహరణకు బ్రియన్ బోరురాజు (King Brian Boru) డేన్సును పారద్రోలడాని కన్నా ముందుగా భగ్నమైపోయిన పాఠశాలల్ని, మఠాల్ని పునఃప్రతిష్ఠించ డానికీ, అజ్ఞాన కూపంలో పడకుండా ప్రజల్ని రక్షించడానికీ ఎక్కువగా శ్రద్ధవహించాడు.

"స్వేచ్ఛనూ, విజ్ఞానాన్నీ ప్రబోధించడానికీ, దేశాంతరాల్లో గ్రంథాల్ని కొనుక్కు రావడానికి ఆయన పండితుల్ని నియోగించాడు. ఎందుకంటే ప్రతి దేవాలయంలో ప్రతి మఠంలో ఉన్న వాళ్ళ ప్రాచీన గ్రంథాలన్నీ మొదట్నుంచి చివరదాకా వెతికి వెతికి ఆ కిరాతకులు దగ్ధపటలం చేసి కొన్నీ, సముద్రాల్లో పారవేసి కొన్నీ ఇట్లు సర్వనాశనం చేశారు. ఈ కృషికి ఉద్యమించిన ప్రతివ్యక్తికీ అతడి చదువుకూ, పుస్తకాలకూ కావలసిన ధనాన్ని 'బ్రియన్' స్వయంగా ఇచ్చాడు!" అని ఆయన్ని గూర్చి సమకాలిక రచయిత వ్రాసాడు.

అటువంటి నాయకుల ఉత్సాహం ఐర్లండు జాతిలో కలకాలం ఉంది. ఐర్లండు కఠిన శిక్షా సమయాల్లో ఉన్నప్పుడు ఉపాధ్యాయుడే చిక్కితే ద్వీపాంతరవాస శిక్షలు విధించబడే రోజుల్లో, ఐరిష్ వ్రాత, గ్రంథాలు కనపడిన గృహాల్ని తగల పెట్టి నాశనంచేసే దినాల్లో అన్యమత విషాన్ని త్రాగటానికి బదులుగా మెల్లగా దొంగతనంగా పూరిపాకాల్లోకి పారిపోయి దాని నీడలో విజ్ఞానాన్ని సంపాదించుకునే కష్టస్థితుల్లో ఐరిష్ జాతి సర్వ నాశనం కాకుండా మనకుగల్గటానికీ, ఉన్నత స్థానాన్ని పొంద గల్గటానికీ వాళ్ళ ఉత్సాహాతిశయాలే ప్రధానాలు.

ఐర్లండు ఎన్నడూ తన స్వార్థ మహిమ కోసం తాపత్రయ పడ లేదు. ఆమె, నేల నాల్గు చెరుగులా మంచినే చూస్తూ ప్రయాణించింది. ఇతర జాతుల మీద ఐరిష్ ఆదర్శాలు ఎంత ఘనంగా ప్రతిబింబించి నయో స్పష్టంగా తెలుసుకోడానికి సదవకాశం కల్పించింది ఈ సత్యాన్ని నిరూపించ డానికి ఒక్క సంఘటన చాలు అమెరికన్ జాతి మీద ఐరిష్ ఆదర్శ ప్రభావాల్ని గూర్చి మాట్లాడ్తూ ప్రఖ్యాత

న్యాయశాస్త్రవేత్త, యునైటెడ్ స్టేట్సుకు ఇది వరకు అధ్యక్షుడూ ఐన టాఫ్ట్ (Taft) ఏమన్నాడో వినండి!

"మన అమెరికన్ జీవితంతో ఐరిష్ జీవితం సులభంగా కలసి పోయింది. అనేక విధాలైన యూరోపియన్ ప్రభావ సమ్మిళితమైన అమెరికా నివాసికి అది చాలా మేలు చేకూర్చింది. అమెరికన్ హాస్యాన్ని అది మృదువు చేసింది. అమెరికన్ ఆర్ద్రతను అభివృద్ధి చేసింది స్నేహ స్వభావాన్ని పెంపొందించింది. మన సాంఘిక మర్యాదలు మరింతగా ఎక్కువ చేసింది. మన కవిత్వ భావల్నికి దోహదం చేసింది. అంతా మన మేలుకే అన్న భావాన్ని బాగా దృఢ పర్చింది. మన తత్వ శాస్త్రాన్ని బల పర్చింది. సామ్యవాదానికీ, అరాచకానికీ ఐరిష్ ప్రజల హృదయంలో స్థానం లభించ లేదు. అధునాతన సంఘాల్లో వారికి విశ్వాసం ఉంది. మన జాతీయ ప్రభుత్వాల్నీ, స్టేట్ ప్రభుత్వాల్నీ అభివృద్ధికి తీసుకు రావాలని బాగా విశ్వసించింది. ఇప్పుడున్న విధానా నికి వాళ్ళు పూర్తిగా వ్యతిరేకులు గారు. అందరికీ సమానావకాశాలు లభించాలని పోరాడుతారు. శాసనాల వల్ల లభించే స్వేచ్ఛను వాళ్ళు గుర్తిస్తారు. ఇప్పుడున్న సంఘాన్ని తల్లక్రిందులు చేసి మరో నూతన సంఘ వ్యవస్థను నిర్మించడాని కని వాళ్ళు తహతహ లాడ్డం లేదు. మన ప్రభుత్వం కింద లభించడాని కవకాశమున్న అభివృద్ధికీ, సౌఖ్యానికీ వాళ్ళుక్షేపూర్తిగా దోహద మిస్తున్నారు. దీనికంతటికీ వాళ్ళు కృతజ్ఞులు. దీన్ని వాళ్ళు గౌరవిస్తారు. దీన్ని కాపాడ్డానికి వాళ్ళు పోరాడుతారు"

"దీనికంతటికీ వాళ్ళు కృతజ్ఞులు. దీన్నివాళ్ళు గౌరవిస్తారు. దీన్ని కాపాడ్డానికి వాళ్ళు పోరాడ్తారు!" బహుశా వాళ్ళు అట్లా చేయ వచ్చు. ఈ హక్కులకోసం వాళ్ళు శతాబ్దాలనుంచీ పోరాడారు. వీటిని గౌరవించారు. వారి ఆదర్శాల్ని పవిత్రాలు చేసుకోడానికి వాళ్ళు ప్రయత్నించారు. వాళ్ళ స్వదేశంలో ఈ హక్కులు నిరాకరింప బడ్డ పుడు అన్యదేశాల్లో వాటిని సాధించారు.

వీరి అభివృద్ధిని మానవ కొలతబద్దతో కొలిచి ఇంతని చెప్పలేము. వారి కార్యకలాపాలు దైవిక సంబంధమైనవి కాబట్టి వాటిని మానవ జ్ఞానముతో పరిశీలించి విలువ కట్టలేము.

ఈ ఐరిష్ తరుణ గృహిణి చేసిన పనికి నిందారోపణ చేయడానికి ఎవరికి దమ్ములున్నయ్? ఆమె తన ఇద్దరు బిడ్డల్తో, భర్తతో ఆస్ట్రేలియాకు పోయి అక్కడ నివాస మేర్పరచుకొంది గడ్డుకాలం కావడం చేత వాళ్ళు ఘోర పరాజయాన్ని పొంది ముప్పై షిల్లింగుల ధనంతో మెల్బోర్న్‌కు చేరారు. ఉద్యోగం కోసం ప్రయత్నించారు కానీ లాభం కనపడ లేదు. ఆరు షిల్లింగులు మాత్రం మిగిలి తక్కిందంతా ఖర్చై పోయింది. ఈ ఆరు షిల్లింగులు తీసికొని చర్చికి పోయి, సెయింట్ అంతోనీ స్వరూప సమీపంలో 'బీదవాళ్ళ కొరకు' అని వ్రాసి ఉన్న పెట్టెలో వేసింది. "సెయింట్ అంతోనీ! మాకు ఈ లోకంలో ఉన్నదంతా ఈ ఆరు షిల్లింగులే మాకు ఉద్యోగం ఇప్పించమని భగవంతుణ్ణి ప్రార్థించు!" అని ఆమె విలపించింది. తక్షణమే వాళ్ళిద్దరికీ ఖాయమైన నౌకర్లు దొరికినై. ఐహిక వాంఛా పూర్ణులైన విజ్ఞానులీ విషయాన్ని సందేహించి, ఏదో 'కాక తాళీయంలే' అని త్రోసిపుచ్చ వచ్చు. కానీ ఆ ఐరిష్ గృహిణి హృదయంలో లేశమాత్రమైనా సందేహం లేదు. ఆమె ప్రతి దినం తమ కీ పని కల్పించిన దేవుడికి అభివందన స్తోత్రాలు చెల్లిస్తున్నది.

కానీ ఏం చెప్పినా జీవితానికి మృత్యువు, చరమ పరీక్ష. మనం ఎట్లా మరణించాలనో నేర్చుకోడానికే ఇక్కడ ఉన్నాం. మనం మరణించిన విధానంలోని ప్రమాణమే మనం జీవితంలో ఎంత విజయాన్ని సాధించామో తెలియచేసే కొలమానం. సత్ ఆదర్శాలు లేక స్వేచ్ఛగాజీవించి నిరాశా పూరితులై మరణించే వార్ల మరణశయల్ని పరికించిన వాళ్లు ఐరిష్ వాళ్లుమరణించు విధాన్ని చూస్తేఏళ్ళమరణము మోక్షానికి సోపానమని తెలుసుకుంటారు.

కెన్నెమరా పర్వతం పక్క ఎత్తైన ప్రదేశంలో ఉన్న ఆ చిన్న గృహానికి నాతోరా ! ఆ గృహంలో మరణావస్థలోఉన్న వ్యక్తిని గూర్చిన సందేశమొకటి చాల తొందరగా వచ్చింది

ఆ కుటీరాన్నిచూస్తే అక్కడి దుర్భర దరిద్రదశ అర్థమాతుంది. దట్టంగా పెరిగిన పచ్చిక ఆ పూరిపాక గోడలదాకా పెరిగి ఉంది,

కప్పు బరువువల్ల ఆ ఇంటి తాటిస్తంభం వంగిపోయింది. ఆ ఇంటిని చూస్తే అది కొండ పక్కగా ఉన్న ఒక పచ్చిక గుట్టా అనిపిస్తుంది.

పిల్లల ఏడ్పులూ, ఒక స్త్రీ మంద విలాపం ఆ గృహం లోంచి వినపడుతున్నయ్. ఆ ఇంటికున్న చిన్నద్వారంగుండా మనం లోపలికి ప్రవేసించడానికి వంగోని పోతున్నప్పుడు మట్టినేల మీద మోకరించి ఉన్న ఒక స్త్రీ, ఐదుగురు పిల్లలూ మనకు కనపడ్డారు. ఆమె దుఃఖ భార నిమగ్నురాలై ఉంది. ఆమె సంతానం రోదిస్తూ ఆమెను చుట్టుకొని ఉన్నారు.

ఉపోష్యాలవల్ల శరీరంలో ఉన్న రక్త మాంసాలు క్షీణించి పోయి, జ్వరం తగిలి చావడానికి సిద్ధంగా ఉన్న తండ్రి, ఎడమచేతి వేపున్న కుక్కిమంచంలో ఉన్నాడు. అతడు మనల్ని చూచినవెంటనే, అతడి ముఖంలోని మరణవేదనాచిహ్నాలదృశ్యమై పోయినై. ఆశతో, విశ్వాసంతో మన ప్రతి చర్యనూ జాగ్రత్తగా గమనిస్తున్నాడతడు. చావు అతడికి రహస్యంకాదు. ఎందుకంటే, అతడు తన జీవితంలో మొదట్నుంచీ మృత్యువు నెదుర్కోడానికి సర్వసిద్ధంగా ఉన్నాడు. అతడు ప్రతిదాన్ని గ్రహిస్తున్నాడు. పరిశుద్ధ వస్త్రంపై ఉన్న జేసునాథుడు- పవిత్ర తైలంగల సీసా- అంగరఖా వెలుగుతున్న దీపకళికలు- అన్నీ అతడికి తెలుసు. అతడు ప్రశాంతంగా పాపసంకీర్తనం చేస్తున్నాడు. ఏ భగవంతుడి సాక్షాత్కారంచేత తన పూరి గుడిసె పవిత్రమైన దేవాలయంగా ప్రకాశిస్తుందో, ఆ జేసునాథుణ్ణి భక్తిప్రపత్తుల్తో ఆహ్వానిస్తున్నాడు. తర్వాత ధృఢమైన విశ్వాసంతో తన భావాల్ని ఇహలోకం వైపు మరలించాడు. చిన్న బల్లమీద ఉన్న జేసునాథుడి స్వరూపం వైపు చూస్తూ ఆయనతో, తన్ను ఒంటరిగాచేసి తన భర్త ప్రాణాల్ని తీసుకు పోవద్దని మొరపెట్టుకొంటూ అతి దీనంగా విలపిస్తున్న భార్యవేపు అతి కష్టంమీద మంచంలో పత్తిగిలి ప్రేమ దృష్టితో చూస్తున్నాడు. "కాథరిన్!" అని ఆ మరణావస్థలో ఉన్న వ్యక్తి అతిహీనస్వరంతో ఆమెను పిలుస్తున్నాడు. ఆ పిలుపుకు వెంటనే ఆమె సరిగా అతడివైపు తిరిగి పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకొనేటందుకా

అన్నట్లుగా తన రెండుచేతుల్తో గుండె నదిమి పట్టుకొని, సజల నేత్రాల్తో అతడివేపు చూస్తున్నది.

మరణోన్ముఖుడైన అతడు ఒక్కొక్క అక్షరమే హీన స్వరంతో పెకిలించు కొంటూ, "కాథరిన్!-ఏ-డ్వ-వ-ద్దు.- మ-న-కు- పై-న-భ-గ-వం-తు-డు- లే-డూ?- నే-ను- ఆ-య-న్ని- క-లు-సు- కొ-న్న-ప్పు-డు- ని-న్ను- గూ-ర్చి -పి-ల్ల-ల్ని- గూ-ర్చి- ఆ-య-న-తో-చె-ప్తా. "అని అన్నాడు.

అతడు నెమ్మదిగా వెల్లకిలా పడుకొని మళ్ళీ భగవంతుణ్ణి ప్రార్థిస్తు న్నాడు. అతడు మరణించాడు. అతడు, 'పైనఉన్న భగవంతుణ్ణి' కలుసుకోడానికి పోయాడు. 'పైనఉన్న భగవంతుడు' అన్నది ఆ ప్రజల గౌరవ పూరిత మైన పలుకు.

రోజంతా మోకాలి లోతునీళ్ళల్లో ఉండి, అతడు జీవితమంతా బానిసవలె పర్వత ప్రదేశాల్లో శ్రమించాడు. అతడి జీవితం, దుర్భర దారిద్ర్యంతో, హోరాహోరిగా యుద్ధం చేసింది. ఆ దుర్భర దారిద్ర్యం, అతణ్ణి పస్తులు పెట్టి త్వరలో చంపి వేసింది. ఇంట్లో గుప్పెడు మెతుకులు కూడా లేకుండా అతడు తన భార్యనీ, పిల్లల్ని వదలి మరణించాడు. దృఢమైన విశ్వాసంతో వాళ్ళను జేసునాథుడికి వప్పగించి వెళ్ళాడు.

అతడు అన్ని సంవత్సరాలుగా పోరాడిన విపద్దశ అంతా అతడు మరణంతో అంతర్ధానమై పోయింది. అతడి దైవ విశ్వాసంతో అన్నిట్లో లోతు పాతులు గ్రహించాడు. అతడు ఒక మహా విజయాన్ని సాధించిన వ్యక్తిగా మరణించాడు.

బెత్లెహేము గుహలోని దారిద్ర్యంతో తన వాళ్ల దారిద్ర్యాన్ని కొల్చాడు. అతడి కష్టాల్ని జేసునాథుడి బాధల్తో పోల్చి చూసాడు. అతడి జీవితాన్ని శాశ్వతత్వంతో కొలుచు కున్నాడు. అతడి కెల్లప్పుడూ దర్శనమిస్తూ, ఇంకా ఉన్నత దశకూ, అభ్యుదయ మార్గానికీ రమ్మని పిల్చే నాయకుడైన జేసునాథుణ్ణి అనుసరించాడు.

స్పిరితు సాంక్తు సర్వేశ్వరుని సప్త అనుగ్రహాలూ అటువంటి స్వచ్ఛమైన ఆత్మల్లో పని చేస్తాయ్. అటువంటి ఆత్మల్లోనే ఐర్లండు గొప్పదనమంతా ఇమిడి ఉంది.

వాళ్ల ఆదర్శ మార్గాలు సప్త సంస్కార మార్గాలు. ఆ మార్గం వెంబడి శాశ్వత జీవన సారం ప్రవహిస్తూంటుంది. ఈ మార్గాన్ని భక్తి విశ్వాసాల్తో అనుసరిస్తూ, బ్రతుకులో, మరణంలో ఘన విజయాన్ని సాధించిన ఐర్లండు ప్రజలు ఐర్లండును స్వర్గానికి ఎత్తారు.



## 14వ అధ్యాయం

# ఐరిషియుల సంతోషం



సంతోషానికి కథోలిక్కు తిరుసభ ఆటపట్టు. దాన్ని స్థాపించిన మహనీయుడు 'హర్షతరంగాల్ని' ప్రసరిస్తూ భూలోకంలోకి అవతరించాడు. ఆశ, ప్రేమల్తో కూడిన హర్షం తిరుసభ యొక్క ప్రత్యేకత. "అన్ని యుగాల్లో హర్షంతో కూడుకొన్న సంతానం కలిగి దాని ప్రవర్తనలో, విధి నిర్వహణలో ఆచార వ్యవహారాల్లో సంతోష ప్రదమైన తిరుసభయె, నిజంగా తిరుసభ అని చెప్పుకో తగింది." అని ఒక ఐరిష్ గురువు సంతోషంతో పల్కాడు.

బాగా అర్థం చేసుకొని ఆచరణలో పెట్టిన మతమే అన్నివిషయాల్లో అనంతమైన ఆనందాన్ని హృదయంలో చేకూరుస్తుంది. సెయింట్ లారెన్సు, సర్ థామస్ మోర్, వీళ్ళిద్దరూ తమ ప్రాణాలు బలిపెట్టే సమయంలో కూడా ఛలోక్తులు విసరడానికి ఈ ఆనందమే కారణం.

విశ్వాస కూపంలోంచి కతోలిక్కు హృదయాల్లో పొంగి వచ్చే ఈ ఆనందమే మానవత్వానికి సంభంధించిన ప్రతి విషయాన్ని మృదులం చేస్తుంది. విశ్వాసం, చమత్కారం పెన వేసుకొని ఉంటయ్. కొందరు సంకుచిత స్వభావులు చమత్కార శక్తిని అర్థం చేసుకోలేక తికమక పడ్తారు. అది నిజమే; దాన్ని మతంతో తూచి చూస్తే పవిత్రత వల్ల ఆ చమత్కృతి జనిస్తుంది. కానీ దాన్ని వాళ్ళు మర్చిపోయారు. కాలంతో పాటు మారుతూ మానవుడిలో శాశ్వతంగాఉండే చమత్కృతి దైవ విశ్వాసం వల్ల ఉద్భవిస్తుంది.

కానీ దైవ విశ్వాసం వల్ల జనించిన చమత్కృతిని అర్థం చేసుకోవాలంటే ఆ వ్యక్తి దైవ విశ్వాస పరుడై ఉండాలి. ఇహలోక విషయాల్లో లోతు పాతులు గ్రహించాలనుకొన్న వ్యక్తి ఆనందంతో కూడిన అచంచలమైన విశాల దృక్పథాన్ని అతడు తప్పకుండా అలవర్చుకోవాలి. 'ఆనందమయుడివి కమ్ము!' అని జేసునాధుడు తన అనుచరుల్ని ఆదేశించాడు. భగవంతుడి శాంతి తత్వాన్ని కల్గి ఉన్నందు వల్లనే ఈ ఆనందం కలుగుతుంది.

మానవుడు దేవుని చిత్తానికనుగుణంగా ప్రవర్తిస్తున్నపుడు అన్ని వస్తువులూ తమ సృష్టికర్తను గూర్చి ఆనందంతో మధురగానంచేస్తయ్. అప్పుడే అతడు అభ్యుదయానికి విజయానికీ అడ్డంగా ఉన్న ప్రతిబంధకాలన్నీ తొలగించ కల్గుతాడు. కేవలం ఐహిక సౌఖ్యాల కోసమే జీవించే మానవుడు అసలు జీవిత పరమార్థాన్నే గ్రహించలేక నిజమైన ఆనందాన్ని అర్థం చేసుకోలేడు. సంతోషం లేని చోట సంతోషం కోసం వెదకులాడ్తాడు. అంతం లేకుండా పరిభ్రమించే ఈ ప్రపంచంలో, "ఆలోచించండ" మంటే దుఃఖాన్ని కొని తెచ్చుకోడ మన్నమాట! వ్యక్తులు నిరాశా పూరితులౌతారు." దుఃఖాలు హృదయాన్ని క్రుంగదీస్తుంటే ఆనందంకోసం తంటాలుపడే ప్రపంచమిది! ఈ జగము మానవునికి అంత్యగతికాదు. బలహీనత, మృత్యువూ అనే ద్వంద్వాన్ని అర్థం చేసుకోలేని అమాయిక లోకమిది!

ఐహిక లాభ పరాయణుడూ విశ్వాస రహితుడూ ఇసుక తక్కెడా, పేడతక్కెడా వంటివాళ్ళు. ఎందుకంటే, అతడి దృష్టిలో జీవితానకి అర్థంలేదు.

"నేను వృద్ధున్నౌతున్న కొద్దీ, నాకు మరణకాల మాసన్నమౌతున్నకొద్దీ, సర్వనాశనమే అన్న భావనపై నాకున్న అయిష్టత మరీ ఎక్కువౌతున్నది ఆ భావన నాకెల్లప్పుడూ మహా భయంకరంగా గోచరిస్తున్నది నాకు నరకంలో ఉన్నట్లుగానే ఉంది" అని నాస్తికుడైన 'హాక్స్‌లీ' చెప్పాడు. 'హెర్బర్టు స్పెన్సర్'కూడా ఇటువంటి తప్పుడు అభిప్రాయాలవల్లే చాలగా వ్యథపొందాడు.

"ఇదుగో! నేనుమీకు అమితానందాన్ని చేకూరుస్తాను!" అన్న మొదటి క్రిస్టమస్ సందేశాన్ని విని అర్థం చేసుకొన్న వ్యక్తుల జీవితాలకంటే, ఆ జీవితాలు ఎంత విభిన్నమైనవి! జేసునాథున్ని బాగా అర్థం చేసుకొన్న మహాత్ముల జీవితాన్ని మనం చదువుతూంటే ఈ సందేశంయొక్క పూర్ణ ప్రభావం వాళ్లపై ఎట్లుప్రసరించిందో మన కర్థమౌతుంది. ఎటువంటి బాహిరమైన దుఃఖాల్లో, కష్టాల్లో గూడా ఆ మహామహుల పవిత్రాత్మలు ఆనందగానం చేసినై. వాళ్ళు ప్రపంచానందాన్ని స్వీకరించి దాన్ని మరింత అభివృద్ధి చేసారు!

ఈవిషయం, ఫాదర్ 'బాయ్‌లన్' (Father Boylan) పల్కిన మాటల్లో సుస్పష్టంగా వివరించబడింది.

"అస్సిసి ఫ్రాన్సిస్ (Francis of Assisi) మధ్య యుగంలోని పవిత్రతకు గొప్ప ఆదర్శం. ఆయన ఆనందమయ హృదయం ప్రపంచాన్ని ఆనందమయంగా చేసింది. ఆయన్లో ఉన్న ఆ గాఢమైన ఆనందాన్ని ఆయన అనుచరులు పుణికి పుచ్చుకోని ఐహిక దుఃఖాలన్నింటినీ తరించారు."

ఎవరైనా పవిత్రులైన మహనీయులంటూ ఉంటే వాళ్ళల్లో కార్మెల్ సభను సంస్కరించిన సెయింటు 'తెరెసా' (Teresa) ప్రథమ గణనీయురాలు. ఆమె చచ్చిపోయేంత వరకూ ఆనందంగా కాల క్షేపంచేసి ఆ ఆనందాన్ని తన తరువాత వాళ్ళకు వప్పగించి వెళ్ళింది. ఈ నాటికీ మొత్తం ప్రపంచంలో కార్మెల్ మతంలోని ప్రాచీన మత సాంప్రదాయ అను యాయులైన వృద్ధులు తమ మరణకాలంలో కూడా యువకులు మాదిరిగా మందహాస వదనాల్తో పెండ్లికి తరలి పోతున్నట్లుగా ఉండటం మనం గమనిస్తున్నాం మహాత్ము లెప్పుడూ యువకులే! కొన్ని శతాబ్దాలు, మానవులు జరామరణాలు లేని శాశ్వత యౌవనత్వం కోసం సంజీవిని సాధించడాని కని కలలు గన్నారు. అది సాధించలేక వాళ్ళాఖరికి దాన్ని ఒక సుఖ స్వప్నం కింద జమకట్టారు. అది సుఖస్వప్నం కాదు. నిజమే! జేసునాథుడు ప్రపంచానికి అనుగ్రహిస్తున్నాడు. "నేనిచ్చే జీవనోదకం త్రాగిన వాళ్ళకు ఇక ఎన్నటికీ దప్పిక ఉండదు" ఇదీ ఆయన సూక్తి.

ఈ సంపూర్ణానందం వాళ్ళది. ఎందుకంటే వాళ్ళు జేసునాథుణ్ణి బాగా అర్థం చేసుకొన్నారు. ప్రపంచంలోని ప్రతి మతంలోనూ హర్ష ధ్వానులు వినిపిస్తయ్. 'స్టైఫెన్ సన్' అన్నట్లుగా, అటువంటి ఆత్మలకు కొరడా దెబ్బలు భగవంతుడి బుజ్జగింపులు. అపోస్తులు (Apostles) కొరడా దెబ్బల్లో, త్యాగధనులు హింసల్లో, స్తుతీయులు కఠిన సమయాల్లో, మహాత్ములు ద్వేష దరిద్రాల్లో ఆనందంగా ఉన్నారు కానీ అన్ని కష్టాల్లోనూ వాళ్ళను తిరుసభక్తి సంరక్షించింది. వాళ్ళు సత్ప

ధాన్ని ఎన్నడూ వదలి పెట్ట లేదు. దారీ తెన్నూ తెలియని వాళ్ళ మాదిరిగా వాళ్ళెన్నడూ అధః పతనం కాలేదు. అతివృష్టి, అనావృష్టుల్లో ఉన్న చంచలమైన ఈ ప్రపంచానికి వాళ్ళు మహౌషధులు! అతి కష్టసమయంలో తిరుసభ తన సహాయార్థంగా కళల్నీ, సంగీతాన్ని ఆహ్వానించి వాళ్ళను ఈ ఆనందంతో ముంచెత్తిన కారణంగా సంకుచిత దృష్టిగల వాళ్ళు కొందరు, దాని పరమార్థాన్ని గుర్తించకుండా, మానవుడు ఎక్కువగా సంతోషంలో మునిగిపోయి భగవంతుడికి సన్నిహితు డౌతాడన్న భయం చేతనో ఏమో, వాద్యపరికరాల్నీ, చిత్రాల్నీ, శిల్పాల్నీ నాశనం చేసారు. ఈ రోజు అటువంటి కఠిన హృదయం అంతర్ధానమై పోతున్నది. కానీ ఈ నాడు స్ఫురిమించిన ఆర్ద్రత ఎర్పడి, ప్రపంచాన్ని మరో నాశన కరమైన సిద్ధాంతంలో ముంచెత్తింది. దుఃఖము, బాధా చేటులని నమ్మి, మానవత్వ మిషతో, వాటిని తొలగించడానికి అవి నీతికరమైన మార్గా న్ననుసరిస్తున్నారు.

తిరుసభ, కష్టాల్ని ఎదుర్కొని పురోగమిస్తున్నది. కష్టాలు సంతోషానికి దారి చూపిస్తాయి అని బోధిస్తున్నది. అభ్యుదయానికి బాధలు మార్గదర్శకాలు అని సిద్ధాంతీకరిస్తుంది. బాధ, ఒక పరీక్ష. శరీర కండరాలబలానికి వ్యాయామం ఎటువంటిదో నీతిబలానికి బాధఅటువంటిది.

దరిద్రం, పరిశ్రమా, బాధా మనల్ని పరిపూర్ణుల్ని చేసే సాధనాలుగా మన విశ్వాసం మారుస్తున్నది. అవి భగవంతుడిప్రేమను ప్రతిబింబపచేసే దర్పణాలని రుజువు చేస్తున్నది.

ఐర్లండు ఈ దర్పణంలోనికి తొంగి చూసింది. ఆమె కష్టాలన్నింటినీ హరించి, ఆమె హృదయాన్ని భగవంతుడి మందహాస కాంతుల్లో ప్రకాశింప చేసే రత్నమాదిరిగా వాళ్ళ భగవత్ప్రేమ ఉంది.

కొందరు రచయితలు ఐర్లండును వ్యసన భూయిష్టమైన దేశంగా చిత్రించారు. మరి కొందరు అది పగటి కలలుగను వార్ల దేశం అని వ్రాసారు. ఇంకా కొందరు దాన్ని చపల చిత్తుల భూమి అన్నారు. ఈ రచయిత లందరూ పప్పులో కాళ్ళేసారు. ఎందుకంటే వాళ్ళది తప్పుడు దృష్టి తీవ్రమైన ఉత్సాహాన్ని భాగ్యమని భావించు

స్థిరమైన ఆలోచనక్కి స్థానములేని ఎడతెరిపిలేని మార్పులలో సంతోష మున్నదని భావించు ఆధునిక జీవితంలో నుంచి వచ్చిన వీరలు ఐర్లండు నిశ్చలస్వభావాన్ని గ్రహించజాలక వ్యసనకరమైంది అని అన్నారు. ఐర్లండు, భౌతిక వాదాన్ని నిరాకరించి ఉన్న ఆదర్శాల్లో నిమగ్నమై ఉన్న కారణంగా, ఆచరణలో పెట్టలేని పగటి కలలుగనే వాళ్ళ భూమిగా దాన్ని చిత్రించారు. నిజానికి దాని చరిత్ర చదివితే తక్కిన జాతులన్నిట్లో అది యదార్థాన్నిబట్టి ఆచరించేదని తెల్తుంది. జాతులన్నీ నామ రూపాలు లేకుండా ఒక వంక ఛిన్నా భిన్నమై పోతూంటే, వాళ్ళు దృఢ నిశ్చయంతో, అచంచలమైన విశ్వాసంతో పురో గమనం సాగిస్తూంటే, దాన్ని చపలచిత్తుల్తో కూడిన రాజ్యంగా అభివర్ణించడానికి సాహసించారు.

పిచ్చి భ్రమలోపడి వ్యసన భూయిష్టమైన ప్రపంచాన్ని నడుపు తున్న వాళ్ళు ఐర్లండును గుర్తించ లేరు. ఆ వ్యసనాల్నుంచి తప్పించు కోడానికి ఆత్మ హత్యల్కి పాల్పడే విషాద లోకం, ఐర్లండు విష యాన్ని గ్రహించ లేదు. వేలం వెర్రితో కూడుకొని దాని వెను తుఫాను ధాకకు తాళ్ళేక ఉక్కిరి బిక్కిరై పోతున్న జగం ఐర్లండు ప్రశాంత వాతావరణాన్ని అభినందించలేదు. ఐర్లండు నిశ్చలమైంది. ప్రశాంత వాతావరణ పరిశోభితమైన దేశమది. దేశమంతటా ఇటు వంటి పరిస్థితి మనకు గోచరిస్తుంది. పొలాల్లో, పర్ణకుటీరాల్లో, సముద్ర తీరంలో, శిథిలమైన మఠాల్లో, దేవాలయాల్లో, ఒడిదుడుకులు లేకుండా ప్రవహించే నదీ తీరాల్లో, పచ్చని మైదానాల్లో, సుందరోద్యానాల్లో ఒక చోటేమిటి? దేశంలో ఎక్కడ చూచినా ఈ ప్రశాంత వాతా వరణం మనకు కనబడుతుంది. అందమైన శాద్వల ప్రదేశాల్లో, మహోన్నత పర్వతాల్లో, సుక్షేత్రాల్లో, నదీ నదాల్లో, అందమైన సరస్సుల్లో, ఉద్యాన వనాల్లో, దివ్యంగా ప్రకాశించే భూమి అది.

ప్రతి పట్టణంలో, ప్రతి గ్రామంలో కేంద్ర స్థానమైన చర్చి నుంచి ఈ ఆత్మసంతృప్తి, ఈ ప్రశాంతతా దేశం నాల్గు మూలలా తాండవిస్తుంది. అది రైతుల కృషిని మనోజ్ఞం చేస్తుంది. బాటసారి మార్గాన్ని సుగమం చేస్తుంది.

ఐరిష్ వ్యక్తి చాలా నిరాడంబరంగా, సహజంగా సత్ప్రసాదం సంధింప పోవడం చూస్తే ఆ విధానానికి అలవాటు పడని వాళ్ళకు అమితాశ్చర్యం కలుగుతుంది. అరుణోదయానికి పూర్వం ఒక పర్వదినాన నే నొక దేవాలయములో మోకరించి ఉన్నా. శీతాకాలపు అమిత చలిలో, అంధ రంలో పట్టణబహిఃప్రదేశమంతా నిశ్శబ్దంగా ఉంది. పూజబలి ప్రారంభ మౌతున్న వెంటనే ఉన్నట్లుండి నాకు పాదధ్వనులు వినపడ్డయ్. వెంటనే అక్కడున్న స్థానాలన్నీ చలికండవలు వేసుకొని వచ్చినవాళ్ళచేత ఆక్ర మింప బడ్డయ్. వాళ్ళందరూ భక్తి శ్రద్ధల్తో మోకరించి పూజబలిలో పాల్గొన్నారు. వాళ్ళు నృత్య వినోదాలనుంచి వచ్చిన యువకులు. రాత్రుల్లో వాళ్ళు నృత్య వినోదాల్లో సుఖంగా కాలక్షేపం చేసినా, భగవంతుడి పట్ల తమ కున్న విధిని ఏమర్లేదన్నది స్పష్టమైంది. వాళ్ళు తమతమ గృహాలికి వెళ్ళి పోబోయే ముందు గుడికి పూజబలి పండ క్కోసం వచ్చారు.

ఇది చాలా అసంగతమైన విషయమని గొణుగు తున్నావు కదూ! ఐర్లండులో అసంగతమైందేమీ లేదు. తక్కిన జాతుల కన్నా ఐరిష్ వినోదాలూ, నృత్యాలూ చాలా వినయ సంపన్నాలు పరి సుబ్రాలు హృదయ పూర్వకాలు. కష్టాల్లో మాదిరే, ఆనంద సమ యాల్లో, సమావేశాల్లో మాదిరిగానే ఏకాంత సమయాల్లో భగవం తుడు వాళ్ళతోనే ఉంటాడు. వాళ్ళు ఆనంద సమయాల్లో భగవంతుణ్ణి మర్చిపోరు. సెలవు రోజుల్లో వినోదాల్తో పొద్దుపుచ్చే టప్పుడు గూడా వాళ్ళు భగవంతుణ్ణి ఏమరరు.

క్లేర్ కు ఉత్తరాన ఉన్న ఉన్నతమైన మధ్య మైదానంలో 'లిస్ డూన్ వర్న' (Lisdoonvarna) లో సెలవ కాలక్షేపం జరుగుతున్నది. అది కేవలం ఆనంద వాంఛాపర్లకే అక్కరకుంది. ఆ సమయంలో ఆ పట్టణ వీధులన్నీ కిట కిట లాడి పోతున్నయ్. పగటి పూట విహా రాలు, సాయం సమయాల్లో నృత్యాలు, సంగీతాల్తో కాలం క్షణంలో ఇట్టే గడిచి పోతుంది. ఇది ఐర్లండుకు కొత్త కాదు. ఇతర దేశాల్లోనూ ఈ పరిస్థితి ఉంది, కానీ ఐర్లండు విషయంలో ప్రత్యేకత ఏమిటంటే, ప్రతి రోజున ప్రాతఃకాలంలో ఈ విషయాల వల్ల వచ్చిన

ఆనందాన్ని వాళ్ళు పవిత్రం చేసుకొంటారు. అది నిజంగా ఐరిష్ విశిష్టతే.

ఐర్లండులో తక్కిన ప్రదేశాల్లో మాదిరిగానే 'లిస్‌డూన్ వర్న' లో కూడా దేవాలాయము నడిబొడ్డున ఉంది. ప్రతి రోజూ ఉదయం మొట్ట మొదటి పూజబలి 5గంటలకు ప్రారంభమౌతుంది. అటు తర్వాత 10గంటల వరకూ ప్రతి అరగంటకొక సారిగా పూజ బలులు సాగుతై. ఈ పూజబలి సమయాలన్నిట్లో గుడి, జనం పట్ట కుండా క్రిక్కిరిసి పోతుంది. చాలామంది సత్ప్రసాదానికి పోతారు. మొదటగా జరిగే పూజబలులకు సముద్ర తీరాల్నుంచీ, పర్వతాంచీ, బుజాలమీద కర్రలూ గాలాలూ, తుపాకులూ ధరించి జాలర్లు వేట గాళ్ళు వస్తారు.

తర్వాత జరిగే పూజబలులకు యువతీ యువకులు అత్యుత్సాహాంతో వస్తారు. వాళ్ళ ముఖారవిందాల్లో ఆనందోద్రేకాలు నాట్యమాడై. అక్కడ మైదానంలో ఆ చివర్నించి, ఈచివర వరకూ ఆనందోద్రేకాలే మనకు గోచరిస్తయ్.

'లిస్‌డూన్ వర్న' లో పట్టపగలు ఈ ఆనంద మహాంబుధి వెల్లువికిరావడం మనం గమనించ వచ్చు. కానీ విపత్ మేఘాల కారు చీకట్లల్లో నిరాహారంతో కుమిలిపోయే దౌర్భాగ్యుల హృదయాల్లో కూడా ఈ ఆనంద వాహిన్ని చూడవచ్చు. ఈ ఆనందాంబుధి దైవ విశ్వాసంగల దృష్టికే గోచరిస్తుంది. ఎందుకంటే అటువంటి చోట్లల్లో ఉన్న ఆనందం కేవలం దైవ విశ్వాస జనితమైందే.

మనం 'మోహర్'గుండా ఆమైదానాన్ని దాటి అక్కణ్ణుంచి దక్షిణానికీ తూర్పుకూ పోయే రోడ్లను అనుసరించి పోతే, నిరాశను పారద్రోలిన ఆ శిలాప్రదేశాల్లో మనకు ఆ ఆనందచిహ్నాలు గోచరిస్తయ్. ఆరోడ్లప్రక్కన ఏకాంతంగా ఉన్న ఆ గృహాల్లో, దరిద్రంతో బాధపడిన ఆత్మల ఏకాంతనివాసాన్ని పారద్రోలిన ఆనందం మనకు గోచరిస్తుంది.

దీని యథార్థ్యాన్ని మీకు తెలియచేయడానికి 'క్లేర్'లో రోడ్డుప్రక్కన ఉన్న ఒక చిన్నఇంట్లో నేను కలుసుకొన్న ఒక వృద్ధు రాలి వృత్తాంతం కాస్త చెప్తా.

ఆమె భర్తా, పిల్లలూ గతించిపోయి చాలాసంవత్సరాలైంది. ఐనప్పటికీ సగం తెరచిన కవాటంగుండా ప్రపంచాన్ని పరికిస్తున్న ఆ వృద్ధమాత ముఖంమీద సంతృప్తి రేఖలు స్పష్టంగా గోచరిస్తు న్నయ్. నేనక్కడ నిలబడి ఆమెతో మాట్లాడి ఆమెచరిత్రను తెలు సుకొన్నా.

"ఐతే ఈ ప్రపంచంలో నీవు ఏకాకి జీవిన్నమాట!"
"ఓ హ్హూ! కాదు! కాదు! నాతో భగవంతుడూ, ఆయన వరప్రసా దాన్ని పొందిన మరియమాతా ఉన్నారు." అని ఆమె తక్షణమే బల్ల గుద్ది చెప్పింది

తలుపు కవతలగా ఒక బల్లమీద మరియమాత జపమాల ఉంది దానికవతలగా తెల్లని గోడమీద సెంటుజోసఫ్ చిత్రపటం ఒకటి అలంకరింపబడి ఉంది.

ఇటువంటి పరిస్థితిల్లోనే లిమరిక్కు పర్వతసమీపంలో నేనింతకు ముందు కలుసుకొన్న ఐరిష్‌మాతతో ఈమె రెండోది. అమె ఆ పర్వ తంకింద ఉన్న బావినీటిని బొక్కెనతో మోసుకొని వస్తూ వంకరటిం కర్లగా ఉన్న ఆపర్వతమార్గంలో వృద్ధాప్యంచేతా, శక్తిహీనతచేతా ఎక్కువగా కష్టపడుతున్నది. ఆమెదగ్గర్నుంచి నేను బొక్కెన తీసుకొన్నా. మేము కొండపైకి పోతున్నప్పుడు దేశ నిర్వాసం, మృత్యువుతో కూడుకొన్న ఒక విషాదగాథ ఆమెనాకు చెప్పింది. ఐనప్పటికీ ఆమెలో అత్యద్భుతమైన ఐహిక విరక్తి,సంతృప్తీ నాకు గోచరించినై. ఆమె అన్నివిషయాల్లో భగవంతుడి కృపినిచూచింది.

రోడ్డు పక్కన ఉన్న ఒక చిన్నపూరికొంప దగ్గరికి మేంవ చ్చేటప్పటికి, "అక్కడెవరున్నారు?" అని అడిగా

"నేను, భగవంతుడూ" అని ఆమె సమాధానం చెప్పింది.

"మాట్లాడు కోడానికి నాకా భగవంతు డుంటే, ఏకాంత

నివాసం చేసే.గతేం పట్టింది?" అని ఆమె నేనడిగిన మరోప్రశ్నకు సమాధానంగా చెప్పింది.

జేసునాధుడి పాఠశాలల్లో అటువంటి వ్యక్తులు సర్వవిధాలా తగిన విద్యార్థులు వాళ్ళకు ఇహలోకం బోధించ కలిగిందేమీ లేదు.

ఈ ప్రజల భాషలో, ఐరిష్ ఆనందం తన అభిప్రాయాల్ని సుస్పష్టం చేసుకొనే ఉంది. గేల్ (Gael) భాషజాతీయ శక్తి స్మృతులకు పవిత్ర చిహ్నం. వాళ్ళకా అవకాశం దూరమై పోయినందువల్ల కొన్ని తరాల వరకూ వాళ్ళకు చెప్పరాని నష్టం సంభవించింది.

ఐర్లండుకు మహత్తరమైన సాహిత్యం ఉంది. దోపిడి మూకల వల్ల చాలా నాశనమై పోయినప్పటికీ ఇంకా దాని చిహ్నాలు కొద్దిగా అక్కడక్కడా మిగిలి పోయినై. డార్మెస్టటర్ (Darmester) చెప్పినట్లుగా; యూరపు కెల్టిక్ జాతుల చరిత్రను అధ్యయనం చేయాలంటే ఐరిష్ వ్రాత ప్రతుల్ని పరిశీలించాలి.

"మన దేశంలో అనాది కాలంనుంచీ ఈ నాటి వరకూ ఐర్లండుకు అనుశ్రుతమైన ఒక ప్రత్యేకమైన చరిత్ర కలిగి ఉండే అవకాశం లభించింది. కెల్టుల ప్రాచీన నాగరికతను సంపూర్ణంగా చిత్రించిన సారస్వతాన్ని అది భద్ర పరిచింది. కెల్టుల ప్రపంచాన్ని సర్వ సులభం చేసే సారస్వతం "ఐర్లండుది!"

ప్రజల అభి ప్రాయాల్నీ, ఆదర్శాల్నీ సుస్పష్టం చేసుకొనే ప్రముఖ సాధనం జాతీయ భాష. మరే ఇతర భాషా ఆ పనినినెరవేర్చ లేదు. అన్య భాషను మాట్లాడాలంటే చాలా అనర్థాలున్నయ్. ఆ భాషను పలకడంలో, ఆ పలుకు బడిని అర్థం చేసుకోవడంలో తనకు చాలా లోపాలున్నయ్, అని తెలుసుకొన్న వ్యక్తి తన్నుతాను చాలా న్యూనంగా భావించుకోక తప్పదు.

ఇంగ్లీషులోనే మాట్లాడాలని నిర్బంధింప బడ్డప్పుడు గాల్వే (Galway) ఇంగ్లీషు పార్లమెంటు సభ్యుడికి ఈ విధంగా సమాధానం చెప్పడానికి కారణ మిదే. "మేం ఇంగ్లీషులోనే మాట్లాడ్తే నీవు మా

కంటే తెలివిగల వాడివిగా ఉంటావ్. ఐరిష్ భాషలో మాట్లాడ్తే కథ అట్లా ఉండదు." అని చెప్పాడు.

ఐర్లండు భాషలూ, ఆ దర్శాలూ గాఢమైన మత సంబంధమై నందు వల్లనే వీటితో కూడుకొన్న భాషకు పెద్ద దెబ్బ తగిలింది. జాతీయ భావానికే కాకుండా జాతీయ మతానికూడ గట్టి దెబ్బ తగిలింది.

ఐరిష్ వ్యక్తి మాదిరిగా నిర్దుష్టంగా, వేగంగా మాట్లాడగల వ్యక్తి మరెవ డున్నాడు?

'ఐరిష్‌బుల్' అనే మారు పేరు వాళ్ళ సంభాషణా చమత్కారానికి ఛలోక్తులకూ, వ్యంగ్యానికి మంచి ఉదాహరణ.

1834 సంవవత్సరములో నిర్బంధ చట్టమున్నప్పటికీ, ఐరిష్ భాషను తమ మాత్రు భాషగా మాట్లాడే వాళ్ళు 3,000,000 మంది ఉన్నారు. కానీ కాటకం స్ఫోటకం, దేశనిర్వాసం, చట్టాలూ ఆభాషను నిరోధించినై దక్షిణ దేశంలో, తూర్పు దేశంలో తప్ప ఐర్లండంతటా ఆ భాషాస్థానంలో ఇంగ్లీషు వచ్చి చేరింది.

అమూల్యమైన వ్రాతప్రతులు కొన్ని వేలు దగ్ధం చేయ బడ్డయ్. 1893లో గెయ్‌లిక్ సంస్కారాభి లాషులు బైలుదేరి బూడిదపాలై పోయిన సారస్వతాన్ని పునరుద్ధరించేంతవరకూ, తాము ఏం పోగొట్టు కున్నారో కూడా తెలియని అమాయకులు ఐర్లండులో ఉన్నారు. మళ్ళీ ఆనందంతో ఐరిష్ వాళ్ళు కతోలిక్కు మతానికి సంబంధించిన 'గెయిల్' భాషను మాట్లాడే సుదినాలు వచ్చే సూచల్ను చాలా కన పడ్తున్నయ్.

ఐరిష్ భాషతో సరిసమానంగా ఐరిష్ సంగీతం కూడా పెంపొం దుతున్నది. మహా కవుల కావ్య గీతికలు కంఠస్థం చేసి ఐరిష్ వాళ్ళ సభల్లో, సమావేశాల్లో చదువు తున్నారు.

"ఐర్లండులో మాదిరిగా కవిత్వం అభివృద్ధిచెంది ఆదరింప బడి నట్లుగా, ఇంకే దేశంలో అంత అభివృద్ధిచెంది అంతగా ఆదరింపబడలే దనడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. 16 రకాలైన కావ్యా

లున్నాయ్. ప్రతి తరగతి కావ్యానికీ ప్రత్యేకమైన ఛందస్సూ, లయా ఉంది. అటువంటి ప్రత్యేకమైన ఛందస్సూ, లయాతో కూడుకొన్న కావ్యజాతులు మూడు వందలకు పైగా ఉన్నాయ్." అని డోగ్లస్ హైడ్ అన్నాడు.

అటువంటి వాళ్ళకు గానరహితమైన జీవితం దుర్భరం. ఏ జాతిలోకూడా తీసుకురాలేని సంతతి ఉన్నత స్థాయికి వాళ్ళు సంగీతాన్ని తీసుకు వచ్చారు. ఐర్లండుకు ఒక్కదానికే జాతీయ చిహ్నంగా ప్రత్యేకమైన వాద్యపరికరం ఒకటుంది.

ఐర్లండు సంగీతాన్ని గురించి డాక్టర్ 'ఎర్నెస్టు వాల్కర్' ఈ విధంగా అన్నాడు.

"ఇప్పుడున్న వాటిలో చాలా అందమైంది ఐరిష్ జానపద సంగీతం అన్న విషయాన్ని, అనుమానంతో ప్రశ్నించే గాయకులు చాలా కొద్దిమంది ఉన్నారు ఉయ్యాలో మొదలుకొని యుద్ధభూమి వరకూ, ఆ సంగీతం మానవుడి ఉత్సాహాన్ని అద్భుతంగా తోస్తుంది సంగీత మంటే, పదహారు శ్రుతుల్తో కూడుకొన్నది మాత్రమే అన్నట్లయితే, ఐర్లండులో అటువంటి సంగీతాన్ని సృష్టించిన మహామహులనేకు లున్నారనక తప్పదు ఎందుకంటే, ప్రథమ దశలోనే ఐరిష్ జానపద సంగీతం మనోజ్ఞంగా విరాజిల్లింది. కేవలం శ్రవణ సుఖం కావాలంటే 'మోజర్ట్' 'షూ్యబర్ట్' రచల్ను చాలు. ఐరిష్ సంగీత శాస్త్రజ్ఞులు సంగీత కలలో అపురూపమైన 'త్రిపది' ని సృష్టించారు."

'కాంబ్రెన్సిస్' వాళ్ళ వాద్య నైపుణ్యాన్ని ప్రశంసిస్తూ ఇట్లా అన్నాడు.

"వాద్య పరికరాల్లో ఈ ప్రజలకున్న శ్రద్ధాసక్తులు శ్లాఘనీయాలు! వాటియందు వాళ్ళకున్న నిపుణత్వం, ఇతర్ల కెవరికీ లేదు. వాళ్ళు స్వరకల్పన నెమ్మదిగా చేయరు. వాళ్ళు త్వరితగతిని స్వరకల్పన చేస్తారు. వ్రేళ్ళు అంత వేగంతో తంత్రులు మీటుతుంటే, అప

స్వరాలు పలకకుండా ఆ వాద్య విశేషం ఉండడం చాలా అపురూపమైన విషయం."

ఎదుర్లేని సంగీత కళతో ఐర్లండు ఆనందంలో మునిగి తేలింది. జేసునాథుడి స్తోత్రగీతాల్తో మనోహరంగా ఆడి, పాడి మొత్తం ఐరిష్ జాతి ప్రపంచాన్ని మధుర వీణా నిస్వనంవలె విముగ్ధం చేసి వేసింది.

ప్రతి వ్యక్తీ విశ్రాంతిగా ఉండి, నిర్దుష్టమైన భావనలతో ఉన్నప్పుడు అట్లాగే మనోహరగానం చేస్తాడు. కనకాన్వేషణానురాగం గల ప్రతి వ్యక్తీ ఎట్టి కష్ట నష్టాలకైనా వెనుదీయకుండా సంతోషంతో ముందుకు సాగిపోతాడు. కనకం మీద ఉన్న అపేక్షా, దాన్ని సంపాదిద్దామనుకొనే భావనా అతణ్ణి ముందుకు నెట్టుకపోతుంది. ధనవంతుణ్ణి కావాలనే దృఢ కాంక్షతో అతను మృత్యువునుకూడా లెక్క చేయకుండా ముందుకు నెట్టుకపోతాడు.

ధనం ఉంటేనే భౌతిక సుఖాలన్నీ అనుభవించడానికి తగిన అవకాశం లభిస్తుంది. కాబట్టి, ఆ ధనం కోసమని యెటువంటి క్లిష్ట పరిస్థితుల్ని కూడా లెక్క చేయకుండా, ఆఖరికి మృత్యువునకైనా తెగించి పోరాడే వ్యక్తిని చూచి జగత్తు హర్షిస్తుంది.

ఐరిష్ విషయం కూడా అంతే ఇహలోక సంపద కోసం కాకుండా, వాళ్లు పరలోక సంపద కోసం కష్టాలన్నింటినీ ఎదుర్కొని తమకు లభించబోయే అదృష్టం కోసమని దృఢ నిశ్చయంతో పురోగమిస్తున్నారు.

వాళ్లు మోక్ష పతాక ఛాయల్లో జేసుప్రభువు బోధించిన అష్ట భాగ్యాలు మార్గదర్శక స్తంభాలుగా స్వీకరించి, దృఢ విశ్వాసంతో తదనుగుణంగా జీవిత ప్రయాణం చేస్తున్నారు. ఐహిక భోగ పరాయణులకు అగమ్య గోచరాలైన జీవన దరిద్రతా, బాధల్లోని రహస్యం, వాళ్ళకు సుగమాలు. వాళ్ళ ఆనందం సర్వ కష్టాల్ని హరించింది. తుచ్ఛ ఐహిక భోగాల్నుంచి హృదయ సువర్ణ భండాగారాన్ని పవిత్రం చేయడానికే కష్టాలు అన్న సంగతి వాళ్లు గుర్తించారు.

ఐరిష్ వాళ్ళకు ఉన్న జీవిత దృక్పథాన్ని గూర్చి మాట్లాడుతూ ఇంగ్లీషు ప్రొటెస్టాంటు రచయిత 'హెరాల్డ్' బెగ్బై (Herold Begbie) ఇట్లా చెప్పాడు.

"నిరాడంబరముగా జీవిస్తూ, హృదయ పూర్వకమైన ప్రేమతో సర్వమానవ సోదరత్వాన్నాకాంక్షిస్తూ, తమ కుటుంబాల్ని ప్రేమతోను, బాధ్యతతోను పోషిస్తూ, కష్టపడి బ్రతికే ఐరిష్ వాళ్ళే, మనం మన ఇంగ్లండు దేశములోని గ్రామాదులలో ఇంత కాలంనుంచీ చమత్కృతిని పెంపొందించలేక గ్రుడ్డి మిటకరించుకొని కూర్చున్న సమయంలో, చమత్కారాన్నభివృద్ధిచేసి, జీవిత సమస్యను చక్కగా పరిష్కరించారనిపిస్తున్నది. దక్షిణ ఐర్లండులో ప్రతి బాటసారీ అనుభవించే ఆ ఆనందమయ జీవితమే ఐరిష్ వాళ్ళ వ్యక్తిత్వం. నాచిరకాల పరిశోధన్లవల్ల నేను తేల్చి చెప్పే విషయమేమంటే ఐరిష్ వాళ్ళకున్న ఈ వ్యక్తిత్వం కథోలిక్కు సంస్కృతి వల్ల ఏర్పడ్డది.

తిరుసభ సంస్కృతివల్ల ఏర్పడ్డ ఆనందమయ జీవితానికీ, విశాల దృక్పథానికీ ఐర్లండు ప్రబల తార్కాణమని ప్రపంచమంతా గ్రహించాలి.

దివ్యసత్ప్రసాదములో జేసునాథుని నివాసం ఐరిష్ జాతినంతా ఆనంద మహాంబుధిలో ముంచెత్తింది. ఆ జాతి మొత్తం ఆయన చుట్టూ మోకరించింది. అగ్ని పరీక్షలూ, నానావిధ హింసలూ వాళ్ళు ఈ సంతృప్తితోనే అనుభవించారు. పైగా అవి వాళ్ళను మరింతగా బలపర్చినై. "దరిద్రులూ, అణగారి పోయిన వాళ్ళూ, బాధామయ జీవులూ, దేవుడి ఆశీర్వాదం పొందిన వాళ్ళు" అని జేసునాథుడు చెప్పినందువల్ల వాళ్ళా బాధలన్నీ ఆయన కోసం సహించారు. దేవ మందసములో దివ్య సత్ప్రసాదములోనున్న జేసు సాక్షాత్కారం ఐర్లండుకు అచంచలమైన విశ్వాసాన్నీ బలాన్నీ చేకూర్చింది. దాని వల్లనే ఆమె ఇతర జాతుల జీవితం కన్నా మహత్తరమైన జీవితాన్ని పొంద కలిగింది. ఐర్లండు వినయ విధేయతలు కలిగి జేసునాథుని సమక్షంలో అన్ని సమయాల్లో, అన్ని పరిస్థితుల్లో బాగా ఆనందించింది "నిన్ను గూర్చే నేను నిరంతరం గానం చేస్తా నేను అనేకులకు ఆశ్చర్యంగా కనిపిస్తున్నా. నీవు ఆర్తత్రాణ పరా

యుణుడవు. నేను నిన్నుగూర్చి పాడినప్పుడల్లా నాహృదయం ఆనందాం బుధిలో ఓలలాడి పోతుంది." ఇవి వాళ్ళు జేసునాథుడికి చెల్లించే స్తోత్రాలు.

ఐహిక దుఃఖాలన్నీ మానవుడు పవిత్రుడు కావడానికి నిర్దేశింప బడ్డవే అని వాళ్ళ దృష్టి. వాళ్ళు కష్టాలన్నీ అనుభ వించారు. అవి జీవితములో ఒక భాగమని వాళ్ళకు తెలుసు.

భూలోకంలో జేసునాథుడు ధరించిన ముళ్ళ కిరీటం, కాంతి వలయమని వాళ్ళకు తెలుసు. జేసునాథుడు స్లీవ వేయబడి చనిపోయే టప్పుడు దాన్ని కాంతి వలయంగానే ప్రదర్శించాడు కూడా.

"స్లీవ మానవుడికి బలం! సంతోష ప్రదమైంది స్లీవ! మోక్ష సామ్రాజ్యాన్ని చేరడానికి స్లీవ ముఖ్య సాధనం!" అని, ఎ' కెంపిస్ (Akempis) భోధించిన సూక్తిని ఐర్లండు బాగా అర్థంచేసుకొన్నది.

జీవిత సారాన్ని అమృత మయంగా చేసే ఐరిష్ వాళ్ళ ఆనం దానికి మూల కారణం కతోలిక్కు విశ్వాసమే!



# 15 వ అధ్యాయం

# ఐర్లండు ఘన విజయం

అన్ని జాతుల ఘన విజయ జీవితాల్ని చరిత్ర కారులు బ్రహ్మాండంగా అభివర్ణించారు. నిజంగా ఆలోచించి చూస్తే అవన్నీ ఘన విజయాలు కావు

శతాబ్దాల చరిత్ర విషయాన్నంతటినీ సక్రమంగా నిరూపిస్తున్నది. వాణిజ్యాధిక్యత వల్లగానీ, రాజ్య విస్తీర్ణతవల్లగానీ ఎక్కువ మంది ప్రజల్ని జయించడం వల్లగానీ జాతీయ విజయం లభించదని అది ఋజువు చేస్తున్నది జాతీయ హృదయం క్రమేపీ క్షీణించి పోతుండగా కేవలం ఒక్క తరం వాళ్ళ గొప్పదనానికే మురిసి పోయే సంకుచిత దృక్పథం గల వాళ్ళకిది విజయంగానే గోచరించవచ్చు. వ్యక్తికి మాదిరిగానే జాతి కూడా భౌతిక సౌఖ్యాల్ని పొందకల్గినంత మాత్రంచేత గొప్పది కాజాలదు. సద్భావంవల్లా, సత్ప్రవర్తనవల్లా ఒక జాతికి గొప్పదనం వస్తుంది

ఐహికంగా పెద్ద పేరు ప్రతిష్టలు సంపాదించుకొని నామ రూపాలు కూడా లేకుండా కాలగర్భంలో విలీనమై పోయిన అనేక జాతుల విచిత్ర చరిత్రతో కూడిన మాయలోకమిది. మహా పట్టణా లంతర్ధానమై పోయి పాలరాతి నేలమీద వెంపొందిన 'యుకటన్' (Yucatan) మహారణ్య సీమల్లో పయనించే బాటసారికి ఈ మాయ గోచరిస్తుంది ఆఫ్రికా అనాగరిక జాతుల్లో, ఆసియా పర్వత ప్రదేశాల్లో, ఈ మాయ అతణ్ణి చకితుణ్ణి చేస్తుంది.

అధికారం కోసం, విజయాల కోసం తహ తహలాడిన జాతులే సర్వనాశనమై పోయిన వన్న పరమ సత్యాన్ని ప్రపంచ చరిత్ర మాటి మాటికి ఉద్ఘోషిస్తున్నది

ఆది మానవ చరిత్ర పుటల్ని మనం తిరగేస్తూంటే ఆశ్చర్యంగా గమనించే విషయమేమంటే, ఏజాతి ఇతర జాతుల మీదికి దండ యాత్ర చేసిందో ఆ జాతే సహజంగా సర్వనాశనమై పోతుందన్న పరమ సత్యం. ఉన్నతాదర్శాల ద్వారా ఘనవిజయాన్ని పొందిన ఐర్లె

ఒక సంఘటన్ని మనం ఆ చరిత్రలో కనుగొంటాం. సృష్టి మొదలు కోని తరతరాల వరకూ బ్రహ్మాండమైన చరిత్ర కలిగిన జూదా జాతిని మనం గుర్తిస్తాం. భగవంతుడిచే వరింప బడిన ఆ జూదా ప్రజలు బల హీనులైనప్పటికీ, నిరంకుశత్వంతో క్రుంగి కూలారి పోయినప్పటికీ, దృఢమైన విశ్వాసం ద్వారా వాళ్ళు వాటన్నిటినీ జయించారు.

దుర్మార్గమైన ఈజిప్టు నాగరికత వాళ్ళను అణచి వేయడానికి శతధా ప్రయత్నించింది. ఇసుక ఎడార్లల్లో సగం కూరుకు పోయిన శిథిల పాషాణలను మాత్రం మిగిల్చి, ఆ నాగరికత నామ రూపాలు లేకుండా నాశనమై పోయింది. దేవుడి అనుగ్రహం సంపాదించిన ప్రజలే అభివృద్ధి చెందారు.

పశుబలం కల్గిన అస్సీరియా (Assyria) అధికార వ్యామోహి తమై వాళ్ళను సర్వ నాశనం చేయడానికి కత్తిగట్టి పైకి దూకింది. అస్త మించ బోయే సూర్యుడు ఆ వెండి బల్లాలపై తళతళా ప్రకాశించాడు. బంగారపు శిరస్త్రాణాలపై తన కాంతి పుంజాల్ని విరజిమ్మాడు. సైని కుల భయంకరాట్టహాసాల్తో భూమ్యాకాశాలు దద్దరిల్లినై. గుఱ్ఱాల గిట్టల చప్పుడుకు భూమి కంపించింది. ఉదయ భానుడు ప్రశాంతమైన ప్రదేశంలో సైన్యంపై తన అరుణారుణ కాంతుల్ని ప్రసరించాడు. బల్లెం, శిరస్త్రాణం, రౌతూ, గుఱ్ఱం అన్నీ నేలపాలై పోయినై భగవంతుడు తన భక్తుల్ని సంరక్షించ డానికి ముందుకు వచ్చాడు. ఆ పశు బలంతో కూడిన విరోధి మట్టిపాలై పోయాడు.

మహా గర్వ భూయిష్టమైన బాబిలోన్ తన హస్తాన్ని చాచి జూదుల కంఠాలకు ఉరి బిగించడానికి ప్రయత్నించింది. భూభాగమంతా విరోధి సైన్య ప్రళయార్భటుల్లో ప్రతిధ్వనించి పోయింది. కానీ భగవం తుడు విశ్వాస పాత్రులైన జూదుల్ని భయపడవద్దు అని అభయ హస్త మిచ్చి "మీ మీదకు దండెత్తిన వాళ్ళ గృహాలల్లో గుడ్లగూబలు కాపురాలు చేస్తయ్. వాళ్ళ రాజ్యం క్రూరమృగ సంకీర్ణ మౌతుంది." అని ఊరడించాడు.

గ్రీసు పరాక్రమంలో తక్కిన వాళ్ళకు మించి పోయింది వాళ్ళం దర్లో గొప్ప నాగరికత కల్గిన గ్రీసు విజృంభించింది. గ్రీసును గురించి

వేద గ్రంథాలు ఇట్లా చెప్పినై. "అది భూమండలములోని రాజులం దర్నీ హతమార్చింది అది భూమండలం చిట్ట చివరిదాకా పోయి జాతు లన్నింటినీ విధ్వంసం చేసింది. మాక్టోనియన్ సిపాయి దెబ్బకు భూమాత నోరు కట్టుపడి పోయింది." గ్రీసు అసంఖ్యాకులైన గొప్ప సైన్యాల్తో వీరోత్తముడైన మకబేయుసుని నాయకత్వాన నున్న జూదుల పైకి దండెత్తింది. అప్పుడు మకబేయుస్ కొద్దిపాటి సైన్యంతో గ్రీక్ సైన్యాన్ని ఎదుర్కొన సంసిద్ధుడైనాడు. రణరంగంలో దూకుటకు ముందు, "ఎక్కువ మందైనా, తక్కువమందైనా భగవంతుడి దృష్టిలో భేదం లేదు. ఎక్కువ మంది ఉన్నందు వల్ల కాదు విజయం లభించేది. జయాన్ని పొందే బలం స్వర్గంనుంచి సంక్రమించాలి. భగవంతుడే ఈ రాక్షసుల్ని సర్వ నాశనంచేస్తాడు." అని జూదుల నాయకుడు నిర్భ యంగా పలికాడు. నిజంగా జరిగింది కూడా అంతే. ఒక మహా తరం గం విజృంభించి మహోద్ధృతంగా పైకిదూకి, మహా బలిష్టమైన తీరా న్నెదిరించి, నడుము విరిగి చెల్లా చెదరై పరాభూతమై నట్లుగా; భగ వంతుడి ప్రేమ కర్హులైనవాళ్ళపైకి ఇహలోకశక్తి విజృంభించి పరాభూ తమై ఘోర పరాజయాన్ని పొందింది.

"భయపడవద్దు. వాడి కున్నది కండ పుష్టి మాత్రమే: మన కున్నది దైవశక్తి! భగవంతుడు మన పక్షం పోరాడ్తాడు." అని, అస్సీ రియన్ల భయంకర దండ యాత్రకు గురైన జూదులను చూచి పల్కిన వాళ్ళ ప్రవక్త వచనాల్ని విశ్వసించి, వారు చలించని ధైర్యంతో శత్రు సమూహా న్నెదుర్కొన్నారు.

జూదుల రాజ్యం అంతరించి పోయిన కొన్ని శతాబ్దాలకు, ఐరిష్ రాజైన బ్రియన్ బోరు (Brian Boru) కూడా దైవ విశ్వా సంతో అట్లాగే పల్కాడు. భయంకర శత్రువులైన డేనిష్ వాళ్ళను గూర్చిన భయాన్ని ప్రజలు వెలిబుచ్చినపుడు బ్రియన్ ఇల్లాగ వార్లను ప్రశ్నిస్తున్నాడు. ఆ రాజు తన మాటల్లో "అది భగవ దభీష్టమైతే" అని ఏమన్నా అన్నాడా, లేదా. ఆయన దేవునిమీద ఆధారపడకుంటే, మనము భయపడ నవసరం లేదు.

దైవముపై గల ఈ సమ్యక ప్రవ_త్తి, ప్రవృత్తియే జాతీయ విజయంలో, నిజమైన గొప్పదనంలో గల పెద్ద రహస్యం. సృష్టికర్త నియమాల్లో జాతిని సంరక్షించి, దానికి ఘన విజయాన్ని చేకూర్చి, గమ్యస్థానాన్ని పొందింప గల ఉత్సాహ శక్తి ఇది.

ఈ శక్తి జూదులు జీవాధారమని గ్రహించి కాల ప్రవాహంలో పురోగమించారు. వాళ్ళ శత్రువులు మాత్రం భౌతిక వాదాంధకారంలో పడి దారి తప్పి నశించారు. కానీ, జూదులు తమ గమ్యస్థానాన్ని దృష్టిలో పెట్టుకొని కూడా చిట్టచివరకి దాన్ని సురక్షితంగా చేరగల మార్గాన్ని వదలి, తమకు రావలసిన ఘన విజయాల్ని చేతులారా త్రోసివుచ్చారు.

వాళ్ళకు విమోచన ప్రదాత అవతరిస్తాడన్న విషయం బాగా తెలుసు. వాళ్ళు తాము నెరవేర్చ వలసిన ప్రతిజ్ఞల్ని నెరవేర్చకుండా కాలం గడిపారు. కాల ప్రభావం చేత వాళ్ళు విమోహితులై ప్రపంచపు మాయల్లో చిక్కుకొనిపోయి అంధులైనారు. సంరక్షకుడవతరించి వాళ్ళ మధ్యలోనే ఉన్నప్పటికీ చిట్టచివరకి వాళ్ళాయన్ను చూడలేక పోయారు. వాళ్ళా అంధత్వంలో పడి ఎంతగా అధః పతనమై పోయారంటే, ప్రతి విషయాన్ని ఐహిక దృష్టితోనే పోల్చి చూడ్డం మొదలు పెట్టారు. వాళ్ళను ప్రపంచ విజేతలుగా చేయగల ఒక మహా శక్తిమంతుడైన నాయకుని కోసం ఎంతగానో తహతహలాడారు. దారిద్ర్యంలో కూడా శక్తిమంతుడూ, అసహాయ స్థితిలో కూడా బలిష్టుడూ, స్లీవ వేయబడి కూడా ప్రపంచ విజేత ఐన జేసునాథుణ్ణి వాళ్ళు గుర్తించ లేక పోయారు.

ఆ దైవా విష్కరణమే ఐర్లండుకు సంక్రమించింది. కానీ ఆమె తప్పటడుగు వేయలేదు. ప్రపంచరక్షకుడు తనదగ్గరికి వచ్చినప్పుడు ఆమె ఆయన్ని గుర్తించి, తదాదిగా ఆయనకు విశ్వాస పాత్రురాలై ఉంది. అందుకనే ఆమెచరిత్ర అంత ఘనవిజయాన్ని సంపాదించ గలిగింది.

ఆమె జీవనాళాల్లో 'పెన్టెకాస్ట్' (Pentecost) శక్తి ప్రవహిస్తున్నది. ఈ శక్తి మూలకానే ఐర్లండు ఘనవిజయాన్ని సాధించింది.

దుఃఖవిషయంలో, అనుభవాల్లో అది తలనెరిసిందైనా, ఇందువల్లనే జీవితోత్సాహంలో, పరలోక కాంతితో అది నిత్యయౌవనంతో ఉంది. కథోలిక్కు ఆదర్శాలల్లో ఆమె కున్న కృతజ్ఞత ఆమె ఘనవిజయానికి కారణం. తరతరాలుగా ఈ కథోలిక్కు ఆదర్శాలకు అంటిపెట్టుకోని, వాటినే అభివృద్ధి చేయడానికి ప్రయత్నిస్తున్నదని దానిచరిత్ర వల్ల మనకు రుజువవుతున్నది.

ఆమె సంతానం అన్ని దేశాల్లో మంచి అధికారంలో ఉన్నారనీ, జాతి మంత్రాలోచన సభల్లో ఉన్నతోద్యోగాలు స్వీకరించారనీ, పరిశ్రమల్లో వాణిజ్యంలో వాళ్ళు మహారాజాధిరాజులనీ, యుద్ధభూమిలో ఆరితేరిన యోధులనీ ఐర్లండు గొప్పదనాన్ని ప్రశంసిస్తూ అనేకులు పేర్కొంటారు. వాళ్ళావిధంగా చేయడం సరైందే. ఎందుకంటే, తక్కినజాతుల్లో ఐర్లండుసంతానంయొక్క మహత్తరమైన చరిత్ర ఆమెకు లభ్యమైన గొప్పదనాల్లో ఒకటి. ఫ్రాన్సు సైనికాధికారులు, స్పెయిన్ అమాత్యవర్గం, ఐరోపా ఖండంలోని రాయబారులూ ఎక్కువగా పాశ్చాత్య ప్రపంచ చరిత్రను రచించారు.

ఆధునిక ప్రపంచ వ్యవస్థలో కూడా వాళ్ళు చాలా ప్రసిద్ధి పొందారు. యునైటెడ్ స్టేట్సు అధ్యక్షుల్లో దాదాపు సగం మందికి పైగా కెల్టు రక్తస్పర్శగల వాళ్ళే. అమెరికా స్వాతంత్ర్య పోరాటంలో ఐరిష్ వాళ్ళు ముందంజ వేసారు.

"స్వాతంత్ర్య సమరంలో ఐరిష్ కథోలిక్కులవల్ల మేం పొందిన సహాయమే మా అంతిమ విజయానికి చాలా దోహదం కల్గించింది. స్వాతంత్ర్య పోరాటంలో తక్కిన విదేశీయులు మాకు సహాయార్థంగా పంపిన ప్రతి వ్యక్తికీ వందమంది చొప్పున ఐర్లండు తన జనాన్ని పంపింది. ఐర్లండుకు శాశ్వతమైన కృతజ్ఞత చూపవలసిన విధి అమెరికాకు ఉంది." అని వాషింగ్టన్ దత్తపుత్రుడయిన కస్టిస్ (Custis) చెప్పాడు.

"జీవితంలోని వివిధ రంగాల్లో ఐరిష్‌వాళ్ళు పాల్గొన్నారు. రాజకీయజ్ఞులుగా, సైనికులుగా, ఉపాధ్యాయులుగా, ఉన్నతోద్యోగు

లుగా, న్యాయవాదులుగా, వ్యాపారస్తులుగా వాళ్ళు ప్రసిద్ధి పొందారు. దేశ సారస్వత కళాభివృద్ధులకు వాళ్ళు నిర్వహించవలసిన బాధ్యతను నిర్వహిస్తున్నారు." అని అమెరికా ప్రెసిడెంటు రూజువెల్టు, అమెరికాలో ఐరిష్‌వాళ్ళ ప్రభావాన్ని గూర్చి ప్రశంసించాడు.

ఆమె సంతానం భూలోకంలో గొప్ప ప్రజాస్వామికాన్ని నెలగొల్పినందు కామె ఎంతగానో గర్విస్తున్నది. ఈ ఐహిక విజయాలన్నింటికీ ముఖ్యకారణం అచంచలమైన దైవ విశ్వాసశక్తి, అన్న సత్యాని కామె మరింతగా గర్విస్తున్నది. ఐహిక విజయాలు ఐరిష్ ప్రజల్ని భగవంతుడి నుంచి దూరం చేయలేదు.

"ఐరిష్ వాళ్ళూ, వాళ్ళ వంశీయులూ ఏ విధంగా చూచినా చాలా పవిత్రులు. చాలా మంచివాళ్ళు శ్రేష్టులు. అమెరికా ప్రజలు బాగా విశ్వసించ దగ్గవాళ్ళు." అని, ప్రఖ్యాత అమెరికా దేశస్తుడైన డాక్టర్ ఒ. ఎ. బ్రౌన్‌సన్ వాళ్ళను గొప్పగా కీర్తించాడు.

వాళ్ళ ఐహిక విజయాల్ని గూర్చి గర్వించడం గానీ, వాళ్ళ ప్రగతిని ఆ విజయాల్తో కొలిచి చూడ్డం గానీ చేస్తే, జాతుల్ని నాశనం చేసిన ఆ తప్పిదాన్నే పునశ్చరణ చేస్తున్నా మన్నమాట. రోము ఈ ఐహిక విజయాన్ని గొప్పగా భావించింది. ఆమె సంతానం పశుప్రాయులై పోయేంత అధః పతనం చెందింది చేజిక్కిన వాళ్ళను బంధించి వీధుల్లోగుండా ఒక పెద్ద గుంపుగా నడిపించుకుపోతూ వాళ్ళను వధ్యస్థానానికి చేర్చడం, పట్టుబడ్డ రాజుల్ని తమ రథాలముందు నడిపిస్తూ వాళ్ళను తిండీ తిప్పలూ లేకుండా బాధించడం మొదలైన విషయాలే ఘన విజయానికి చిహ్నాలు అనే దుష్టాభిప్రాయానికి దిగజారేంతగా ఆమె పతనావస్థకు వచ్చింది.

కాబట్టి, మనం ఐర్లండుయొక్క భౌతిక విజయాన్ని విజయంగా పరిగణించరాదు. అట్లా పరిగణించడ మంటే, ప్రజల యదార్థ జీవితాన్ని అవగాహన చేసుకో కుండా, తమ గొప్పదనాన్ని కేవలం దండయాత్రల మూలకంగానే స్థాపించుకొన్న ప్రాచీన రోమూ, తదితర

జాతులు చేసిన తప్పిదాన్నే మనమూ చేస్తున్నా మన్నమాట. ఐర్లండు సంతానం సంపాదించి నంత అధికారం, ధనం, కీర్తి ప్రతిష్టలు కతోలికు విశ్వాసాన్ని కోల్పోయివుంటే అవన్నీ బూడిదలో పోసిన ఆహుతి చందమౌతై. విశ్వాసాణ్ణి వదలడమంటే భగవంతుణ్ణి నిరాకరించి, ధనపిశాచాన్ని కౌగలించుకోవడ మన్నమాట. ఐర్లండు యీ పరమ సత్యాన్ని గుర్తించింది. కాబట్టే తరగని స్థైర్యంతో నిలబడ గలిగింది. ఆమె దైవ విశ్వాసాన్ని హృదయ కుహరంలో నిక్షేపించి కాపాడు కొంది. దైవారాధనకు అర్హమైన వానిని సమకూర్చడం వాళ్ళు ప్రధాన కర్తవ్యంగా భావించారు.

ఐర్లండు ఐహికంగా అంత అభివృద్ధి చెందుతూ, అంతగా దేశ భక్తి వెదజల్లుతూ ఘనవిజయాన్ని సాధించిందంటే, అది విశ్వాస కాంతిలో పయనించి, తన విజయాల్ని దైవ విశ్వాసంతో స్వీకరించింది. 'అమెరికాలో ఐరిష్ వాళ్ళు' అన్న గ్రంథంలో 'మాగైర్' (Maguire) యీ విషయాన్ని యింకా సుస్పష్టంగా వివరించాడు.

"ఐర్లండు, అమెరికా చర్చికి యేం సహాయం చేసిందో ప్రతి మేత్రాణులూ, ప్రతి గురువూ, సులభంగా చెప్తాడు. అమెరికా ఖండం మొత్తంలో ఐరిష్ గురువులేని చర్చి గానీ, ఐరిష్ వుపాధ్యాయుడు లేని పాఠశాలగానీ, ఆ విజ్ఞానిలేని సారస్వత పరిషత్తుగానీ, ఆ మత జిజ్ఞాసి లేని మత సంస్థగానీ, ఆదాన శీలుడు లేని ధర్మసంస్థ గానీ, ఆవు దారుతు. లేని కాందిశీక శిబిరం గానీ మచ్చునకైనా ఒకటీ కనపడదు తిరుసభ ఐర్లండును 'ఇన్‌సులా సాన్‌క్తోరుమ్' (అర్చ్య శిష్యుల దీవి) అన్న బిరుదుతో కృతజ్ఞతా సూచకంగా గౌరవించింది. ఇంగ్లీషు భాష తెలిసిన వాళ్ళ కోసమై తర్ఫీదునిచ్చే గురు పాఠశాలల్లో, పుట్టుక చేతగాక పోయినా, రక్త సంబంధంగా నైనా వున్న ఐరీషీయులే యెక్కువగా యుంటారు."

నలభై సంవత్సరాల క్రితం ఒక అమెరికన్ రచయిత యిట్లు అన్నాడు.

"ఐరిష్ వాళ్ళకి మతమంటే యేమిటో మనకు తెలియ జేయ డానికి యీ విశాల ఖండం సాక్షీభూతంగా వుంది. అత్యద్భుతంగా ఖండ

మంతటా ఐరిషీయుల కృషిఫలితంగా వెలసిన కళాశాలల్నీ, పాఠశాలల్నీ సారస్వత పరిషత్తుల్నీ, వైద్యశాలల్నీ, ధర్మశాలల్నీ లెక్కించండి! అటువంటి స్వార్థరహితమైన సేవచేయ ప్రేరేపించిన దైవ విశ్వాసానికన్నా, హృదయాకర్షమైన దేదైనా మరొకటి ఉంటే చెప్పండి? కేవలం మతమన్న పేరు నిరర్థకమైంది. మనం ఎట్లా ఉండాలో, ఏం చేయాలో తెలియజేసి ఆ మార్గంలో నడిపించేటట్లు చేయకలిగిన నాడే మతానికి పవిత్రత, ఉదాత్తతా ఏర్పడుతుంది. ఐరిష్ వాళ్ళను ఇంత ఉన్నతస్థాయికి తీసుకొని వచ్చింది మతమే. మతం వాళ్ళల్లో సర్వ మానవ సోదరభావాన్ని పెంపొందించింది. మతమే వాళ్ళని అభ్యుదయ మార్గానికి తీసుకువచ్చింది. ధర్మబద్ధమైన అధికారాన్ని బలపరచే శక్తిని ఇచ్చింది మతమే. మతమే వాళ్ళల్లో ధర్మరహితమైన పరిస్థితుల్ని ఎదుర్కొనే ధైర్యాన్ని ప్రసాదించింది. అటువంటి సద్గుణపూర్ణులైన పౌరులు లేకుండా ఏ దేశమూ ముందంజ వేయలేదు. అటువంటి వాళ్ళను కల్గి ఉండటంవల్ల కలిగే సౌఖ్యాల్ని ఏ రాజ్యమూ కోల్పోలేదు."

ఐర్లండు అమెరికాకు ఎటువంటి సహాయం చేసిందో, అటువంటి సహాయమే సర్వప్రపంచానికీ నేడది చేస్తున్నది. ఇంగ్లీషు మాట్లాడే జాతులన్నింటిలో కతోలిక్కు విశ్వాసాన్ని పరివ్యాప్తం చేయడమే దాని ప్రధానాశయంగా కనపడుతున్నది. ఇంగ్లీషు ప్రపంచానికి గెయల్ భాష రుచి నిచ్చే ఉప్పు! ఈ భ్రష్ట ప్రపంచలో ఐరిష్ వాళ్ళెక్కడికి పోయినప్పటికీ అక్కడక్కడల్లా చర్చిలూ, మఠాలూ, అనాధ శరణాలయాలూ, పాఠశాలలూ, స్థాపించి, వాటిని తమ స్వార్థరహితమైన కృషితో కాపాడుతున్నారు.

మూడవ శతాబ్దంలో రోమన్ కతోలిక్కుల్ని గూర్చి 'టెర్టులియన్' (Tertullian) మాట్లాడిన ప్రశంసా వాక్యాలు, నేటి ఐరిష్ కతోలిక్కులైన వీళ్ళకూడా చెందేంత గొప్ప పలుకుబడిని సాధించారు.

"స్వేచ్ఛగా దైవ ఆరాధన చేసుకోడానికి ఈ నాడు మేం సంపాదించిన స్వాతంత్ర్యం మొన్న మొన్నటిదే. ఇప్పటికే మేం మీా పట్టణాల్లో, మీా రాజకీయ సభల్లో, మీా సైన్యంలో, మీా పార్లమెంటులో

నిండి పోయాం. శతాబ్దాల తరబడిగా మీరు మమ్ము దారుణంగా హింసించారు. జాగ్రత్త! మా త్యాగమూర్తులు ధారపోసిన ప్రతి రక్త కణం లోంచి వందల కొలదిగా పుట్టుకొస్తాం".

మూడవ శతాబ్దంలోలాగా 20వ శతాబ్దంలోకూడా పటిష్టంగా ఉన్న ఆ కతోలిక్కు విశ్వాసమే ఐర్లండు ఘన విజయంలో గల గొప్ప రహస్యం. ఆమె అంతిమ విజయాని క్కూడా ఆ గొప్ప రహస్యమే కారణమౌతుంది. ఈ కతోలిక్కు విశ్వాసం వాళ్ళను ఐహికాధికారానికి అవిధేయులుగా చేయలేదు. పైగా అది, స్వార్థరహిత మైన దృష్టితో, చాలా వినయ విధేయతల్తో ప్రవర్తించింది. ఆ విషయం ఐర్లండు కతోలిక్కు హృదయా న్నర్థం చేసుకొన్న వాళ్ళు మాత్రమే గ్రహించగల్గుతారు.

దేశానికి అపాయం తటస్థించినప్పుడల్లా వాళ్ళు దాన్ని ఎదు ర్కోడానికి నడుం గట్టి ముందుకు దూకారు. ఈనాడు 300,000 మంది యుద్ధరంగంలో పోరాడ్తున్నారు. వాళ్ళతో బాటు ఐరిష్ రక్తం గల వాళ్ళు దాదాపు ఒక మిలియన్ మంది యున్నారు. ప్రతి దేశంలో వాళ్ళు జాతినిర్మాణ దక్షులుగా ప్రసిద్ధి పొందుతున్నారు. ఈ ప్రసిద్ధికి వాళ్ళ ఉన్నతా దర్శాలే కారణం. భగవంతుడి కోసం బాగా పరిశ్ర మించే వ్యక్తులే మానవుడి కోసం పరిశ్రమిస్తారు.

భూగర్భ కందరాల్లో రహస్యంగా జీవితం గడిపిన కతో లిక్కుల్ని గూర్చి మాట్లాడ్తూ, వాళ్ళు త్యాగమూర్తుల రక్త తర్పణం వల్ల శక్తి సంపన్నులైనారని 'టెర్టులియన్' చెప్పినట్లుగా, ఐర్లండు కూడా తన త్యాగమూర్తుల రక్త అర్పణం ద్వారా మహత్తరశక్తినీ, ఘన విజయాన్నీ సాధించి చావ బోయే ప్రపంచం మీద ఆశీర్వాద పూర్వకంగా ఐర్లండు రక్తం చిలక బడింది. అది వేయిరెట్ల బలాన్ని చేకూర్చింది.

ఐరిష్ జాతి ప్రపంచపు నాల్గు చెరగులా చెల్లాచెదరై పోవుటకు దైవము మానవునికి అనూహ్యమైన తన అనంత జ్ఞానంతో అనుమ తించెను. తన స్వదేశంలో నిరాకరింప బడ్డ స్వేచ్ఛకోసమై దేశబహి ష్కృతులైన ఐరిష్ వాళ్లు జలమార్గాలన్నీ తరలిచారు. వారితో గలసి

వారి దైవ భక్తి సాంప్రదాయమును కొంపోవుటే గాక తమ గురువు లను గూడా తోడ్కొని వచ్చిరి. దేశ బహిష్కృతులైన యిజ్రాయేలు నివాసులు తమ పవిత్ర భూమిని పరిత్యజించి దుఃఖ నిమగ్నులై దేశాలు పట్టుకొని తిరుగుతూ, ఆర్క్ ఆఫ్ ది కావెనెంట్, వాగ్దత్తపు పెట్టెనుతమకు జీవితాధారంగా యెల్లప్పుడూ ఎలాఅంటి పెట్టుకొని ప్రవర్తించారో, అట్లాగే దేశ నిర్వాసితులైన ఐరిష్ వాళ్ళుతమ పవిత్ర దేశాన్ని వదలి,దుఃఖ మనిగ్నులై తిరుగుతూ ఆ వాగ్దత్తపు పెట్టె కంటెమహత్తరమైన, పావనమైన, దివ్య సత్ప్రసాదా న్వితమైన దైవమందసాన్ని, తమకు శరణ్యంగా, ప్రాణాధారంగా అంటిపెట్టుకొని జీవించారు. జాతుల బలంతో బాగా బలిష్టమై వాళ్ళు ఆర్కిటిక్ మంచు ప్రదేశాల్లో, అత్యుష్ణ ప్రదేశాల్లో, అమెరికా ప్రయరీ, పంపామైదానాల్లో, ఆఫ్రికా యిసుక నేలల్లో, ఆసియా పర్వత ప్రాంతాల్లో, ఆస్ట్రేలియా విశాల మైదానాల్లో జేసు నాథుడి స్లీవను నాటి ప్రతిష్టించారు.

ఐరిష్ వాళ్ళు చెల్లాచెదరైపోవడం, ఆశ్చర్యాల్లో కల్లా ఆశ్చర్యమైన విషయం. ఈవిషయాన్ని యీనాడు జ్ఞాపకం చేసుకోవడం, ఐరిష్‌వాళ్ళలో క్రోధద్వేషాలు రెచ్చగొట్టటంగాని, వాళ్ళను హింసించిన, వాళ్ళ మనస్సులగాయం చేయడంగాని, అసలు వుద్దేశ్యమే కాదు. కతోలిక విశ్వాసం చేత తమ్ము హింసించ వచ్చిన వాళ్ళనూ, తమ మాతృదేశాన్ని సంరక్షించిన రోమన్ మృత్యురంగ స్థలంలో వేద సాక్షులైనవాళ్ళను తిరుసభయొక్క మహత్తరమైన విశేషాల్లో ఒకటిగా ఎట్లు గుర్తుకు తెచ్చుకుంటామో, అట్లాగే ఐరిషీయుల విషయం కూడా జ్ఞాపకం చేసుకొంటున్నాం. ఇట్లా చెల్లాచెదరై పోయినందువల్ల కల్గిన అత్యద్భుత ఫలితాలు ఐర్లండు చరిత్రలో ఒక మహాధ్యాయాన్ని సృష్టిస్తయ్. ఈఫలితాలు తిరుసభయొక్క తరగని స్థైర్యానికీ, శాశ్వతమైన బలానికీ, మహాచైతన్యానికీ, బ్రహ్మాండమైన స్మృతి సాధాలు.

ఐరిష్‌జాతి చెల్లాచెదరై పోవడంవల్ల, ప్రపంచ చరిత్రలో, తిరుసభ చరిత్రలో కల్గిన ఫలితాల ప్రభావాలు పరిగణనాతీతాలు. ఆప్రభావాలు భూభాగమంతా వ్యాపించినై. ఆ ప్రభావాల శక్తి మానవాతీతం. అది నిజంగా బలవంతుల ఆటలు కట్టించడానికి బలహీనులచేత

కావింపబడిన దైవసంఘటన. గుండెలు పగిలి దుర్భర దారిద్ర్యంతో క్రుంగి కృశించినవాళ్ళు" ఐహిక దృష్ట్యాతమ దేశాన్ని వదలి అనాథలై పరదేశాలకు పారిపోవడం మనం గమనించాం. ఐనప్పటికీ దాని ప్రతి ఫలాన్ని గమనించండి! దైవశక్తితో మహా బలవంతులైన వీళ్ళుసర్వా భ్యుదయ ప్రదాలైన దేవాలయాలూ మఠాలూ, అనాథ శరణాల యాలూ పాఠశాలలూ అసంఖ్యాకాలుగా దేశదేశాల వినిర్మించారు.

సెయింట్ పాట్రిక్ పండుగను చేసుకోడానికి మొత్తం ఐరిష్ వాళ్ళు చూపించే గాఢాను రాగ యుక్తమైన ఉత్సాహంతో వీళ్ళ శక్తి సామర్థ్యాలువెల్లి విరుస్తయ్. ప్రపంచాన్నంతా ముంచెత్తే ఒక బ్రహ్మాండ మైనతరంగం మాదిరిగా వెల్లి విరిసే హృదయ పూర్వకాను రాగంతో వాళ్ళుచూపించే భక్తి శ్రద్ధల్ని తిలకిద్దాం.

ఆ రోజు సూర్యోదయం వేళకు విశ్వాస కాంతి ప్రబోధితమైన ఐర్లండు జాతి మొత్తం మొత్తం అత్యుత్సాహంతో ఉంటుంది. నగర వీధుల్లో, మైదానాల్లో, కొండలోయల్లో నదీతీరాల్లో గుండా అందరూ తమ భగవంతుడి దైవపీఠం వద్ద మోకరించడానికి తండోప తండాలుగా మహా వేగంతో బైలుదేరి వస్తున్నారు. ఆ బురద నేల గుండా మార్గం చేసుకొని ఆ పర్వతం పక్కనున్న చిన్న చర్చికి జనం వస్తు న్నారు. పల్లెల్లోని చిన్న చర్చీలు, పట్టణాల్లోని పెద్దపెద్ద చర్చీలు క్రిక్కిరిసి పోయినై. భగవంతుడి భూలోక సింహాసనం ముందు మోక రించి దైవప్రార్థనల్ను జరిపే ఆ భక్తుల భక్తిగీతాల్తో ఐర్లండంతా ప్రతిధ్వనించి పోతున్నది.

సూర్యునితో పాటు భూప్రదక్షిణం చేసి సముద్రాల కవ తలగా ఐరిష్ వాళ్ళు జరుపు తున్న ఈ గొప్ప పండుగను తిలకించు! పశ్చిమ ఖండాల సూర్యోదయ కాంతితో మెరిసి పోయే దాకా, ఆ సూర్యుడు అనంతమైన అట్లాంటిక్ సముద్రానికి చేరేంత వరకూ, ఆయనతో పాటు పో! ఆ తరంగాలకు పైగా స్వాగతం చెప్తూ చేతులు చాచి ఉన్న ప్రసిద్ధమైన స్వేచ్ఛా స్మృతి స్వరూపం కనపడు తుంది. మనం న్యూయార్కు నగరాన్ని చేరితే మనక్కడ మరో స్వేచ్ఛా

స్మృతి స్వరూపం కనపడ్తుంది. నిజమైన స్వేచ్ఛను తెలిపే మహోన్నతమైన సౌధ మది! భగవంతుడి స్వేచ్ఛ కోసం నిర్మించ బడ్డ ఆ సౌధం ఆ బలిష్టమైన భూఖండానికి అన్ని విధాలా తగి పోయింది. దేశాంతర గతులైన ఐరిష్ దరిద్ర జీవుల అనన్యమైన కృషిచే నిర్మింప బడ్డ స్మృతి సౌధ మది. ఏమిటీ స్మృతి సౌధం? స్వచ్ఛమైన పాల రాతితో వినిర్మింపబడ్డ గోపురాగ్రంతో ఆకాశాన్నంటేంత ఎత్తుగా జేసునాథుడు స్లీవను ధరించి ఉన్న బ్రహ్మాండమైన సెయింట్ పాట్రిక్ చర్చి అది. అర్చ్య॥ పాట్రిక్ పండుగ రోజున ఉదయాన్నే, హృదయం పై ఐర్లండు జాతీయ చిహ్నాన్ని ధరించి వచ్చిన అసంఖ్యాక ప్రజానీకం తో ఈ చర్చి క్రిక్కిరిసి పోతుంది. ఒక్కసారిగా అర్చ్య॥ పాట్రిక్ స్తోత్రగీతాల్తో, ఆ చర్చి మొత్తం మధుర గానం చేస్తుంది. దేశ నిర్వాసితుడైన ఆ ఐరిష్ వ్యక్తి తన కొండ ప్రదేశాన్ని, పొలాన్ని, నదీతీరాన్ని, ఆ పచ్చిక మైదానాన్ని, సెయింట్ పాట్రిక్ గత జావితాన్ని గుర్తుకు తెచ్చుకొంటూ కళ్ళవెంట నీళ్ళు కారుతుండగా తన హృదయాన్ని దైవార్పితం చేసి భక్తి పారవశ్యంలో మున్గి తేలుతాడు.

సూర్యుడు పశ్చిమ దిశకు చేరి, చీకట్లు క్రమ్మిం తర్వాత రోడ్ల మీద, కాల్వల వెంటా, నదీతీరాల్లో, పర్వత లోయల్లో అన్నిచోట్ల ఐరిష్ వాళ్ళు తమ భగవంతుడికీ, తమ ప్రవక్తకూ అభివందనాలు తెల్పడానికి హడావుడిగా ప్రయాణాలు సాగిస్తారు.

తెల్లవారిం తర్వాత పసిఫిక్ మహా సముద్రంలో ఉన్న దీవుల్లో సెయింట్ పాట్రిక్ పండుగ దినాన్ని చూస్తాం.

న్యూజిలాండు మంచు కొండల నీడల్లో గుండా, అభయంకరార ణ్యాల్లో గుండా దేశాంతర్గతులైన ఐరిష్ వాళ్ళు ప్రయాణాలు సాగిం చారు. తమ విశ్వాసానికి సాక్షీ భూతాలుగా తమకుతాము కట్టుకొన్న చర్చిల్లో వాళ్లు సమావేశ మౌతారు. భూభాగానికి చిట్టచివరి అంచుల్లో కూడా వీళ్ళు సెయింట్ పాట్రిక్ స్తోత్రగానం చేస్తారు.

టాస్మేన్ సముద్రం దాటిపోతే మనం సూర్యోదయ కాలానికి ఆస్ట్రేలియా విశాల శాద్వల భూముల్ని చూస్తాం. ఆ పచ్చిక మైదా

నాల్గో హడావుడిగా ప్రయాణం చేస్తున్న జనం గోచరిస్తారు. దక్షిణ ఆస్ట్రేలియాకు ప్రధాన నగరమైన మెల్బోర్న్‌లో ఒక బ్రహ్మాండమైన చర్చి ఉంది. ఆ సముద్రతీరానికి వచ్చిన వెంటనే మన ఐరిష్ వ్యక్తిదృష్టిని ప్రప్రథమంగా ఆకర్షించింది ఈ దేవాలయమే. తమకు పూర్వ పరిచితమైన సెయింట్ పాట్రిక్ పవిత్ర నామధేయం కల్గిన చర్చి అది, అని అతడు తెలుసుకోగానే అతడి కష్టాలన్నీ నిముసంలో మటుమాయమై పోయినై.

ఉత్తర దిశకు చూడు! పచ్చని పైర్లతో ఆవరింపబడి, యూకలిప్టస్ వృక్ష సమూహంతో సగం కప్పబడి పర్వత శిఖరాల నధిష్ఠించి ఒంటరిగా లోయల్లో నిలబడి, ప్రతి చోటా చర్చి వెంట చర్చి, మఠం వెంట మఠం, పాఠశాల వెంట పాఠశాల మనకు దృష్టి గోచరమౌతై. వాటి మధ్యలో మనకు పెద్దపెద్ద దేవాలయాలు గోచరిస్తయ్.

అందమైన సిడ్నీ నౌకాశ్రయాన్ని సంరక్షిస్తూన్న ఆ ప్రదేశంలో సముద్రాభి ముఖంగా సెయింట్ పాట్రిక్ దేవాలయం ఉంది.

'టూరెన్' నుంచి 'టాస్మేనియా' కు ఒకసారి దృష్టి మరలిస్తే ఆ పండుగ దినాన్ని ఆహ్వానించే ఘంటారావాలు వినపడ్తాయ్. వేలకు వేలుగా ఐరిష్‌వాళ్ళు దేవాలయాలకు హాజరౌతారు.

బంగారవు గనియైన పశ్చిమ ఆస్ట్రేలియాలో కూడా ఇటువంటి చరిత్రే. ఆసియాలో, ఆఫ్రికాలో ఒకచోటేమిటి అన్ని స్థలాల్లో ఐరిష్ వాళ్లు భగవంతుడి సింహపీఠాల్ని ప్రతిష్టించారు. అక్కడికి ప్రజలు తండోప తండాలుగా వచ్చి చేరుతారు. పూజబలి శిలాఫలకం యొక్క అత్యద్భుతమైన విశ్వరూప దర్శనం! ఐర్లండులోని పూజబలిశిలాఫలకము సర్వత్రా వ్యాపించింది.

ఇరవైనాల్గు గంటలూ, అర్చ్బి. పాట్రిక్ ద్వారా దేవుడికి చెల్లించే స్తోత్రాల్తో భూమి ప్రతిధ్వనించి పోతున్నది! తూర్పు నుంచి పశ్చిమ దిశాంతం వరకూ, ఉత్తర ధృవం నుంచి దక్షిణ ధృవం వరకూ సెయింట్ పాట్రిక్ పర్వదినంలో వినబడే స్తోత్రగీతాలకు

ప్రపంచం విముగ్ధమై పోయింది! ఐరిష్‌వాళ్ళ ఆ ఉత్సాహాతిశయాలు ప్రపంచాన్నే కదలించి వేసినై!

అటువంటి బ్రహ్మాండమైన గత చరిత్రలో అత్యద్భుతమైన శక్తితో కూడిన ఈ నాటి చరిత్రతో ప్రసిద్ధిపొందిన ఐర్లండు భవిష్యత్తును గూర్చి పలికిన ఈ మాటలు సాహసోపేతాలని ఎవడన గలడు?

తరుణమూర్తి అభ్యుదయ భాస్కరుని కిరణ
జాలములకు సంకోచించు జాతులెల్ల
దైవ విశ్వాసమును వీడి ధరణి కలియు
దుర్భరావమానమ్మున తుదకు; కాని
సర్వలోకేశు దివ్యహస్త ద్వయమ్ము
సాగి నీపైన శీతల చ్ఛాయ లొసగు.
జాగృతిన్ పొందిన పిదప జాతులెల్ల
మించి ముదమున నిన్ను కీర్తించు నట్లు
యుగయుగాలుగ నీకు దివ్యోపదేశ
మొసగుచున్నాడు ప్రభు జేసు పసిడి తల్లి!

* * *

ఎచటో ఏ మారు మూలనో ఎవ్వరికిని
తెలియగారాని ఏ మహా జలధి గర్భ
పులిన తలము లందుననో అపూర్వ గతిని
వెలసియున్న దేశములకు ద్వీపములకు
సైతమున్ పోయి, నీదు దేశస్థు లచట
జేసునాథుని దివ్య యాశీర్వచన్ము
పలికి, ఆయన దివ్య బోధలను చెప్పి,
ప్రభుని మహిమమ్ము అచ్చట బాగ ప్రబల
చేయుదురు తల్లి! ఇహలోక సిద్ధులెల్ల
వారలకు తృణప్రాయమ్ము, వా రతీత
శక్తి సంపన్ను లా జేసు శక్తితోడ
నిలచి స్లీవ ధరింతురు నిఖిల దిశల.

“ఐర్లండు ఐరోపాఖండంయొక్క గాథ విశ్వాసాన్ని చూరగొనవచ్చు. అమెరికాకు మార్గదర్శిని కావచ్చు.”

అని మూడువందల సంవత్సరాలకు పూర్వం పరిశుద్ధ పాపుగారి వల్ల ఐర్లండుకు పంపబడిన దూత, రోముకు ఐర్లండును గూర్చి పై విధంగా వ్రాసాడు.

ఆ దూత, మనం ఇప్పుడు మన ప్రయాణంలో చూసిన విశేషాలు చూడ కల్గినట్లయితే ఈరో జత డిట్లా వ్రాసి ఉండేవాడు.

“ఐర్లండు ఐరోపాఖండం విశ్వాసాన్ని చూరగొన్నది. అమెరికా, ఆఫ్రికా, ఆసియా, ఆస్ట్రేలియా ఒకటేమిటి? సర్వ ప్రపంచానికీ మార్గ దర్శినిగా ఉంది.

స్వదేశంలో పర్వత ప్రాంతంలో ఉన్న చిన్న గుడిలో గానీ, విదేశాల్లో బ్రహ్మాండమైన దేవాలయములో గానీ మోకరించి ఉన్నప్పుడు, తన ఇంట్లో ప్రశాంతంగా కాలక్షేపం చేస్తున్నప్పుడు గానీ, లేక స్వదేశ రక్షణార్థం యుద్ధ భూమిలో పోరాడ్తున్నప్పుడు గానీ ఐరిష్ వ్యక్తి నిర్భయంగా నిలబడి తనకు సంక్రమించిన ఆ గొప్పదనమంతా, సగర్వమంతా అర్చ్బి. పాట్రిక్ ద్వారా తనకు సంక్రమించిన గొప్పదనం అని సగర్వంగా చెప్తాడు. అది మన పవిత్రమైన కతోలిక్కు విశ్వాసం!

ఈ ఘన విజయం ఆమెది. ఎందుకంటే, ‘ఎమాస్యూలెట్’ పవిత్ర సాక్షాత్కారాన్ని ఆమె గుర్తించి ఆరాధించింది. దైవమందసాన్నుంచి ప్రసరిస్తూ లోకాన్ని వెలిగించే దివ్య కాంతి పుంజాల్లో, ఎరిన్ సంతానం జీవయాత్ర సాగిస్తున్నది.

దివ్యసత్ప్రసాద మందసమే అతడి సర్వస్వం. అదే బెత్లెహేము పశువులపాక అదే నజరేత్ పవిత్ర గృహం. అదే పుణ్యక్షేత్రం. అదే కడర భోజనశాల. అదే జేసుస్వామి రక్త బలి సమర్పించిన కాల్వారీ గిరి. పుట్టీ పుట్టక ముందే అతడు జ్ఞానస్నాన స్వీకృతి పొంది

దేవుని బిడ్డగా పరిగణింప బడటానికి, దైవమందసం వద్దకు తీసుకు పోబడతాడు. మేత్రాణుల నుంచి భద్రమైన అభ్యంగనాన్ని పొంది, తిరుసభ సైన్యంలో చేరటానికి, ఆ దైవమందసం ముందు అతడు మోకరిల్లుతాడు. ఆ పీఠం వద్దనే అతడు దివ్యసత్ప్రసాదం స్వీకరిస్తాడు. ఐహికాడంబరంతో, ఇంద్రియ సుఖ వాంఛల్తో, పాపంతో, దుఃఖంతో నిండి ఉన్న వ్యసన భూయిష్టమైన ప్రపంచంలో నుంచి అతడా పంచకు చేరుతాడు.

పాపసంకీర్తనం ద్వారా అతడి హృదయ భారం అదృశ్యమై పోతుంది. అతడి మనస్సు పరిపూర్ణానందంతో ఊగిసలాడి పోతుంది. అతడికి జీవితంలో భాగస్వామిని లభించి నప్పుడు, ఆమెతో సహా అత డక్కడికి వస్తాడు. జేసునాథుడు, ఆ పవిత్ర హృదయాల్ని రెంటినీ, తన దివ్యహస్తములతో స్వీకరించి, ఆ పవిత్ర వివాహంలో ఇద్దరూ ఏకమై పోయేటట్లుగా వాటిని మలుస్తాడు. అతడు చనిపోయిన తర్వాత మళ్ళీ జేసునాథుడి ప్రమోలకు దేవాలయానికి కొనిపోబడ్తాడు.

ఐర్లండు ఐర్లండుగా ఎందుకున్నదో,? ఐర్లండు ఎల్లప్పుడూ ఐర్లండుగానే ఎందుకున్నదో? మన కిప్పుడు తగిన హేతువు లభించింది. అర్చ్య. పాట్రిక్ చే ఆమె కోసం నిర్మించబడ్డ మార్గంలో ఆమె పయ నించింది కాబట్టి ఆమె ఘన విజయాన్ని సాధించింది. ఆ మార్గం చాలా కఠినమైంది. బాధామయమైంది. తరతరాల ఐరిష్ వాళ్ళ కన్నీటితో తడుపబడ్డ మార్గమది! తరతరాల ఐరిష్ వ్యక్తుల పవిత్ర రక్తంతో అరుణారుణమైన మార్గమది, కానీ గౌరవం నుంచీ, పవిత్రత నుంచీ తొలగని మార్గమది! తమ ఘన విజయల్తో పరమానంద పరవశత్వం చెందు చున్న ఐరిష్ ప్రజల్ను, అర్చ్య పాట్రిక్ ఉన్న, ఉన్నత స్థానానికి తీసు కొని పోయే మార్గమది!

పతిత మానవ జాతి బ్రతుకులు పండింప
సాగి వచ్చిన సుధాసార ఘనుడు;
సత్య ధర్మాహింస శాంతి సౌభాగ్యముల్
మూర్తి కట్టిన పుణ్యముల వెలుంగు;

ఒక చెంప గొట్ట వేరొక చెంప చూపించి
మందహాసము చేయు మధురమూర్తి;
తన పవిత్ర రుధిర దాన ధారల, దౌష్ట్య
దాహ మార్చిన మహా త్యాగ శీలి
కన్యమరియమ్మ కడుపు బంగారు పంట,
జేసునాధుని చరణ రాజీవ యుగళి
చంద్రునకు నూలు పోగన్న సామెతగను
హృదయ పూర్వకముగ సమర్పింతు దీని.



# విషయ సూచిక.







# కఠిన పదములకు అర్థములు.

పుట.

2. విశిష్ట చరిత్ర = శ్రేష్ఠమైన చరిత్ర,
భాషాంతరీకరణము = ఒక భాష నుండి మరియొక భాషలోనికి అర్జుమా చేయడము,
ఘట్టాలు = విషయములు,
తన్మయులు = వాని రూపముగలవారలు,
కృతకృత్యులు = కోరిక ఈడేరినవారలు.

3. ఉన్మాదులు = పిచ్చివారలు,
గాథ = కథ, చరిత్ర.
నిష్కాపట్యము = కపటములేమి.

4. పునర్విజృంభణము = తిరుగ వికసించడము, ప్రకాశించడము.

5 కలాపాలు = మాట్లాడు కోడము.
సహనబుద్ధి = (సహించు) ఓర్పుగలిగి ప్రవర్తించు బుద్ధి.

6 విరాగానికి = ఇంద్రియ సుఖాలను లెక్క పెట్టకుండడము, విరక్తి.
మానవాతీతము = ప్రకృతిని మించిన.
చరిత్రాత్మకమైన సంఘటనను = చరిత్రకు సంబంధించిన విషయాలు.
ప్రబోధము = మిక్కిలి తెలివి, జ్ఞానము.
నగ్న = ఉత్త, వట్టి, దిగంబరము.

7 ఆధ్యాత్మిక = ఆత్మ సంబంధమైన.
నిశితము = మిక్కిలి వాడిచేయబడిన
తిష్ట = ఎర, సాయంత్రము బలిగా సమర్పింప బడిన అన్నము, మొదలైనవి.

9 ఉదాత్తము = గొప్ప, ఉదారము.
వినీలము = నల్లని.
కాందిశీకులు = పరదేశమునకు వెళ్ళ గొట్ట బడినవాళ్ళు.
ధూసరము = గోధుమ వర్ణముగల

పుట.

హరితశాద్వలా = అకుపచ్చని లేత పచ్చికగల భూమి.

10 చుంబించు = ముద్దుపెట్టుకొను

11 మనోజ్ఞము = సుందరమైన, మనోరంజకమైన
అవ్యాజము = కపటములేని, నిష్కాపట్యమైన
అధిరోహించి = ఎక్కి

12 సాహస యుతమైన = సాహసంతో కూడుకొన్న

13 దిఙ్మండలము = దిక్కున ఉన్న ప్రదేశము

14 అవలోకము = పెల్లప్పుడు

15 ఉత్తుంగము = పొడవైన, ఎత్తైన.
తరంగము = అల
హతుడు = కొట్టబడినవాడు, చంపబడినవాడు.
నూతనాగంతకుడు = క్రొత్తగా వచ్చినవాడు.

16 అరుణ = ఎర్రని

17 మకుటాయమానంగా = కిరీటము మాదిరిగ
సేతువు = వంతెన, కట్ట.
బహిః = వెలుపలి, బయట.

18 అవనత = వంచుకొనిన.

26 సరస్తీరాల్లో = సరస్సుల ఒడ్డులలో
గూఢమైయున్న = దాగియున్న
సునిశిత = సూత్మ

27 సస్యశ్యామలాలు = పచ్చని పైరు
సుభాషితాలు = మంచి వాక్యాలు.
దైనిక = దిన

28 అస్పృశ్యుడు = అంటరానివాడు.
జీర్ణ కుటీరము = పడిపోవు చున్న గుడిసె.

పుట.

స్వేచ్ఛా ప్రచారి = స్వేచ్ఛను నొసంగువాడు.

29 సన్నిహితంగా = దగ్గరగా

30 ఘంటానాదము = గంట శబ్దము.

నిమగ్నులు = మునిగియున్నవారు.

31 యాతన = కష్టము

33 సజల నయనాలతో = కన్నీళ్లతో గూడుకొన్న కళ్లతో.

34 దృక్పథము = చూచు విధము.

దాతృగుణము = ధారాళ గుణము.

విస్మృతిపాలైన = మరపునకు గురియైన.

35 మరణోన్ముఖులైన = మరణించుచున్న.

37 మోహపెట్టింది = భ్రమ పెట్టింది.

ఉత్తరార్ధము = శతాబ్దములో మొదటి ఏబది సంవత్సరములు దాటిన తర్వాత.

38 విజేతలను = జయము పొందిన వారలు.

45 జాజ్వల్యమానము = మిక్కిలి ప్రకాశించుచున్న.

విషాదము = దుఃఖము.

47 ఆర్ద్రిత = చెమ్మగిల్లిన, దయ

49 సహనము = ఓర్పు.

50 శోకాశ్రువులు = దుఃఖముచే వచ్చిన కన్నీళ్లు.

52 ధీరోదాత్తుడు = ధీరత్వము కల్గిన వాడు.

ఉద్ధృతాన్ని = తీవ్రతను.

54 ధూళి ధూసరితము = దుమ్ముచే నిండిన

55 నిర్వాసితుడు = నివసించుటకు చోటులేని వాడు.

అరుణ + అరుణము = ఎర్రని ఎరుపు

అధర చుంబనాస్పర్శ = పెదవుల ముద్దు స్పర్శ.

పుట.

56 రుధిరము = రక్తము.

58 సర్వే సర్వత్రా = అన్నిచోట్ల, అన్ని ప్రాంతాల్లో.

59 అనుశ్రుతము = ఐతిహ్యము, (Tradition) పారంపర్యము.

61 కీకారణ్యావృతము = పెద్ద అరణ్యాలచే ఆవరింపబడిన.

63 ప్రణామము = దండము, నమస్కారము.

64 ప్రపత్తులు = శరణుచొచ్చడము.

66 ఆమూలాగ్రంగా = పూర్తిగా, సాంతంగా=అంతా.

అయస్కాంతము = ఇనుమును ఆకర్షించునది - సూదంటురాయి.

67 మందస్మితము = చిరునవ్వు.

కౌమారదశ = యౌవనదశ

68 శాద్వల = పచ్చిక

భరద్వాజం = ఒకానొక పక్షి.

71 ప్రవృత్తి = నడవడి, స్వభావం, ఉద్దేశ్యము.

78 అంబరచుంబి = ఆకాశమును ముద్దు పెట్టు, అంటి

83 స్నిగ్ధనీల = నునుపైన నల్లని.

89 అజేయుడు = జయింపబడినవాడు.

91 సౌభ్రాతృత్వము = సహోదర భావము.

94 వక్రత = వంకర, కుటిలత.

100 వీరోచిత = వీరులకు ఉచితమైన.

101 నిర్వహణము = నెరవేర్చడము.

102 జంబాలము = బురద, అడుసు.

104 భూపతనము = భూమిమీద పడుట.

తత్వవేత్త = వేదాంతి.

రక్తసిక్తము = నెత్తురుచే తడిసిన.

105 క్షణికము = కొద్దికాలం ఉండునటువంటి.

పుట.

మిషతో : సాకుతో, నెపముతో.
దర్పణాలు : అద్దములు
158 భౌతిక : ఐహిక పదార్థ సంబంధమైన
తుపాను ఘాత : తుపాను దెబ్బ
159 ఏమర్లే దన్నది : మరచిపోలే దన్నది, గుర్తించా రన్నది.
160 విశిష్టత : ప్రత్యేకత
మహాంబుధి : మహాసముద్రము
162 స్మృతులు : జ్ఞాపకములు
సారస్వతం : భాష, వాఙ్మయం.
163 నిర్దుష్టం : చెడు లేకుండా, లోపము లేకుండ, సాఫీగ
వ్యంగ్యానికి : ఎద్బెరికానికి
కొటకం : కలువు
దేశనిర్వాసం : దేశాన్ని విడచి పెట్టడం
164 జానపదసంగీతం : పల్లె ప్రాంతాల పాట
నైపుణ్యాన్ని : నేర్పరితనాన్ని.
165 నిస్వనం : ధ్వని
హర్షిస్తుంది : సంతోషిస్తుంది.
అగమ్య : గోచరముగాని
166 ఆర్తత్రాణ : కష్టాలలోనున్న వారికి రక్షణము
167 సామ్రాజ్యము : రాజ్యము
సామ్రాట్టు : రాజాధిరాజు
168 చకితుణ్ణి చేయుట : పులకరించునట్లు చేయుట.
ఉద్ఘోషిస్తున్నది : గట్టిగా అరచుచున్నది.
169 పాషాణాలు : రాళ్లు
వ్యామోహితము : భ్రమపెట్టబడిన.
శిరస్త్రాణాలు : బొమిడికములు, ఇనుపటోపీలు.
సంకీర్ణ : వ్యాపించిన, కలసిన.

పుట.

170 మహోద్ధృతంగా : ఎక్కువ తీవ్రంగా, ఎక్కువ గర్వంగా.
పరాభూతం : అవమానింపబడినట్లు
ప్రవక్త : చక్కగా మాట్లాడు వాడు, చాల గొప్పవాడు.
171 ప్రదాత : దానముచేయువాడు.
విజేత : జయించినవాడు.
ఆవిష్కరణ : ప్రకటన, వెల్లడి. (Revelation)
172 అమాత్యవర్గం : మంత్రుల సమూహము.
173 వధ్యస్థానం : చంపబడు ప్రదేశము
అవగాహన : అర్థము చేసుకొనుట.
174 హృదయ కుహరం : హృదయం లోపలి, హృదయపు గుహ.
పరిషత్తు : ఒక సభ్యులకూటమి
జిజ్ఞాసి : తెలుసుకోవలెననుకోరిక గలవాడు.
కాందిశీక శిబిరము : పారిపోయి వచ్చిన వారుండుచోటు.
176 అనూహ్యం : ఊహింప నలవిగాని.
177 అత్యుష్ణ : మిక్కిలి వేడియయిన.
చైతన్యానికి : ప్రాణానికి, తెలివికి, తేజస్సుకి.
పరిగణనాతీతాలు : పరిగణించటానికి వీలుగానివి. (మించినవి)
178 తిలకిద్దాం : చూద్దాం
స్మృతి సౌధాలు : జ్ఞాపకార్థంగా ఉండే మేడలు.
180 నౌకాశ్రయం : ఓడరేవు
సర్వత్రా : అంతటా
181 విముగ్ధమై : చలించినదై, క్రొత్తదనము గలినదై.
సాహసోపేతాలు : సాహసంతో కూడుకొనిన.
ద్వయమ్ము : రెండు

